# శ్రీవిద్యా దర్పణము




క్రోవి పార్థసారథి

# శ్రీవిద్యా దర్పణము

(గౌడపాదాచార్య విరచిత 'సుభగోదయస్తుతి'కి తెలుగువ్యాఖ్య)

*గ్రంథకర్త :*

**సువర్ణఘంటాకంకణ, కనకాభిషేక గ్రహీత,**

**చక్రవిద, శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద,**

**డా॥ క్రోవి పార్థసారథి**

ప్రతులకు :

**శివకామేశ్వరి గ్రంథమాల**

**41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక, విజయవాడ - 13.**

**ఫోన్ : 0866-522824**

# శ్రీవిద్యా దర్పణము

*గ్రంథకర్త :* **డా॥ క్రోవి పార్థసారథి**
23-11/1-10/2, దేవీ నిలయం,
ఓగిరాలవారి వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011.
ఫోన్ : 530672

ద్వితీయ ముద్రణ : అక్టోబరు 2000

**వెల : రూ. 75-00**　　**వెల : రూ. 65-00**

ప్రతులకు :
**శివకామేశ్వరి గ్రంథమాల**
41-22/4-36, భ్రమరాంబాపురం,
కృష్ణలంక, విజయవాడ - 520 013.
ఫోన్ : 0866 - 522824

*ముద్రణ :*
**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
26-6-3, పాపయ్య వీధి,
గాంధీనగర్, విజయవాడ-3.
ఫోన్ : 0866 - 574828

# ప్రణతులు

శ్రీవిద్యకు ప్రామాణికంగా చెప్పబడే గ్రంథాలలో మొట్టమొదటిది "సుభగోయస్తుతి" దీన్ని శంకర భగవత్పాదులవారి పరమగురువైన గౌడపాదాచార్యులవారు రచించారు. ఈ గ్రంథాన్ని చదివిన తరువాతనే శంకరులవారు 'సౌందర్యలహరిని' వ్రాశారు అని ప్రతీతి. సౌందర్యలహరి సుభగోదయస్తుతికి వ్యాఖ్య వంటిదని పండితుల అభిప్రాయము. ఇది మొత్తం యాభైరెండు శ్లోకాలతో ఉన్న గ్రంథము. దీనికి తెలుగులో నేను వ్రాసిన వ్యాఖ్యానమే "శ్రీవిద్యా దర్పణము".

గతంలో 'శ్రీవిద్యా దర్శనము' వ్రాసేటప్పుడు, అందులో సుభగోదయస్తుతిలోని కొన్ని శ్లోకాలను ఉటంకించటం జరిగింది. అప్పుడే ఆ గ్రంథంకోసం ప్రయత్నం చేశాను కాని లభ్యం కాలేదు. కొంతకాలం తరువాత, పాత పుస్తకాల షాపులో దీని ప్రతి ఒకటి దొరికింది. దీనికి వ్యాఖ్య వ్రాద్దామా ? అని ఆలోచిస్తున్నప్పుడు గురుతుల్యులు శ్రీ గరిమెళ్ళ సోమయాజులశర్మగారు వ్రాయమని ప్రోత్సహించారు. అప్పటికి పాత పుస్తకాల షాపులో దొరికిన ప్రతి, లొల్ల లక్ష్మీధరుడు సౌందర్యలహరిలో ఉదహరించిన విషయాలు తప్ప నాకు మరింకే ఆధారము దొరకలేదు. ఆ తరువాత, వారణాసిలోని చౌకాంబ పబ్లిషర్స్‌వారు స్వామి అమృతానందులవారి వ్యాఖ్యతో ఉన్న ప్రతిని పంపారు. దీని కోసం సంత్సరంపాటు ప్రయత్నించాను. కాని లభ్యంకాలేదు. తీరా అది లభించేటప్పటికి ఈ గ్రంథ ముద్రణ కూడా కొంతవరకు పూర్తయింది. అందుకని అమృతానందులవారి వ్యాఖ్యను ఇందులో చేర్చలేకపోయాను. దీనిమీద ఏ ఇతర వ్యాఖ్యలు నాకు లభించలేదు.

ఈ గ్రంథ రచన ఆద్యంతము నడిసముద్రంలోని నావలాగానే సాగినా, చివరకు ఒకదరికి చేరగలిగింది.

అయితే లక్ష్మీధరుడు సౌందర్యలహరి వ్యాఖ్యలో 'సుభగోదయస్తుతిలో చెప్పినట్లుగా' అని కొన్ని శ్లోకాలు వ్రాశాడు. అవి నాకు దొరికిన గ్రంథాలలో లేవు. దీనిని బట్టి 'సుభగోదయస్తుతి' పేరుతో ఇంకొక గ్రంథం ఉన్నదని

తెలుస్తోంది. కాని లభ్యం కాలేదు. దైవికంగా నాకు దొరికిన గ్రంథంలోను, అమృతానందులవారి వ్యాఖ్యలోను, ఉన్న శ్లోకాలు మాత్రం ఒక్కటే.

ఈ గ్రంథంలో పాఠకులకు విషయం తెలియచేయాలనే తలంపుతో నాకు దొరికిన మేరకు శ్రీచక్రము యొక్క వివిధ రూపాలు, షోడశ నిత్యల యొక్క స్వరూపాలు, ధ్యానశ్లోకాలు కూడా ఇవ్వడం జరిగింది.

నేను అడగగానే ఈ గ్రంథమునకు శ్రీముఖములనిచ్చిన పీఠాధిపతులందరకు నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

ఈ గ్రంథ రచనకు నన్ను ప్రోత్సహించిన శ్రీగరిమెళ్ళ సోమయాజుల శర్మగారికి, మిత్రులు శ్రీ పింగళి వేంకట కృష్ణారావుగారికి, మల్లాది సుబ్రహ్మణ్య శర్మగారికి, ఈ గ్రంథమును పాఠకులకు అందించిన శివకామేశ్వరి గ్రంథమాల వారికి నా కృతజ్ఞతలు.

ఆద్యంతము నాకు అన్ని విధాల సహకరించిన నా శ్రీమతి రమాదేవికి అభినందనలు.

నన్ను కర్తను చేసి తన భక్తకోటికి శ్రీవిద్యా వివరణమందిస్తున్న ఆ జగన్మాత శ్రీలలితా త్రిపురసుందరి దివ్యచరణారవిందములకు ఈ గ్రంథాన్ని సమర్పిస్తున్నాను.

సామాన్య జనానికి కూడా అర్థం కావాలనే ఉద్దేశ్యంతో అతి సరళమైన శైలిలో నేను చేసిన ఈ ప్రయత్నాన్ని పండిత పామరులందరు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఈశ్వరనామ సంవత్సర
మార్గశీర్ష పౌర్ణమి
శనివారం 13-12-1997

బుధజనవిధేయుడు
**క్రోవి పార్థసారథి**

# విషయ సూచిక

# గ్రంథకర్త పరిచయం

పేరు : క్రోవి పార్థసారథి

వృత్తి, ఉద్యోగం : వాణిజ్యశాస్త్ర ఉపన్యాసకుడు, శాతవాహన కళాశాల, విజయవాడ

**ఇతర గ్రంథాలు :**

1. శ్రీవిద్యా దర్శనము
2. శ్రీవిద్యా దర్పణము (గౌడపాదుల సుభగోదయ స్తుతికి వ్యాఖ్య)
3. శ్రీవిద్యా రహస్యము
4. శ్రీవిద్యా సర్వస్వము
   (పుణ్యానందమునీంద్రుల కామకలా విలాసమునకు వ్యాఖ్య)
5. శ్రీవిద్యా హృదయము
   (యోగినీ హృదయానికి వ్యాఖ్య)
6. శ్రీవిద్యా పంచదశి
   (పంచదశీ మహామంత్రానికి వ్యాఖ్య)
7. శ్రీవిద్యా మహాయంత్రము
   (శ్రీ చక్రానికి విశేష వ్యాఖ్య)
8. దేవీకథాసుధ
9. భావనోపనిషత్తు
10. శ్రీచక్ర సర్వస్వము (ఆవిష్కరణకు సిద్ధము)
11. శ్రీచక్రవైభవము (ఆడియో క్యాసెట్టు)
12. పరమేశ్వరి - పరబ్రహ్మ స్వరూపము (ఆడియో క్యాసెట్టు)

**బిరుదులు :** శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద, శ్రీవిద్యానిధి, చక్రవిద

**సన్మానాలు :** 1) కనకాభిషేకము 13-12-1999న 'శ్రీవిద్యా మహాయజ్ఞము' ముగింపు మరియు మూడు గ్రంథాల ఆవిష్కరణ సందర్భంగా ఆరుగురు స్వామీజీల సమక్షంలో

2) 1-8-98న సువర్ణఘంటాకంకణ ప్రదానము.

సత్కారములు :

1. శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి దత్తపీఠం, మైసూరు
2. శ్రీశ్రీశ్రీ శివచిదానందభారతీ స్వామి సిద్ధేశ్వరీ పీఠం, కుర్తాళం
3. శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీస్వామి భువనేశ్వరీ పీఠం, గన్నవరం.
4. శ్రీశ్రీశ్రీ విద్యానంద నృశింహానంద భారతీస్వామి పుష్పగిరి పీఠం, పుష్పగిరి.
5. శ్రీశ్రీశ్రీ శివకళ్యాణానంద భారతీ మహాస్వామి శృంగేరి శ్రీ విరూపాక్ష పీఠం, గుంటూరు.
6. శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతి శారదా పీఠం, చినముషిడాడ, విశాఖపట్నం.
7. శ్రీశ్రీశ్రీ భైరవానందస్వామి మహాశాక్తేయ పీఠం, ఎండాడ, విశాఖపట్నం.
8. శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామి, విశ్వబంధు తపోవనం ట్రస్ట్ పెదపులిపాక, విజయవాడ.
9. శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్య చైతన్య తపోవనం ట్రస్ట్, తాడేపల్లి.
10. భగవాన్ బాలసాయి, కర్నూలు
11. విశ్వయోగి విశ్వంజీ మహరాజ్, గుంటూరు

ఇంకా అనేక చోట్ల, అనేసార్లు.

# శ్రీవిద్యా దర్పణము

(గౌడపాదాచార్యవిరచిత 'సుభగోదయస్తుతి'కి తెలుగువ్యాఖ్య)

## దేవిస్తుతి

*భవాని త్వాం వందే భవమహిషి సచ్చిత్సుఖ వపుః*
*పరాకారాం దేవీ మమృతలహరీ మైందవ కళామ్ ।*
*మహాకాలాతీతాం కలితసరణీ కల్పితతనుం*
*సుధాసింధోరంతర్వసతిమనిశం వాసరమయీమ్ ॥* **1**

భవానీ! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ! నీవు సచ్చిదానంద స్వరూపిణివి. పరాకారమైన దేవివి. అమృతలహరివి. అఖండ కాలమునకు అతీతులరావు. నిరాకారవు. అయినప్పటికీ మాయాశక్తి వలన కల్పించబడిన ఆకారముతో ప్రకాశించుచున్నావు. అట్టి బిందుస్వరూపిణి వగు నీకు నేను నమస్కరించుచున్నాను.

'భవాని' అనగా భవుని (శివుని) జీవింప చేయునది. ఇది ఎట్లనగా బ్రహ్మ విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను పంచబ్రహ్మలు అంటారు. త్రిపురా సిద్ధాంతమునందు, పరబ్రహ్మ మాయావిలాసముచే బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను పేర్లతో ఉన్నాడని' చెప్పబడింది. సద్యోజాత, వామదేవ, అఘోర తత్పురుష, ఈశాన అనునవి పంచబ్రహ్మలమంత్రములు. ఈ పంచబ్రహ్మల యందు ఐక్యము కలదగుటచేత దేవి పంచబ్రహ్మ స్వరూపిణి అయింది. బ్రహ్మాదులు ఐదుగురు వారివారి శక్తులు లేకపోయినట్లయితే వారి కార్యములు నెరవేర్చలేరు. అందుచేతనే శక్తిలేని ఆ బ్రహ్మను ప్రేతము అంటారు. ఆ రకంగా శక్తి హీనులైన పంచబ్రహ్మలచే కల్పించబడిన మంచమున దేవీ ఆసీనురాలైంది. అందుకనే దేవి 'పంచప్రేతాసనాసీన" అని లలితా సహస్రంలో చెప్పబడింది. ఈ పంచబ్రహ్మలకు చలనం రావాలి అంటే, జీవం కావాలి అంటే, ఆ దేవి

యొక్క కృప కావాలి. అందుచేతనే భవుని అనగా శివుని జీవింప చేయునది 'భవాని' అని చెప్పబడింది. అనగా పరమశివుడు కూడా శక్తి రహితుడైనట్లైతే నిర్జీవుడు అయినట్లే. **'వామకేశ్వరతంత్రంలో'** చెప్పినట్లుగా.

***పరోఽపిశక్తి రహిత శ్శక్త్యాయుక్తో భవేద్యపి ।***
***సృష్టిస్థితి లయాన్ కర్తు మశక్తః శక్త ఏవహి ॥***

పరుడు కూడా శక్తి రహితుడైనట్లైతే సృష్టి స్థితి లయాలు కావించడానికి అశక్తుడవుతాడు. శక్తి యుక్తుడైనట్లైతేనే ఆ పనులు చేయటానికి సమర్థుడవుతాడు.

***శింశుమారాత్మనా విష్ణుః భూరాదీ నూర్ధ్వతః స్థితాన్ ।***
***దధ్రే ! శేషతయా లోకాన్, సప్తలోకా నధస్థితాన్ ॥***

దేవి యొక్క అనుగ్రహంతోనే శ్రీమహావిష్ణువు శింశుమార రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను మోయగలుగుచున్నాడు. కాళిదాసు **'చిద్గగన చంద్రిక'**లో చెప్పినట్లుగా

***అంబ తావక పద ద్వయార్చక స్త్వ న్మయోభవతి నాత్ర విస్మయః ।***
***యస్త్వయైవ వివశో వశీకృతః శక్తిరేవ సమభూచ్ఛివః స్వయమ్ ॥***

అంబా! నీ పాదాలను పూజించేవాడు తన్మయుడౌతాడు. దీనిలో ఆశ్చర్యములేదు. శివుడుకూడా స్వయంగా శక్తి లేని వాడే కదా.

***సృష్టిస్థితి వినాశానాం శక్తి భూతే సనాతని ।***
***గుణాశ్రయే గుణమయి నారాయణి నమోఽస్తుతే ॥***

సృష్టిస్థితిలయాలకు కారకులుగా చెప్పబడే త్రిమూర్తులు కూడా శక్తి రహితులైనట్లైతే తమ కార్యాలు నిర్వర్తించలేరు. కాబట్టి సృష్టిస్థితి లయాలకు హేతువు ఆ దేవియే అని తెలుస్తోంది. అటువంటి ఆ దేవిని స్తుతించాలన్నా, ధ్యానించాలన్నా చివరకు ఆమెకు నమస్కరించాలన్నా, పూర్వజన్మ సుకృతం ఉండి తీరాలి. ఇదే విషయాన్ని శంకర భగవత్పాదులవారు **'సౌందర్యలహరి'**లోని మొదటి రెండు శ్లోకాలలోను వివరించారు.

***శివః శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం ।***
***న చే దేవం దేవో న ఖలు కుశలః స్పన్దితు మపి ।***

**అతస్త్వా మారాధ్యాం హరిహర విరిఞ్చాదిభిరపి ।**

**ప్రణంతుం స్తోతుంవా కథ మకృతపుణ్యః ప్రభవతి ॥**

అమ్మా ! ఓ భగవతీ ! సర్వమంగళ సహితుడగు శివుడు జగన్నిర్మాణ శక్తివైన నీతో గూడిననే జగములను సృజించుటకు సమర్థుడగును. అట్లు కాదేని అతడు కదలుటకు కూడ నేర్పరికాడు కదా । కావున హరిహర బ్రహ్మాదుల చేతను పూజింపదగిన నీకు మ్రొక్కుటకుగాని, నిన్నుపొగడుటకుగాని పుణ్యము చేయని వాడు ఎట్లు సమర్థుడగును?

**తనీయాంసం పాంసుం తవ చరణపఙ్కేరుహభవం ।**

**విరించిః సంచిన్వన్ విరచయతి లోకా నవికలన్ ।**

**వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం ।**

**హరః సంక్షుద్యైనం భజతి భసితో ద్ధూళనవిధిమ్ ॥**

ఓ మాతా! బ్రహ్మదేవుడు నీ చరణకమలమందు పుట్టిన ఇసుమంత పరాగమును గ్రహించి లోకములను ఎట్టి వైకల్యము లేకుండ సృజించుచున్నాడు. ఆ పరాగ కణమునే విష్ణువు ఆదిశేషుడై వేయి తలల మీద మోయుచున్నాడు. దానినే శివుడు చక్కగా మెదపి తన శరీరమునందు విభూతిగా బూసికొనుచున్నాడు.

మరి మహిమాన్విత అయిన ఆ దేవి ఎక్కడ ఉంటుందో శంకరులవారు **'సౌందర్యలహరి'** లోని **'సుధా సింధోర్మధ్యే'** అన్న ఎనిమిదవ శ్లోకంలో చెప్పారు.

**సుధాసిన్ధోర్మధ్యే సురవిటపి వాటీ పరివృతే ।**

**మణిద్వీపే నీపోపవనవతి చిన్తామణి గృహే ।**

**శివాకారే మఞ్చే పరమశివ పర్యఙ్క నిలయామ్ ।**

**భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానన్దలహరీమ్ ॥**

తల్లీ ! సుధా సముద్ర మధ్యమున మణి ద్వీపమున కల్పవృక్షములవనములచే చుట్టుకొనబడిన కదంబు తరువుల ఉద్యాన వనమునందు చింతామణి గృహమునందు, శివాకార మంచమున శివపర్యంక నిలయవై నిరతిశయానందతరంగరూపమగు నిన్ను కొందరు ధన్యులు మాత్రము సేవించుచున్నారు. (అందరికీ నీసేవ సామాన్యముగా లభింపదని భావము). ఇదే విషయాన్ని వామకేశ్వరతంత్రం, భైరవయామళం, బహురూపాష్ట కాలలో ఈ విధంగా చెప్పారు.

*బిందుస్థానం సుధా సింధుః పంచ యోన్య స్సురద్రుమాః ।*

*తత్రైవనీప శ్రేణీచ, తన్మధ్యే మణి మంటపం ॥*

*తత్ర చింతామణి కృతం దేవ్యా మందిర ముత్తమమ్ ।*

*శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే ॥*

*అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః ।*

*భృతకాశ్చ చతుష్పాదా మహేంద్రశ్చ పతద్గ్రహః ॥*

*తత్రాస్తే పరమేశానీ మహాత్రిపుర సుందరీ।*

*శివార్క మండలంభిత్వా, ద్రావయంతీందు మండలమ్ ॥*

*తదుద్భూతామృత స్యంది పరమానంద నందితా ।*

*కులయోషిత్కులంత్యక్త్వా, వరం వర్షణమేత్యసౌ ॥*

బిందు స్థానమే పాల సముద్రము. పంచయోనులే కల్ప వృక్షాలు. అక్కడ కదంబవనంలో, రత్నమంటపం మధ్యన చింతామణులతో నిర్మించిన గృహంలో, శక్తి రూపమైన మంచం మీద పరమేశ్వరుడు తలగడ, బ్రహ్మాదులు సేవకులు, ఇంద్రుడు తమ్మపడిగగా ఆదేవి సేవించబడుతూ ఉంటుంది.

ఇంతకీ ఆ బిందువు ఎక్కడ ఉన్నదీ ? **లలితా త్రిశతి ఫలశ్రుతి**లోనూ, భైరవ యామళం లోనూ కూడా **"త్రికోణే బైందవం శ్లిష్టం"** అని చెప్పబడింది. అనగా త్రికోణంలో బిందువు ఉన్నది అని అర్థం. మరి త్రికోణం ఎక్కడ ఉందనేది **'దేవీ తాపిన్యుపనిషత్తు'లో** చెప్పబడింది.

*"బైందవం బ్రహ్మరంధ్రంచ మస్తకంచ త్రికోణకమ్"*

దీనిని బట్టి బ్రహ్మరంధ్రమే బిందుస్థానము, మస్తకమే త్రికోణము. ఇది సమయమత రహస్యము. ఆ పరదేవతను చేరాలి అంటే, సాధకుడు ప్రాణాయామం చేసి నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని జాగృతం చెయ్యాలి. అపుడు ఆ శక్తి బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథులను ఛేదించుకుని, అనగా షట్చక్రాలను దాటి సహస్రారం చేరుతుంది. ఎప్పుడైతే కుండలినీశక్తి సహస్రారం చేరుతుందో అప్పుడు సాధకుడు చేతనారహితుడౌతాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆగిపోతాయి. కాలం స్తంభించి పోతుంది. ఆ దేవి అఖండ కాలమునకు అతీతురాలు.

అందుకనే దేవిని గౌడ పాదాచార్యులు వారు మహాకాలాతీతాం అని సంబోధించారు. దేవి నిరాకారము, నిర్గుణ స్వరూపము అయిన పరబ్రహ్మ. దేవికి రూపంలేదు. కాని "సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" అన్నట్లుగా సాధకులు వారి కోర్కెలకు అనుగుణంగా భగవంతునికి రూపం కల్పిస్తున్నారు. ఈ కారణం వల్లనే దేవిని, చతుర్భుజ, షడ్భుజ అష్టభుజ, దశభుజ, అని రకరకాలుగా వర్ణించడం జరుగుతోంది. అందుచేతనే గౌడపాదాచార్యులవారు ఈ శ్లోకంలో దేవిని **'కల్పితతనుం'** అన్నారు.

దేవతకు స్థూలరూపము, సూక్ష్మరూపము, పరారూపము అని మూడు రూపాలున్నాయి. పాశాంకుశ ధనుర్బాణములు ధరించిన దేవినే ఆచార్యుల వారు **'భవానీ'** అని స్తుతించారు. 'నాదబిందు కళారూపములు' సూక్ష్మరూపము. దీనిని 'ఐందవకళాం' అని 'కలిత సరణీ కల్పిత తనుః' అని అన్నారు. 'పరాకారాం దేవీం' అనటం చేత దేవి పరారూపాన్ని స్తుతిస్తున్నారు. సమయమతంలో షోడశీకళ అయిన చంద్రకళను **సమయ** అంటారు. అందుచేతనే దేవిని ఈ విధంగా సంబోధించటం జరిగింది.

ఈ రకంగా మొదటి శ్లోకంలో గౌడపాదాచార్యుల వారు దేవియొక్క స్థూల, సూక్ష్మ, పరారూపాలను స్తుతించారు.

## దేవీ దర్శనము - రాజయోగము

***మనస్త్వత్త్వం జిత్వా నయన మథనాస్రాగ్ర ఘటితం***
***పునర్వ్యా వృత్తాక్షః స్వయమపి యదా పశ్యతి పరామ్ ।***
***తదానీ మేవాస్య స్ఫురతి బహిరంతర్భగవతీ***
***పరానందాకారా పరశివపరా కాచిదపరా ॥*** ***2***

మనస్సు చంచలమైనది. మనస్సును గనుక జయించినట్లైతే సాధకుడికి భగవత్సాక్షాత్కారము కలుగుతుంది. మనస్సును జయించటానికి యోగమే సాధనము. అందుకే పతంజలి మహర్షి యోగశాస్త్రంలో 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' అని చెప్పబడింది. కఠోపనిషత్తులో

***తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణామ్ ।***
***అప్రమత్తస్తదా భవతి యోగోహి ప్రభవాప్యయౌ ॥***

చిత్త వృత్తులను నిరోధించటమే యోగము. అట్టి యోగము సాధించిన వాడు ఇంద్రియములన్నీ వశపరచుకుని మానసిక బాధల నుంచి విముక్తుడౌతాడు. అని చెప్పబడింది.

షట్చక్రాలలోని ఆజ్ఞాచక్రము మనస్తత్త్వాత్మకమైనది. దీనిని జయించాలి అంటే కుండలినీ శక్తిని సహస్రారం వరకు తీసుకుపోవాలి. సాధకుడు పద్మాసనంలో కూర్చుని దృష్టిని ముక్కుచివరి భాగంలో నిలిపి, మళ్ళీ దానిని లోపలికి తీసుకు వెళ్ళినట్లైతే పరదేవతా సాక్షాత్కారమౌతుంది.

మనస్సు, వాయువు అను ఈ రెండింటికీ అవినాభావ సంబంధమున్నది. వాయువు స్తంభించి నట్లైతేనే మనస్సు నిశ్చలమౌతుంది. ఇక్కడ మొదటగా మనస్సును ఆధారంగా చేసుకుని పరదేవతా సాక్షాత్కార సాధనకు యోగమార్గం చెప్పబడింది. దీన్నే రాజయోగం అంటారు. మనస్సును ఏకాగ్రం చేసి, ముక్కు చివరి భాగంలో దృష్టిని నిలిపి, ఇంద్రియాలన్నింటినీ అంతర్ముఖంగా తీసుకొని వచ్చి పరదేవతను ధ్యానించాలి. అప్పుడు పరదేవత సాక్షాత్కరిస్తుంది.

సుషుమ్నా మార్గము వదలి సహస్ర కమలాంతర్గతమైన చంద్రమండలంలోకి కుండలినీ శక్తిని చేర్చాలి. అక్కడ దేవి, మాయ, శుద్ధవిద్య, మహేశ్వర, సదాశివ అను తత్త్వ చతుష్టయాత్మకుడైన పరమశివునితో కలసి సుఖిస్తూ ఉంటుంది. ఆ స్థితిలో ఉన్న ఆమెయే పరాశక్తి. నిత్య సుఖకారిణి.

ఇదే విషయం **'వామకేశ్వర తంత్రము'**లో వివరించబడింది.

*భుజంగాకార రూపేణ మూలధారం సమాశ్రితా ।*
*శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాశుభా ॥*
*మూల కందం ఫణాగ్రేణ దష్ట్వా కమల కందవత్ ।*
*ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మ రంధ్రం సమాశ్రితా ॥*
*పద్మాసనగత స్వస్థో గుద మాకుంచ్య సాధకః ।*
*వాయు మూర్ధ్వ గతిం కుర్వన్ కుంభకావిష్ట మానసః ॥*
*వాయ్వాఘాతవశాదగ్నిః స్వాధిష్ఠాన గతో జ్వలన్ ।*
*జ్వలనా ఘాత పవనా ఘాతై రున్నిద్రతోహిరాట్ ॥*

*రుద్రగ్రంధిం తతో భిత్త్వా విష్ణు గ్రంధిం భిన త్త్వతః ।*

*బ్రహ్మగ్రంధించ భిత్త్వైవ కమలాని భినత్తిషట్ ॥*

*సహస్ర కమలే శక్తిః శివేన సహ మోదతే ।*

*సాచావస్థా పరా జ్ఞేయ సైవ నిర్వృతి కారణమ్ ॥*

1. భుజంగాకారము ధరించి ఆ భగవతి మూలాధారమునాశ్రయించినదై కుండలినీ శక్తిగా పిలువబడుతూ తామర తూడులోని దారమువలె సన్నగా, మెరుపు తీగవలె ప్రకాశించుచున్నది.

2. ఆ శక్తి ఆధార కమల మూలకందమును నోటితో తామర దుద్దువలె కరచి పట్టుకుని బ్రహ్మరంధ్రము నాశ్రయించి ఉన్నది.

3. సాధకుడు పద్మాసనంలో కూర్చొని మడమను గుదస్థానమున సంధించి శ్వాసను పైకి వదులుతూ కుంభకము కూర్చాలి.

4. ఆ వాయువు తాకిడికి స్వాధిష్ఠానమున ఉన్న అగ్ని ప్రజ్వరిల్లి కుండలినీ శక్తి మేల్కొంటుంది.

5. 6. అంత ఆ శక్తి బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధులు ఛేదించుకుని సహస్రారము చేరి సదాశివునితో సుఖిస్తూ ఉంటుంది. ఆ స్థితిలో ఉన్న ఆమె పరాశక్తి, నిత్య సుఖకారణి.

ఈ విషయాన్నే **"తంత్రసారం"** లోకూడా చెప్పటం జరిగింది. దాని వివరణకు నాచే వ్రాయబడిన **"శ్రీవిద్యాదర్శనము"** అను గ్రంథములోని 100వ పేజీ చూడండి.

## ప్రాణాయామము

*మనోమార్గం జిత్వా మరుత ఇహనాడీ గణజుషో*

*నిరుధ్యార్కం సేందుం దహనమపి సంజ్వాల్య శిఖయా ।*

*సుషుమ్నాం సంయోజ్య శ్లథయతిచ షడ్గ్రంధి శశినం*

*తవాజ్ఞాచక్రస్థం విలయతి మహోయోగి సమయీ ॥* ***3***

ముందుగా ఆజ్ఞా చక్రాన్ని జయించాలి. ప్రాణాయామం చేత చంద్రుని ఆజ్ఞాచక్ర మందు, సూర్యుని అనాహతము నందు వాయునిబద్ధులను చేసి శరీరంలోని 72,000

నాడీ మార్గాలను సుషుమ్న యందు కూర్చాలి. వాయువుచే ప్రేరేపింపబడిన స్వాధినాగ్ని ద్వారా, నిరాహారగా ఉన్న కుండలిని, నిద్ర నుండి మేల్కొని రుద్ర, విష్ణు బ్రహ్మగ్రంధులను దాటి సహస్రారం చేరుతుంది. ఇది సమయమతంలో యోగప్రక్రియ.

యోగి అయిన వాడు ముందుగా మనస్సును స్వాధీనం చేసుకుని ఏకాగ్రత సాధించాలి. దానికోసం దృష్టిని నాసాగ్రాన నిలిపి ఇంద్రియాలను అంతర్ముఖం చెయ్యాలి. ఎప్పుడైతే యోగి ఇంద్రియాలను స్తంభింపచేసి, ఆ శక్తిని అంతర్ముఖం చేస్తాడో, అప్పుడు. ఆ శక్తి అంతా కూడా లోపల ఒక బిందువు దగ్గర కేంద్రీకృతం అయి, సాధకుడు కోర్కె నెరవేరుతుంది. అంటే సాధకుడికి దేవి సాక్షాత్కారం జరుగుతుంది.

మూలాధారమునవున్న అగ్నిని జ్వలింపజేసినట్లైతే ఆ జ్వాలలతో సుషుమ్నానాడి షడ్గ్రం ధులు శైథిల్యము పొందుతాయి. అప్పుడు దేవతానివాసమగు ఆజ్ఞాచక్రమున గల చంద్ర మండలంలో యోగి లీన మవుతాడు. ఈ రకంగా మనోమార్గాలన్నీ జయించి నాడీ మండలానికి చెందిన వాయువులను నిరోధించి సుషుమ్నానాడికి ఇరువైపుల గల ఇడా, పింగళ నాడులను నిరోధించి మూలాధారమున గల అగ్నిని జ్వలింపచేసి, ఆ అగ్ని జ్వాలను సుషుమ్నతో యోజించాలి. అప్పడు షడ్గ్రంధి భేదనము జరుగుతుంది. కఠోపనిషత్తులో చెప్పినట్లుగా.

*శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన సుభినిః సృతైకా ।*
*త యోర్ధ్వమాయ న్నమృతత్వ మేతి విష్వజన్యా ఉత్క్రమణే భవన్తి ॥*

హృదయ నాడులు నూటఒకటి ఉన్నాయి. అందులో ఒకటి నడినెత్తికి పోవుచున్నది. దాని ద్వారా పైకి పోయిన వాడే అమృతత్వము పొందుచున్నాడు.

దేహములోని ఆధ్యాత్మిక సూక్ష్మశరీరము కంటికి కనిపించని 101 సూక్ష్మనాడులను కలిగి ఉన్నది. వాటిలో వెన్నెముక ద్వారా పైకి చేరి, అక్కడ నుండి బ్రహ్మ రంధ్రాన్ని తాకుచున్న సుషుమ్నానాడి ముఖ్యమైనది. పరబ్రహ్మను తెలుసుకున్న జ్ఞాని యొక్క జీవాత్మ మరణ సమయంలో ఈ సుషుమ్నా నాడి ద్వారానే పైకి వెళ్ళి కపాలం ఛేదించి బ్రహ్మలోకం చేరుతుంది.

## కుండలినీ ప్రబోధము

*యదాతౌ చంద్రార్కౌ నిజసదన సంరోధ నవశా*
*దశక్తౌ పీయూష స్రవణహరణే సా చ భుజగీ ।*
*ప్రబుద్ధా క్షుత్క్రుద్ధా దశతి శశినం బైందవగతం ।*
*సుధాధారాసారైః స్నపయతి తనుం బైందవకళే ॥* **4**

కుండలినీ శక్తి, ఆధార చక్రంలో, నోటితో తోకను పట్టుకున్న సర్పాకారంలో నిద్రిస్తూ ఉంటుంది. చంద్రకిరణాల వల్ల స్రవించే అమృతపుధారలే దానికి ఆహారం. నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని లేపగలిగితే భగవత్సాక్షాత్కారం అవుతుంది. సాధకుడు పద్మాసనంలో కూచుని, కాలి మడమతో గుదుస్థానమున తన్నిపట్టి వాయువును కుంభించాలి. అప్పుడు వాయువు ఊర్ధ్వముఖంగా బయలుదేరి చంద్రసూర్యుల గమనాన్ని ఆపుతుంది. చంద్రుని గమనము ఎప్పుడైతే ఆగిపోయిందో అప్పుడు అమృతం స్రవించదు. అమృతపు ధారలు లేకపోవటంచేత నిరాహార అయిన కుండలిని మేల్కొని సుషుమ్నానాడి ద్వారా ఊర్ధ్వముఖంగా బయలు దేరుతుంది. షట్చక్రాలనూ దాటుతూ వరుసగా రుద్రగ్రంధి, విష్ణుగ్రంధి, బ్రహ్మగ్రంధులను ఛేదించుకుని సహస్రారంచేరి బ్రహ్మరంధ్రం దగ్గర గల సహస్రదళ కమలాన్ని నోటితో పట్టుకుంటుంది. అప్పుడు ఆ చంద్రమండలం నుండి అమృతపు ధారలు స్రవించి శరీరంలోని 72,000 నాడీ మండలాన్నీ తడుపుతాయి. ఈ విషయాన్ని **'వామకేశ్వర తంత్రం'**లో వివరించడం జరిగింది.

*భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా ।*
*శక్తిః కుండలినీనామ బిసతంతు నిభాశుభా ॥*
*మూల కందం ఫణాగ్రేణ దష్ట్వా కమల కందవత్ ।*
*ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మ రంధ్రం సమాశ్రితా ॥*
*పద్మాసనగత స్వస్థో గుద మాకుంచ్య సాధకః ।*
*వాయు మూర్ధ్వ గతిం కుర్వన్ కుంభకావిష్ట మానసః ॥*
*వాయ్వాఘాత వశాదగ్నిః స్వాధిష్ఠాన గతోజ్వలన్ ।*
*జ్వలనా ఘాత పవనాఘాతై రున్నిద్రతోహిరాట్ ॥*
*రుద్రగ్రంధిం తతోభిత్త్వా విష్ణు గ్రంధిం భిన త్త్యతః ।*
*బ్రహ్మగ్రంధించ భిత్త్వైవ కమలాని భినత్తిషట్ ॥*
*సహస్ర కమలే శక్తిః శివేన సహ మోదతే ।*
*సాచావస్థా పరా జ్ఞేయాసైవ నిర్వృతి కారణమ్ ॥*

తంత్రసారంలో కూడా ఈ విషయాన్ని వివరించటం జరిగింది.

కుండల్యేవ  భవే చ్ఛక్తి స్తాంతు సంచాలయే ద్బుధః ।
స్వస్థానా దాభ్రువోర్మధ్యం శక్తి చాలన ముచ్యతే ॥

మూలాధారాది షట్చక్రం శక్తిస్థాన ముదీరితం ।
కంఠాదుపరి మూర్ధాంతం శాంభవ స్థాన ముచ్యతే ॥

మూలాధారే ధ్వనిం శ్రుత్వా ప్రబుద్ధా శక్తి కుండలీ ।
జ్వల త్పావకసంకాశా సూక్ష్మ తేజ స్స్వరూపిణీ ॥

శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాశుభా ।
సాచ విద్యుల్లతాకారా బ్రహ్మద్వారం మనోమయమ్ ॥

ముఖేనాచ్ఛాద్యతద్ద్వారం ప్రసుప్తా పరమేశ్వరీ ।
సార్థత్రివలయాకారా గ్రంథిత్రయ విభేదినీ ॥

పృధ్వ్యాప్య చక్రద్వితయం రుద్రగ్రంధి పదోదితం ।
వహ్ని సూర్యమయం చక్రద్వయం తేజోమయం మహత్ ॥

విష్ణుగ్రంధి పదేనోక్తం తైజసం సర్వసిద్ధిదం ।
వాయ్వాకాశ ద్వయీరూపం చక్రద్వితయ ముత్తమమ్ ॥

బ్రహ్మగ్రంధి  వదేనోక్తం  మంగళాయతనం మహత్ ।
రుద్రగ్రంధిం తతో భిత్వా విష్ణు గ్రంధిం భినత్త్యతః ॥

బ్రహ్మగ్రంధించ భిత్త్వైవ కమలాని భినత్తి షట్ ।
సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే ॥

ఇదే విషయాన్ని లలితా సహస్రంలో కూడా చెప్పటం జరిగింది.

మూలధారైక నిలయా బ్రహ్మగ్రంథి విభేదిని ।
మణిపూరాంత రుధితా విష్ణుగ్రంథి  విభేదిని ॥

ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథి విభేదిని ।
సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ ॥

మూలాధారము అంధకార బంధురము. సూర్యసంపర్కం ఉండటం చేత స్వాధిష్ఠానము అంధకార లోకమైనప్పటికి మిశ్రమలోకమని చెప్పాలి. మణిపూరకంలో

ఉండే జలము  మీద సూర్య కిరణాలు పడటం చేత అది మిశ్రమలోక మవుతుంది. అనాహతము జ్యోతిర్లోకము. విశుద్ధి చంద్రలోకము. అజ్ఞా చక్రమే సుధాలోకము. సహస్రారమే చంద్రమండలము.

వెన్నుపూసకు 'మేరు దండము' అని పేరున్నది. దాని మధ్యలో సుషుమ్నానాడి త్రినాడీ స్వరూపమున ఉన్నది. ఆ మేరు దండానికి ఎడమవైపు ఇడ, కుడివైపు పింగళ అని నాడీ మండలాలున్నాయి. సుషుమ్న మధ్యలో వజ్ర అనునాడి ఉన్నది. ఇది శిరస్సువరకు వ్యాపించి ఉంటుంది. వజ్రము మధ్యన చిత్రిణి అనే నాడి ఉన్నది. దానిని ఆధారంగా చేసుకుని షట్కమలాలు ప్రకాశిస్తూ ఉంటాయి. చిత్రిణీ మధ్యలో కంఠము నుంచి పరమశివ పర్యంతము బ్రహ్మనాడి వ్యాపించి ఉంటుంది. ఇది శుద్ధజ్ఞాన స్వరూపిణి. సుషుమ్నానాడి మూలకందాన్ని ఫణాగ్రముతో కప్పి ఉంచుతుంది. సాధకుడు వాయు నిరోధము చేయగా కుండలినీ శక్తి మేలుకొని సహస్రారం చేరుతుంది.

ఈ విషయం సౌందర్యలహరిలోని 9, 10 శ్లోకాలలో వివరించటం జరిగింది.

***మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం***
***స్థితం స్వాధిష్ఠానే హృది మరుత మాకాశముపరి ।***
***మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్త్వా కులపథం ।***
***సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసే. ॥***

ఓ భగవతీ ! నీవు మూలాధారమందున్న పృథివీ తత్త్వమును, మణిపూరమందున్న ఉదక తత్త్వమును, స్వాధిష్ఠానచక్రమందున్న అగ్నితత్త్వమును, అనాహతచక్రమందున్న వాయుతత్త్వమును, విశుద్ధ చక్రమందున్న ఆకాశ తత్త్వమును, ఆజ్ఞా చక్రమందున్న మనస్తత్త్వమును వీడి, సుషుమ్నామార్గమును ఛేదించి సహస్రార కమలమందు నీ భర్తయగు సదాశివునితో గూడి రహస్యముగా క్రీడించుచున్నావు.

***సుధాధారాసారై శ్చరణయుగళాం తర్విగళితైః***
***ప్రపఞ్చం సిఞ్చన్తీ పునరపి రసామ్నాయ మహసః ।***
***అవాప్య స్వాం భూమిం  భుజగ నిభమధ్యుష్టవలయం***
***స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుణ్డే కుహరిణి ॥***

తల్లీ ! నీ పాద యుగమునుండి స్రవించు సుధాధారలచే ప్రపంచమును తడుపుచు అమృతమునకు నిధానమై  కాంతిచే వెలుగొందు చంద్రుని వీడి స్వస్థానమైన ఆధార

చక్రమును మరల ప్రాపించి, అందు స్వరూపమును సర్పమువలె కుండలాకారము గావించి తామర దుద్దు నడుమనుండు సన్నని రంధ్రమువలె మిక్కిలి సూక్ష్మమైన పృథివీతత్త్వము నందు కుండలినీ శక్తివై నిద్రింతువు.

ఈ శ్లోకంలోని నాల్గవ పాదంలో గౌడపాదులవారు "సుధాధారా సారైః" అనే పద ప్రయోగం చేయగా శంకరాచార్యులువారు సౌందర్యలహరిలోని 10వ శ్లోకం మొదటి పాదంలోనే ఈ పద ప్రయోగం చేశారు.

## తత్త్వములు

***పృథివ్యాప స్తేజః పవన గగనే తత్ప్రకృతయః***
***స్థితా స్తన్మాత్రాస్తా విషయదశకం మానసమితి ।***
***తతో మాయావిద్యా తదనుచ మహేశః శివ ఇతి***
***పరం తత్త్వాతీతం మిలిత వపురిందోః పరకళా ॥*** **5**

***ఏవం పిండాండ ముత్పన్నం తద్వద్బ్రహ్మాండ ముద్భవౌ ।***
***పంచ భూతాని శాక్తాని మాయా దీని శివస్యతు ॥***

***మాయాచ శుద్ధవిద్యా చ మహేశ్వర సదాశివౌ ।***
***పంచవింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతి తే ॥***

పంచభూతాలు శక్తిసంబంధాలు మాయాదులు శివసంబంధాలు. ఇవన్ని కలిసి 25 తత్త్వాలయి నవయోనులందు అంతర్భావం పొందుతున్నాయి. అయితే ఈ తత్త్వాలు 25 కాదు 51 అని కొందరంటారు.

51 తత్త్వాలు ఈ క్రింద ఇవ్వబడ్డాయి.

***పంచభూతాని తన్మాత్ర పంచకం చేంద్రియాణిచ ।***
***జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణిచ ॥***
***త్వగాది ధాతవ స్సప్త పంచ ప్రాణాది వాయవః ।***
***మనశ్చాహంకృతిః ఖ్యాతిర్గుణాః ప్రకృతి పూరుషా ॥***
***రాగో విద్యా కలాచైవ నియతిః కాల ఏవచ ।***
***మాయాచ శుద్ధవిద్యాచ మహేశ్వర సదాశివౌ ॥***
***శక్తిశ్చ శివతత్త్వంచ తత్త్వాని క్రమశో విదుః ।***

| | | |
|---|---|---|
| పంచభూతాలు | – | 5 |
| తన్మాత్రలు | – | 5 |
| జ్ఞానేంద్రియాలు | – | 5 |
| కర్మేంద్రియాలు | – | 5 |
| త్వగాది ధాతువులు | – | 7 |
| (చర్మము, రక్తము, మాంసము, | | |
| మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లము) | | |
| ప్రాణములు | – | 5 |
| మనస్సు | – | 1 |
| అహంకారము | – | 1 |
| ఖ్యాతి | – | 1 |
| గుణములు | – | 3 |
| ప్రకృతి (మూలప్రకృతి) | – | 1 |
| పురుషుడు (జీవుడు) | – | 1 |
| రాగము (ఇచ్ఛ) | – | 1 |
| విద్య | – | 1 |
| కళలు | – | 1 |
| నియతి (నియామక శక్తి) | – | 1 |
| కాలము (సంహరణ కాలము) | – | 1 |
| మాయ | – | 1 |
| శుద్ధవిద్య (మోక్షజ్ఞానము) | – | 1 |
| మహేశ్వరుడు | – | 1 |
| (రజోగుణుడైన సృష్టికర్త) | | |
| సదాశివుడు (సృష్టికర్త) | – | 1 |
| శక్తి (సృష్టి స్థితి లయకారిణి) | – | 1 |
| శివతత్త్వము (శుద్ధ, బుద్ధ ముక్తి స్వరూపము) | – | 1 |
| మొత్తం తత్త్వాలు | | 51 |

కాశ్మీర దేశ శాక్తేయుల ప్రకారం తత్త్వాలు 36. అవి

| | | |
|---|---|---|
| పంచభూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| త్వగాది ధాతువులు | - | 7 |
| ప్రాక్ పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు | - | 4 |
| మనస్సు | - | 1 |
| మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| మొత్తం తత్త్వాలు | - | 36 |

కాని గౌడపాదులవారు వీటిని కాదన్నారు. ఒకవేళ తత్త్వాలు పైన చెప్పినట్లుగానే ఉన్నప్పటికీ కొన్ని తత్త్వాలు కొన్నిటియందు కలిసి ఉంటాయి.

అవి ముందుగా 51వ తత్త్వాలలో

| | | | |
|---|---|---|---|
| 1. | త్వగాది ధాతువులు | - | పంచభూతములందు |
| 2. | పంచప్రాణములు | - | వాయువునందు |
| 3. | అహంకారము | - | మనస్సునందు |
| 4. | ఖ్యాతి | - | విద్య యందు |
| 5. | గుణములు | - | ప్రకృతియందు |
| 6. | ప్రకృతి | - | శక్తి యందు |
| 7. | పురుషుడు | - | మహేశ్వరుని యందు |
| 8. | కళ | - | శుద్ధవిద్యయందు |
| 9. | కాలము | - | మహేశ్వరుని యందు |
| 10. | నియతి | - | శక్తియందు |
| 11. | శక్తి | - | శుద్ధవిద్యయందు |
| 12. | శివతత్త్వము | - | సదాశివ తత్త్వమునందు |

ఈ విధంగానే కాశ్మీర శాక్తేయులు చెప్పిన 36 తత్త్వాలలోను కొన్ని తత్త్వాలకు అంతర్భావం ఉంది.

1. త్వగాదిధాతువులు - పంచభూతాలయందు
2. ప్రాక్ పశ్చిమ దక్షిణ
ఉత్తర వాయువులు - వాయువునందు

ఈ రకంగా తత్త్వాలు కలసిపోగా మిగిలేవి 25 మాత్రమే అవి.

| | | | |
|---|---|---|---|
| 1. | పంచభూతాలు | - | 5 |
| 2. | తన్మాత్రలు | - | 5 |
| 3. | జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 4. | కర్మేంద్రియాలు | - | 5 |
| 5. | మనస్సు | - | 1 |
| 6. | మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| | మొత్తం తత్త్వాలు | | 25 |

శబ్ద స్పర్శ రూప రస గంధాలు 5, మనస్సుతో కలిసి 6. ఇవి షట్చక్రాలలో ఉన్నాయి.

షట్చక్రాలకు పైన మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు ఉన్నారు. హిరణ్యగర్భుడనే సదాశివుడితో కలిసిన శుద్ధవిద్యయే సాదాఖ్యకళ. 25వ తత్త్వముతో కలిసిన భగవతి 26 వ తత్త్వము అవుతోంది. దీనినే పరా, చిద్రూప, కుండలిని. అంటారు.

ఈ విషయాన్ని సౌందర్యలహరిలోని **మహీం మూలాధారే** అనే 9వ శ్లోకంలో శంకర భగవత్పాదులు వివరించారు. ఈ 26 తత్త్వాలు, దేవికి సూక్ష్మరూపమైన శ్రీచక్రంలో నిక్షిప్తం చేయబడి ఉన్నాయి.

## కుండలినీ దశా నిరూపణ

***కుమారీ యన్మంద్రం ధ్వనతిచ తతో యోషి దపరా***
***కులం త్యక్త్వా రౌతి స్ఫుటతిచ మహాకాలభుజగీ ।***
***తతః పాతివ్రత్యం భజతి దహరాకాశ కమలే***
***సుఖాసీనా యోషా భవసి భవసీత్కార రసికా ॥*** ***6***

కుండలినీ శక్తికి మూడు దశలున్నాయని చెప్పబడుతోంది. అవి

మొదటిది నిద్రావస్థ. ఈ అవస్థలో కుండలినీ శక్తి సర్పాకారము ధరించి తోకను నోటితో కరచి పట్టుకుని ఆధార చక్రంలో నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ప్రాణాయామమనే యోగ ప్రక్రియతో ఆ శక్తిని మేల్కొల్పాలి. అప్పుడు నిరాహారయైన ఆ శక్తి మేల్కొని మంద్రస్వరంతో పూత్కారం చేస్తూ ఊర్ధ్వముఖంగా బయలుదేరి రుద్ర, విష్ణు, బ్రహ్మగ్రంధి త్రయాన్ని ఛేదిస్తుంది. ఇది రెండవ స్థితి. ఈ స్థితిలో కుండలినీ శక్తి బుసలు కొడుతూ గ్రంధి త్రయాన్ని భేదిస్తూ ఊర్ధ్వ ముఖంగా ప్రయాణిస్తూ ఉంటుంది. బ్రహ్మగ్రంధి భేదించిన తరువాత సహస్రారం చేరి అక్కడ ప్రౌఢయై తన పతి అయిన శివునితో విహరిస్తుంది. ఇది మూడవ అవస్థ. ఈ స్థితిలో శివునితో కలిసి సుఖిస్తుంది. ఈ రకంగా కుండలినికి మూడు అవస్థలు లేదా దశలున్నాయి.

అవి 1) నిద్రావస్థ, 2) ప్రయాణావస్థ, 3) సుఖావస్థ. వీటినే వరుసగా

1) కౌమారావస్థ, 2) యోషిదవస్థ, 3) పతివ్రతావస్థ అంటారు.

కుండలిని సహస్రారం చేరిన తరువాత అమృతాస్వాదన చెయ్యటానికి స్వాధిష్ఠానంలో ఉన్న అగ్ని సహాయపడుతుంది. వాయువుచే అగ్నిని జ్వలింపచేసి, ఈ అగ్ని ద్వారా చంద్రమండలం నుండి అమృతాన్ని స్రవింప చేస్తుంది.

అక్కడ 26వ తత్త్వమైన పరాశక్తి, శివుని తనలో కలుపుకుని సుఖాసీనురాలగు చున్నది. అందుకే కుండలినిని 'మహాకాలభుజగీ' అన్నారు. ఈ విషయం భైరవయామళం వామకేశ్వర తంత్రం, బహురూపాష్టకాలలో ఈ విధంగా చెప్పబడింది.

***తత్రాస్తే పరమేశానీ మహాత్రిపుర సుందరీ ।***
***శివార్క మండలం భిత్వా ద్రావయం తీందుమండలమ్ ॥***
***తదుద్భూతామృతస్యంది పరమానంద నందితా ।***
***కులయోషిత్కులం త్యక్త్వా, వరం వర్షణ మేత్యసౌ ॥***

కుండలినీ శక్తి షట్చక్రాలను భేదించి సహస్రారమందలి చంద్రమండలం నుంచి అమృతాన్ని స్రవింప చేస్తుంది. అప్పుడు ఆ అమృతధారలతో శరీరంలోని 72,000 నాడీమండలము తడపబడుతుంది. తరువాత కుండలినీ మళ్ళీ స్వాధిష్ఠానానికి వచ్చి నిద్రిస్తుంది. ఈ రకంగా కుండలిని 3 దశలను గౌడపాదాచారులు వారు ఈశ్లోకంలో వివరించారు.

# దేవీ విహార స్థానము

త్రికోణం తే కౌలాః  కుల గృహమితి ప్రాహు రపరే
చతుష్కోణం ప్రాహుః సమయిన ఇమే బైందవమితి ।
సుధాసింధౌ తస్మిన్ సురమణిగృహే సూర్య శశినో ।
రగమ్యే రశ్మీనాం సమయ సహితే త్వం విహరసే ॥ 7

"త్రికోణే బైందవమ్ శ్లిష్టమష్టారే అష్టదళాంబుజమ్"

అని లలితా త్రిశతిలో చెప్పబడింది. అంటే బిందువు త్రికోణంలోనే ఉన్నది. అని అర్థము. ఈ విషయాన్ని అందరూ అంగీకరిస్తున్నారు. కౌళాచారులు త్రికోణంలో ఉన్న బిందువును మాత్రమే పూజిస్తారు. శ్రీచక్రంలో నవయోనుల మధ్యన గల త్రికోణమే ప్రత్యక్షయోని అని చెప్పబడుతోంది. కౌళాచారులు బాహ్యాపూజ చేస్తారు. అంటే శ్రీచక్రంలో ఉండే త్రికోణాన్ని పూజిస్తారు. శ్రీచక్రాన్ని బంగారము, వెండి రేకుల మీదగాని పట్టు వస్త్రము, భూర్జపత్రము మీద గాని వ్రాసి దానిని పూజిస్తారు. కొందరు స్త్రీ యొక్క యోనిని పూజిస్తారు. ఈ పూజ మళ్ళీ రెండురకాలు.

1) ఊర్ధ్వకోణ పూజ 2) అధఃకోణపూజ. వీటిలో ఏ రకంగా పూజ చేసినప్పటికీ కౌళ మతస్థులు చేసేది బాహ్యాపూజయే. వీరికి పూజాస్థానము ఆధారచక్రము. అది అంధకారబంధురము. వీరిపూజ తామిస్రము. అర్థ, కామాల సాధనకోసమే వీరు పూజచేస్తారు.

భైరవయామళంలో శ్రీ చక్రాన్ని గురించి ఈ విధంగా చెప్పటం జరిగింది.

*చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః ।*
*నవచక్రైశ్చ సంసిద్ధం శ్రీ చక్రం శివయోర్వపుః ॥*
*త్రికోణా మష్ట కోణంచ దశకోణ ద్వయం తథా ।*
*చతుర్దశారం చైతాని శక్తి చక్రాణి పంచచ ॥*
*బిందు శ్చాష్టదళం పద్మం, పద్మం షోడశ పత్రకమ్ ।*
*చతురస్రంచ చత్వారి, శివచక్రాణ్యాను క్రమాత్ ॥*

శివ చక్రములు 4, శక్తి చక్రాలు 5 మొత్తం 9 చక్రాల సమూహామే శ్రీచక్రము. త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము అనే 5 శక్తి

చక్రాలు. బిందువు, అష్టదళము షోడశదళము, భూపురము అనే 4 శివచక్రాలు. కాని సమయ మతస్థులు అష్టదళము, షోడశదళము, మేఖలాత్రయము, భూపురములను శివచక్రాలు అంటారు. అప్పుడు శివ చక్రాలు బయట, శక్తిచక్రాలు లోపల ఉంటాయి. ఈ బాహ్యత్వము పనికిరాదు. కాబట్టి 4 శివచక్రములను బిందు రూపంలోకి తెచ్చి శ్రీచక్రం మధ్యలో ఉంచారు సమయవాదులు. వీరి మతం ప్రకారం బిందువు త్రికోణంలో ఉండదు. చతుష్కోణంలో ఉంటుంది. సుధాసింధువే భైందవస్థానము. అది చంద్రమండలంలో ఉంటుంది. చంద్రమండలం చతురస్రంగా ఉంటుంది. కాబట్టి బిందువు చతురస్రంలో ఉంటుంది కాని, త్రికోణంలో కాదు. కానీ ప్రస్తుతము సమయాచారులని చెప్పబడే వారందరూ త్రికోణంలోనే బిందువును చూపుతున్నారు. ఏ పటంలోనూ కూడా బిందువును చతుష్కోణంలో చూపటం లేదు. **లలితాత్రిశతిఫలశ్రుతి**లో చెప్పినట్లుగా

*త్రికోణే బైందవమ్ శ్లిష్టమష్టారేఽష్టదళాంబుజమ్ ।*
*దశారయోష్షోడశారం భూగృహంభువనాశ్రకే ॥*

త్రికోణంలో బిందువు, అష్టకోణంలో అష్టదళపద్మము, దశారద్వయంలో షోడశ దళము, చతుర్దశకోణంలో భూపురము చేరి ఉన్నాయి. కాబట్టి శివశక్తులకు ఐక్యమున్నదని సమయాచారులలో కొందరి వాదన. వీరి మతం ప్రకారము భూపురము, షోడశదళము, అష్టదళము, మేఖలాత్రయము అనేవి నాలుగు శివచక్రాలు. వీటికి ప్రతినిధిగా ఉన్న వర్తులాకారాన్నే బిందువు అంటారు. ఇది చతుష్కోణ మధ్యవర్తి కాదు.

సమయమతం ప్రకారం బిందువు సహస్రారంలో ఉంది. ఆధార చక్రానికీ, స్వాధిష్ఠానానికి మూలమైనది బిందువే. ఇది శివశక్తుల సమ్మేళనము. ఇది 26వ తత్త్వము. దీనినే సాదాఖ్యకళ అంటారు. ఇది నాదబిందు కళాతీతమైనది. చంద్రమండలము మధ్యన ఉన్న సుధాసింధువే భగవతి యొక్క విహార స్థానము. బిందురూపుడైన శివునకు, త్రికోణరూపిణి అయిన శక్తికీ అవినాభావ సంబంధము ఉన్నది.

సహస్రారంలో ఉన్న చంద్రమండలమే శ్రీచక్రము అయితే విడిగా ఉన్న చంద్రమండలము కూడా శ్రీచక్రమే. సహస్రదళము మధ్యన శ్రీచక్రరూపంలో ఉన్నది చంద్రమండలము. దాని మధ్యన గల ఆ దేవి పాదోదకమే సుధాసింధువు. ఈ పాదోదకమే శరీరంలోని 72,000 నాడీమండలాన్నీ తడుపుతుది.

చంద్ర లోకమే దేవినివాస స్థానము. ఇది సాయుజ్యం కావచ్చు. సార్షిరూపం కావచ్చు. అది మాత్రం అత్యంత పవిత్రమైంది. అగ్ని కిరణాలు 108, చంద్రకిరణాలు 136, సూర్యుని కిరణాలు 116, మొత్తం 360. ఇవే 360 రోజులు ఒక సంవత్సరానికి ప్రతీక. దేవి పాదముల నుంచి వచ్చిన అమృత ధారలు శరీరంలోని 72,000 నాడీ మండలాన్ని తడుపుతున్నాయి. అంటే ఆ పాదోదకము సాధకుడికి తృప్తి నిస్తుంది. అనగా భగవతి పాదపద్మాలే సాధకులకు శరణ్యము. బహురూపాష్టకంలో ఈ రకంగా చెప్పబడింది.

*బిందుస్థానం సుధాసింధుః పంచ యోన్య స్సురద్రుమాః ।*
*తత్రైవ నీప శ్రేణీచ, తన్మధ్యే మణిమంటపం ॥*

బిందు స్థానమే సుధాసింధువు అని చెప్పబడుతోంది. అయితే సుధాసింధువు ఎక్కడ ఉన్నది అన్నదే ప్రశ్న. సమయమతస్థులకు సహస్రారము సుధా సింధువు కాగా కౌళ మతస్థులకు ఆధారచక్రం సుధాసింధువు. అనగా సమయాచారులు దేవిని సహస్రదళ పద్మంలో దర్శిస్తే కౌళాచారులు ఆధారచక్రంలో దర్శిస్తారు. కౌళమతం వారు త్రికోణంలో బిందువును ఉంచితే సమయమతం వారు చతుష్కోణంలో బిందువును ఉంచుతారు. అందుకే గ్రంథి త్రయము చెప్పేటప్పుడు, కౌళమతస్థులు ఆధార స్వాధిష్ఠానాల తరువాత బ్రహ్మగ్రంథిని చెప్పగా సమయాచారులు ఆజ్ఞాచక్రంపైన బ్రహ్మగ్రంథిని చెబుతారు.

సమయాచారులలో మరి కొందరు చతుష్కోణము మధ్యనే వేరొక త్రికోణము రక్తికి ప్రతీకగా ఉన్నదని, దానిమధ్య బిందువు ఉన్నదని అంటారు. ఈ ఆచారాలను పరిశీలించిన మీదట చక్రస్థానములలోని వ్యత్యాసము మీద బిందు నిర్ణయము ఆధారపడి ఉన్నదని తెలుస్తోంది. షట్చక్ర నిరూపణంలో ఈ విధంగా ఉన్నది.

*సమాస్తే తస్యోంతశ్శశి పరిరహితః శుద్ధ సంపూర్ణ చంద్ర*
*స్ఫురజ్జ్యోత్స్నాజాలః పరమరసచయ స్నిగ్ధ సంతానవ*
*త్రికోణం తస్యాంతః స్ఫురతిచ సతతం విద్యుదాకార రూపా*
*తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితాంచాతిగుప్త*

సహస్రారంలో పూర్ణచంద్రుడు తన కిరణాలతో అమృతపుధారలు ప్రవింప చేస్తుంటాడు. ఆ చంద్రమండలం మధ్యన కోటి సూర్య కాంతులతో ప్రకాశిస్తున్న త్రికోణం

ఉన్నది. ఆ త్రికోణం మధ్యన ఉండే ప్రదేశాన్నే దేవగణాలన్నీ సేవిస్తున్నాయి. దీని ప్రకారము, సహస్రారమునందే త్రికోణమున్నది.

శ్రీచక్రంలో బిందువు, త్రికోణము, అష్టకోణము, దశకోణద్వయము, చతుర్దశకోణము, అష్టదళము, షోడశదళము, భూపురము అని తొమ్మిది ఆవరణలున్నాయి. ఈ ఆవరణలను వీటిలో ఉండే దేవతలను **రత్నాయర్షి** వ్రాసిన ఆవరణదేవతాస్తుతిలో వివరించడం జరిగింది. భూపురానికి నాలుగువేదాలకు ప్రతీకలుగా నాలుగు ద్వారాలు, మూడులోకాలకు ప్రతీకగా మూడు రేఖలు ఉంటాయి. ఈ ద్వారాలలో గనక ప్రవేశించినట్లైతే పరదేవత సాక్షాత్కార మవుతుంది.

*శ్రీచక్రస్య చత్వారి ద్వారాణి చతుర్వేదరూపాణి*
*ద్వారా ప్రవేశ నైవభవతి పరదేవతా సాక్షాత్కారః*

అష్టదళము, షోడశదళము, భూపురత్రయాలకు మర్యాద సూచకంగా వృత్తత్రయం ఉంది. ఇవి శివచక్రాలు. వృత్తత్రయంలో బిందువు అంతర్భావమవుతున్నది. శక్తిచక్రాలన్నీ కోణాలు కలిగి ఉంటాయి. శివచక్రాలు దళాలు. వృత్తాలు, చతురస్రాలుగా ఉంటాయి. శివ శక్తిచక్రాల కలయిక వల్ల శ్రీచక్రం ఏర్పడింది.

పైన చెప్పినట్లుగా శక్తిచక్రాలు, శివచక్రాలలో చేరి ఉన్నాయి. శ్రీచక్రాన్ని బిందువు దగ్గర నుండి ప్రారంభించి భూపురం వరకు వ్రాస్తే సృష్టి క్రమం అని, భూపురం దగ్గరనుండి ప్రారంభించి బిందువు వరకు వ్రాస్తే సంహార క్రమమం అని అంటారు. శ్రీచక్రాన్ని సృష్టి చక్రము, స్థితిచక్రము, సంహారచక్రము అని మూడు రకాలుగా చెప్పవచ్చు. ఈ శ్రీచక్రంలోని బిందువు నందు దేవి పరమశివునితో కలసి విహరిస్తుంటుంది.

## రశ్ములు (కిరణములు)

*త్రిఖండం తే చక్రం శుచిరవి శశాంకాత్మకతయా*
*మయూఖైః షట్త్రింశద్దశయుతతయా ఖండకలితైః !*
*పృథివ్యాదౌ తత్త్వే పృథగుదితవద్భిః పరివృతం*
*భవేన్మూలాధారా త్ప్రభృతి తవషట్చక్ర సదనమ్ !!* **8**

మాతృకా చక్రము అంటే శ్రీచక్రము. అది సోమ, సూర్య, అనలాత్మకమయి మూడు ఖండములుగా ఉన్నది. అగ్నికి నూట ఎనిమిది జ్వాలలు. చంద్రునికి నూటముప్పైఆరు కళలు, సూర్యునికి నూటపదహారు కిరణములున్నాయి. ఈ మొత్తం కలిపి 360. ఈ ప్రకారం సోమసూర్యాగ్నులు పిండాండ, బ్రహ్మాండముల నావరించి తిరుగుచున్నారు. పిండాండ బ్రహ్మాండముల ఏకత్వము వలన, పిండాండము యొక్క ఆవృతి బ్రహ్మాండము యొక్క ఆవృతి అవుతున్నది అనేది పరమ రహస్యము.

చంద్రకళా విద్య అనే పేరుగల ఈ విద్య పదిహేనుతిథుల స్వరూపం కలదవటంచేత మూడువందల అరవై కిరణములు రోజుల స్వరూపమై ఉన్నవి. వాటినే సంవత్సరము అంటారు. కాలశక్తి స్వరూపమయిన ఆ సంవత్సరము ప్రజాపతిరూపమై ఉన్నది. ప్రజాపతి జగత్కర్త. ఈ కిరణములే జగత్తు యొక్క సృష్టి, స్థితిలయాలు కావిస్తూ ఉంటాయి.

మొత్తం మూడువందల అరవై కిరణాలు డెభ్బైరెండువేల నాడీ మార్గంలో ప్రసరిస్తూ, సుధాధారలు వర్షింప చేస్తూ, సాధకులకు తృప్తినిస్తాయి. ఈ కిరణాలకు పైభాగాన దేవీపాదాలు ఉంటాయి.

ఈ విషయం భైరవయామళంలోని చంద్రజ్ఞాన విద్యలో చెప్పబడింది.

*బ్రహ్మాండం భాసయన్త్యేతే పిండాండ మపిశంకరి ।*
*దివాసూర్య స్తథా రాత్రౌ సోమోవహ్నిశ్చ సంధ్యయోః ॥*
*ప్రకాశయంతః కాలాంస్తే తస్మాత్కాలాత్మకస్త్రయః ।*
*షష్ట్యుత్తరంచ త్రిశతం దినాన్యేవచ హాయనమ్ ॥*
*హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి శ్రుతిః ।*
*ప్రజాపతి ర్లోక కర్తా మరీచి ప్రముఖాన్ మునీన్ ॥*
*సృజంత్యేతే లోకపాలాన్ తే సర్వే లోకరక్షకాః ।*
*సంహారశ్చ హరాయత్తః ఉత్ప త్తిర్భవ నిర్మితా ॥*
*రక్షాతు మృడసంలగ్నా సృష్టిస్థితిలయే శివః ।*
*నియుక్తః పరమేశాన్యా జగదేవం ప్రవర్తతే ॥*

ఓ శాంకరీ ! ఆ కిరణాలు పిండాండ బ్రహ్మాండములను కూడి ప్రకాశింప చేస్తున్నాయి. పగలు సూర్యుడు, రాత్రులందు చంద్రుడు, సంధ్యవేళయందు అగ్ని ఆయా కాలములను

ప్రకాశింప చేస్తున్నారు. మూడువందల అరవై రోజులైతే ఒక సంవత్సరము. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే మరీచి మొదలైన మునులను సృష్టిస్తున్నాడు. వీరందరూ లోకరక్షకులే. జగత్తు యొక్క సృష్టిని భవుడు,రక్షణ మృడుడు, లయము హరుడు చేస్తున్నారు. వీరందరినీ పరమేశ్వరి ఆయా పనులకు నియమించింది.

త్రిఖండాలు అంటే మూడుఖండాలు. అవి ఇచ్ఛ, జ్ఞాన, క్రియా శక్తులు జాగ్రత్ స్వప్న, సుషుప్తి అనే అవస్థలు, సత్వ, రజస్ తమో గుణాలు, విశ్వ, తైజస ప్రాజ్ఞలని గుర్తించాలి.

ఈ కిరణాలన్నీ మూలాధారాది షట్చక్రములలో ఉన్నాయి. షట్చక్రాలే నిలయంగా ఉన్న పరాశక్తి స్వరూపమే శ్రీచక్రము. సోమసూర్యాగ్నులకు ప్రతీకలుగా మూడు ఖండాలు ఉన్నాయి. నాదము అంటే శ్రీచక్రము. కళ అంటే రశ్మి. కళా మంత్రాల సమ్మేళనే శ్రీచక్రము. షట్చక్రాల్లో భూమికి యాభైఆరు, జలమునకు యాభైరెండు, అగ్నికి అరవైరెండు, వాయువునకు యాభై నాలుగు, ఆకాశానికి డెబ్బైరెండు, మనస్సునకు అరవైనాలుగు రశ్మలున్నాయి. కాలాత్మకమైన రశ్మలు పరాశక్తి యొక్క చరణముల నుండి పుట్టినవి. ఈ రకంగా గౌడభగవత్పాదాచార్యులవారు ఈ శ్లోకంలో రశ్మలను వివరించారు.

## రశ్మల కతీతము

***శతంచాష్టావహ్నేః శతమపికళాః షోడశ రవేః***
***శతంషట్త్రింశత్సితమయ మయూఖా శ్చరణజాః !***
***య ఏతే షష్టిశ్చ త్రిశతమభవం స్త్వచ్చరణజాః***
***మమాకౌళైస్తస్మా న్నహి తవ శివే కాలకలనా !!*** ***9***

గతంలో చెప్పినట్లుగా సోమ సూర్య అగ్ని ఖండాలలో మొత్తం మూడువందల అరవై కిరణాలున్నాయి. షట్చక్రాలు ఈ మూడుఖండాలలోనే ఉన్నాయి. అంటే ఒక్కొక్క ఖండానికీ రెండేసి చక్రాలు చొప్పున విభజించబడ్డాయి. కాబట్టి ఆ ఖండాలకు ఉన్న కిరణాలు కూడా ఈ చక్రాల మధ్య విభజించబడ్డాయి. అగ్నిజ్వాలలు నూట ఎనిమిది. అగ్నిస్థానాలు మూలాధార మణిపూరాలు. అందుచేత ఈ జ్వాలలు ఆధారచక్రంలో యాభై ఆరు. మణిపూరంలో యాభైరెండు ఆవరించి ఉంటాయి. సూర్యకిరణాలు నూటపదహారు సూర్యస్థానాలుగా చెప్పబడేవి స్వాధిష్ఠాన అనాహతాలు. అందువల్ల స్వాధిష్ఠానంలో

అరవైరెండు, అనాహతంలో యాభైనాలుగు కిరణాలుంటాయి. అదే విధంగా చంద్రకళలు నూటముప్పైఆరు. విశుద్ధి చక్రంలో డెబ్భైరెండు, ఆజ్ఞా చక్రంలో అరవైనాలుగు కళలుంటాయి. ఈ కిరణములు మొత్తం మూడువందలఅరవై కలిస్తే ఒక సంవత్సరం. పరాశక్తికి కాలోపహరణం లేదు. కౌళమతస్థులకు ఆధార స్వాధిష్ఠానాలే పూజనీయాలు కాబట్టి మిగిలిన చక్రాలతో పనిలేదు. అందుచేత కాల నిర్ణయము వారి మతంలో లేదు. కాలాత్మశక్తి అయిన శుద్ధ విద్యనే చంద్రకళావిద్య అంటారు. నిత్యలు కళా స్వరూపాలు, కళలు తిథుల స్వరూపాలు. పదిహేనుతిథులు ఒక పక్షము. రెండు పక్షములు ఒక మాసము. పన్నెండు మాసములు ఒక సంవత్సరము అంటే 360 రోజులు. కాబట్టి నిత్యల గమనం వల్ల సంవత్సరం ఏర్పడుతోంది.

షట్చక్రాలలో కొన్నింటి తత్త్వాలలో భేదము చెప్పబడింది. కొన్ని తంత్ర శాస్త్రాల ప్రకారము.

| | | |
|---|---|---|
| ఆధార చక్రము | – | పృథ్వీ తత్త్వము |
| స్వాధిష్ఠానము | – | జల తత్త్వము |
| మణిపూరము | – | అగ్ని తత్త్వము |

సౌందర్యలహరితోసహా కొన్నింటిలో

| | | |
|---|---|---|
| ఆధార చక్రము | – | పృథ్వీ తత్త్వము |
| స్వాధిష్ఠానము | – | అగ్ని తత్త్వము |
| మణిపూరము | – | జల తత్త్వము |

అని చెప్పబడింది. ఈ రకంగా ఈ భేదము స్వాధిష్ఠాన మణిపూరాలలో మాత్రమే చెప్పబడింది. లక్ష్మీధరుల ప్రకారము లోకాలు దహించి వేసే అగ్నికి, సూర్యుడికి మధ్యన గనుక జలము ఉండేటట్లయితే సంవర్త మేఘాలు సృష్టింపబడి వర్షధారలను కురిపించ గలవు. అధిష్ఠానోపరిస్థిత సూర్యకిరణములు స్వాధిష్ఠానాగ్నితో కలిసి మణిపూరంలో జలతత్త్వం పొంది, స్వాధిష్ఠానాగ్ని దగ్ధము అయ్యే జలాన్ని ఉత్పత్తి చేస్తుంది. స్వాధిష్ఠానంలో అగ్ని ఉంది. కాబట్టే దీన్ని అగ్ని తత్త్వము అన్నారు.

## శ్రీచక్రము, షట్చక్రముల భావన

***త్రికోణం చాధారం త్రిపుర వినుతే ష్టార మనఘే***
***భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురమ్***
***దశారం తే సంవిత్కమల మథ మన్వస్రక ముమే***
***విశుద్ధం స్యాదాజ్ఞాశివ ఇతి తతో బైందవగృహమ్ ॥*** ***10***

షట్చక్రాలకి శ్రీచక్రంలో ఐక్యత చెప్పబడింది. ఇది ఏ రకంగా అంటే

1. ఆధార చక్రానికి – త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి – అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి – అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి – బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధి చక్రానికి – చతుర్దశకోణంతో ఐక్యత
6. ఆజ్ఞా చక్రానికి – అష్టదళము, షోడశదళములతో ఐక్యత
7. సహస్రారానికి – నాలుగు ద్వారాలతో కూడిన భూపురంతో

ఐక్యత చెప్పబడింది. ఇదే రకంగా శ్రీచక్రంలో ఉండే మూడు వృత్తాలు వరుసగా.

1. స్వాధిష్ఠానానికి పై భాగంలో – రుద్రగ్రంథి రూపంలోను
2. అనాహతానికి పై భాగంలో – విష్ణుగ్రంథి
3. ఆజ్ఞాచక్రానికి పై భాగంలో – బ్రహ్మగ్రంథి రూపంలోను

ఉంటాయి. ఈ రకంగా షట్చక్రాలకు, శ్రీచక్రానికీ ఐక్యత చెప్పబడింది.

శ్రీచక్రము వియచ్చక్రము. దీని పూజ రెండు రకాలుగా జరుగుతుంది. 1) బ్రాహ్యాకాశమున 2) అంతరాకాశమున. మొదటిదైన బాహ్యపూజలో శ్రీచక్రాన్ని రాగిరేకు, కాగితము, ఆకు, చివరకు నేలమీద కూడా వ్రాసి దాన్నిపూజిస్తారు. ఇది కౌళపూజ.

షట్చక్రాలు పృథ్వి, అగ్ని, జలము, వాయువు, ఆకాశము, మనస్తత్వాలకు సంబంధించినవి. ఆజ్ఞాచక్రంలో భగవతి విద్యుల్లత వల్ల ప్రకాశిస్తుంది. శ్రీచక్రము నవయోన్యాత్మకము. కామికాతంత్రంలో చెప్పినట్లుగా.

***నవధాతు రయందేహో నవయోని సముద్భవః***
***దశమీ యోని రేకైవ (దశమోధాతు రేకైవ) పరాశక్తి స్తదీశ్వరీ ॥***

ఈ దేహము నవయోనుల వలన పుట్టి నవ ధాతు మయమై ఉన్నది. దీనిలో పదవయోని బైందవస్థానము ఆ పరమేశ్వరి అయి ఉన్నది. సంవిత్కమలంలో త్రికోణం ఆరోపించి, బైందవ స్థానమునగల పరమేశ్వరిని పునశ్చరణ చేయాలనేది సమయమత రహస్యము.

*"శిఖి జ్వాలారూపః సమయ ఇహ సై వాత్ర సమయా ।*
*తయో సంభేదో మే దిశతు హృదయాబ్జైక నిలయః ॥ "*

జ్వాలా రూపుడైన పరమేశ్వరుడు జ్వాలారూపిణి అయిన శక్తితో కలిసి దీపాంకురము వలె ప్రకాశిస్తూ ఉంటాడు. అని సుభగోదయ వ్యాఖ్యలో శంకరాచార్యులవారు అన్నారు.

షట్చక్రాలు సహస్రారము యొక్క వికారాలు. సహస్రారంలో బిందువు ఉంటుంది. కాబట్టి షట్చక్రాలకు కూడా బిందు స్వరూపమున్నది. అని అర్థము. శ్రీచక్రం చతుర్విధ వాక్కుల (పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి) స్వరూపము. కాబట్టి ఇది నాదరూపము. బిందువు శ్రీచక్రంలో ఉంది. అందుచేత బిందువునకు నాదరూపము చెప్పబడింది. షట్చక్రముల కర్ణికలలో (చివరలు) శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలు ఉన్నాయని తంత్రాలలో చెప్పబడింది. ఈ విషయము పైన వివరించబడింది.

కళ అంటే సూర్యచంద్రాగ్నుల రశ్మలు, నిత్యలు, మాతృకలు అని అర్థం. శ్రీచక్రంలో శివుదున్నాడు. నాదమే మంత్రం.

శ్రీచక్రము 1) సృష్టిక్రమము 2) సంహార క్రమము అని రెండు రకాలు. పరతత్త్వము నాదబిందు కళాతీతము. దానిలో నుండే ఇవి వచ్చినాయి. కాబట్టి ఈ ఐక్యతలను సమ్మేళనాలను భావన చేసినట్లయితే పరతత్త్వము అనేది అర్థమవుతుంది. ఈ ప్రపంచం అంతా కూడా పరతత్త్వంగానే గోచరిస్తుంది. అయితే ఈ ఐక్యము అనేక రకాలుగా ఉంటుంది. వాటిలో చతుర్విధైక్యము, షడ్విధైక్యము ముఖ్యమైనవి.

## శివశక్తి చక్రాల ఐక్యము

*త్రికోణేతే వృత్తత్రితయ మిభకోణే వసుదళం*
*కళాశ్రం మిశ్రారే భవతి భువనాశ్రే చ భువనమ్!*
*చతుశ్చక్రం శైవం నివసతి భగే శాక్తికముమే*
*ప్రధానైక్యం షోఢా భవతి చ తయోః శక్తి శివయోః ॥* **11**

అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము చతుర్ద్వార సహితమైన భూపురము శివచక్రాలు. శక్తి కోణస్వరూపిణి. అందుకే శ్రీచక్రంలోని కోణాలన్నీ శక్తి చక్రాలని చెప్పబడుతున్నాయి. త్రికోణము బైందవస్థానము. త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము చతుర్దశారము శక్తి చక్రాలు. శివ శక్తి చక్రాలకు ఐక్యత కలుగుతోంది.

అసలు శ్రీచక్రము అంటే తొమ్మిదిచక్రాల సమూహము. భైరవ యామళంలో చెప్పినట్లుగా.

***చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః ।***
***శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః ॥***

శివచక్రాలు నాలుగు, శక్తిచక్రాలు ఐదు. మొత్తం తొమ్మిది చక్రాలతో శ్రీచక్రము శివశక్తుల స్వరూపమై వెలుగుగొందుచున్నది.

***త్రికోణ మష్టకోణం చ దశకోణ ద్వయం తథా ।***
***చతుర్దశారం చైతావి శక్తిచక్రాణి పంచ చ ॥***

ఇందులో త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్దశారము అనే ఐదు శక్తిచక్రాలు.

***బిందు శ్చాష్టదళం పద్మం, పద్మం షోడశపత్రకమ్ ।***
***చతురశ్రంచ చత్వారి, శివచక్రాణ్యనుక్రమాత్ ॥***

బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురము అనే నాలుగు శివచక్రాలు.

శ్రీచక్రంలోని తొమ్మిదిచక్రాలు తొమ్మిదిధాతువులకు ప్రతీకలు **కామికాతంత్రం**లో చెప్పినట్లుగా

***త్వగసృఙ్మాంస మేదో ఽస్థి ధాతవ శ్శక్తి మూలకాః ।***
***మజ్జా శుక్ల ప్రాణ జీవ ధాతవ శ్శివమూలకాః ॥***

చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు అనే ఐదు ధాతువులు శక్తి మూలకాలు. మజ్జ, వీర్యము, ప్రాణము, జీవము అనే నాలుగు ధాతువులు శివమూలకాలు.

***నవధాతు రయందేహో నవయోని సముద్భవః ।***
***దశమీ యోని రేకైవ పరాశక్తి స్తదీశ్వరీ ॥***

మానవ దేహము నవయోనుల వలన పుట్టి నవధాతు మయమై ఉన్నది. పదవయోని సాక్షాత్తూ పరమేశ్వరి అయి ఉన్నది.

***ఏవం పిండాండ ముత్పన్నం తద్వద్బ్రహ్మాండ ముద్భభౌ ।***
***పంచభూతాని శాక్తాని మాయాదీని శివస్యతు ॥***
***మాయాచ శుద్ధ విద్యాచ మహేశ్వర సదాశివౌ ।***
***పంచ వింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతితే ॥***

పంచభూతాలు శక్తి సంబంధాలు, మాయాదులు శివసంబంధాలు. ఇవన్నీ కలిసి ఇరవై ఐదు తత్త్వాలయి ఈ నవయోనులందు అంతర్భావం పొందుతున్నాయి.

ఈ ఇరవై అయిదు తత్త్వాలు ఈ విధంగా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | పంచభూతాలు | - | 5 |
| 2. | తన్మాత్రలు | - | 5 |
| 3. | జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 4. | కర్మేంద్రియాలు | - | 5 |
| 5. | మనస్సు | - | 1 |
| 6. | మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, | - | 4 |
| | మొత్తం తత్త్వాలు | | 25 |

శ్రీచక్రంలోని శివ, శక్తి చక్రాలు ఒక దానితో ఒకటి అంతర్భావం పొందుతున్నాయి. గౌడపాదాచార్యులవారి మతానుసారం

| | | | |
|---|---|---|---|
| 1. | త్రికోణంతో | - | వృత్త త్రయము |
| 2. | అష్టకోణంతో | - | అష్టదళ పద్మము |
| 3. | దశార యుగ్మంతో | - | షోడశదళ దళము |
| 4. | చతుర్దశారంతో | - | భూపురము చేరుతున్నాయి |

శ్రీచక్రంలోని శివచక్రాలను చెప్పినప్పుడు గౌడపాదాచార్యులకు, మిగిలిన వారికీ తేడా కనిపిస్తోంది. గౌడపాదులవారు బిందువును శివచక్రంగా చెప్పకుండా వృత్తత్రయాన్ని శ్రీచక్రంగా చెప్పారు. కానీ భైరవయామళము, రుద్రయామళము, వామకేశ్వరతంత్రము లలితాత్రిశతిలతో పాటు మిగిలిన తంత్రాలలో బిందువు శివచక్రంగా చెప్పారు.

వృత్తత్రయం శివచక్రం కాదు. దీని వివరాలు నాచే వ్రాయబడిన **శ్రీవిద్యారహస్యము** అను గ్రంథములోని 'శ్రీచక్రము - వృత్తత్రయము' శ్రీ చక్రము -- బిందువు" అనే వ్యాసాలు చూడండి.

శివ, శక్తి కోణాల ఐక్యత లలితాత్రిశతి, భైరవయామళాలలో ఈ విధంగా వివరింపబడింది.

***త్రికోణే బైందవం శ్లిష్టం, అష్టారేఽ ష్టదళాంబుజమ్ ।***
***దశారయోష్షోడశారం భూగృహం భువనాశ్రకే॥***

1. త్రికోణంలో - బిందువు
2. అష్టకోణంలో - అష్టదళము
3. దశార యుగ్మంలో - షోడశ దళము
4. చతుర్దశారంలో - భూపురము చేరి ఉన్నాయి

***శైవానామపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్ ॥***
***అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్ ।***
***త్రికోణరూపిణి శక్తి ర్బిందురూపపరః శివః ॥***

శివ, శక్తి చక్రములకు అవినాభావ సంబంధము ఎరిగినవాడే చక్రసంకేతము నెరిగిన వాడగుచున్నాడు. ఇక్కడ శక్తి త్రికోణ స్వరూపిణి, శివుడు బిందుస్వరూపుడు అయి ఉన్నారు.

## సపర్య

***కలాయాం బింద్వైక్యం తదను చ తయోర్నాదవిభవే***
***తయోర్నాదేనైక్యం తదను చ కలాయామపి తయోః***
***తయోర్బింద్వావైక్యం త్రితయవిభవైక్యం పరశివే***
***తదేవం షోఢైక్యం భవతి హి సపర్యా సమయినామ్॥*** ***12***

కళ అంటే సాదాఖ్య కళ. ఇది ఉండే ప్రదేశము సహస్రారము. కళకు, బిందువుకు ఐక్యత ఉంది. నాదము అనేది పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనే నాలుగు రూపాలలో ఉంటుంది. వీటిలో

పర - త్రికోణం లోను
పశ్యంతి - అష్టకోణంలోను

మధ్యమ - దశార యుగ్మంలోను

వైఖరి - చతుర్దశారంలోను ఉంటాయి.

శ్రీచక్రాన్ని నాదము అంటారు. షట్చక్రాలు శ్రీచక్రంలో ఐక్యత పొంది ఉన్నాయి. అందుచేత అవి బిందువుచే గ్రహింపబడుచున్నాయని చెప్పవచ్చు. కళలు మొత్తం యాభై అని, అక్షరాలు యాభై అని వీటికి ఐక్యత ఉన్నదని ముందే చెప్పటం జరిగింది.

సాదాఖ్యకళ, చిద్రూప, శ్రీవిద్య, బ్రహ్మవిద్య అని పిలవబడే భగవతి కళకు అతీతమైంది. అందుకే భగవతి నాదబిందు కళాతీత అని చెప్పబడింది. షట్చక్రాలకు శ్రీచక్రానికి ఐక్యత ఉన్నది.

***మూలాధారం తథా స్వాదిష్ఠానం చ మణిపూరకమ్ ।***
***అనాహతం విశుద్ధాఖ్య మాజ్ఞా చక్రం విదుర్బుధాః॥***

ఆధారాదిచక్రాలకు, శ్రీచక్రంలోని చక్రాలకు ఐక్యత ఈ విధంగా ఉంది.

1. ఆధార చక్రానికి - త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి - అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి - అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి - బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధిచక్రానికి - చతుర్దశారంతో ఐక్యత
6. ఆజ్ఞా చక్రానికి - అష్టదళము, షోడశదళములతో ఐక్యత
7. సహస్రారానికి - భూపురంతో ఐక్యత
8. గ్రంథిత్రయానికి - వృత్తత్రయంతో ఐక్యత

దీన్నే నాదబిందుఐక్యము అంటారు. నాదము అంటే శ్రీచక్రము. బిందువు అంటే షట్చక్రాలవనము.

షట్చక్రాలతో యాభై అక్షరాలకు ఐక్యత ఉన్నది. అవి :

1. చంద్రఖండంలో - అ నుంచి అః వరకు పదహారు అచ్చులు
2. సూర్యఖండంలో - క చ ట త ప ఐదు వర్గులు
3. అగ్ని ఖండంలో - య ర ల వ, శ ష స హ
4. ళ కారము - బిందువు నందు
5. క్ష కారము - సర్వత్ర వ్యాపించి యున్నది

కొందరు సమయాచారుల ప్రకారము షట్చక్రాలకు,
శ్రీచక్రములోని చక్రాలకు ఐక్యత ఈ విధంగా ఉంటుంది.



అక్షరాలను మొత్తం ఎనిమిది వర్గులుగా చెప్పారు. ఈ అక్షరాలనే మాతృకలు అని కూడ అంటారు.

| | | | |
|---|---|---|---|
| 1. | అ నుంచి అః వరకు | – | పదహారు అచ్చులు |
| 2. | కచటతప (ఐదు వర్గులు) | – | స్పర్శలు |
| 3. | య ర ల వ | – | అంతస్థములు |
| 4. | శ ష స హ ళ క్ష | – | ఊష్మములు |

ఈ రకంగా అష్టవర్గాత్మకమైన భగవతి మాతృకారూపిణి ఈ అష్టవర్గులలో

| | | | |
|---|---|---|---|
| 1. వశిని | 2. కామేశ్వరి | 3. మోదిని | 4. విమల |
| 5. అరుణ | 6. జయిని | 7. సర్వేశ్వరి | 8. కౌళిని |

అనే ఎనిమిది శక్తులు కలసి ఉన్నాయి. వశిన్యాదిశక్తులు ఎనిమిది, యోగినులు పన్నెండు మంది. యోగినుల వివరాలు :

| | | | |
|---|---|---|---|
| 1. విద్య | 2. రేచికా | 3. యోచికా | 4. అమృతా |
| 5. దీపికా | 6. జ్ఞాన | 7. ఆప్యాయని | 8. వ్యాపిని |
| 9. మేధా | 10. వ్యోమరూపా | 11. సిద్ధరూపా | 12. లక్ష్మి |

వశిన్యాది శక్తులు ఎనిమిది, యోగినులు పన్నెండు, మొత్తం సంఖ్య ఇరవై. వీటిని దశారద్వయంలో ఉంచాలి. గంధాకర్షిణీ, రసాకర్షిణీ, రూపాకర్షిణీ, స్పర్శాకర్షిణీ అనే నాలుగు ఆకర్షణ దేవతలను భూపురంలోని నాలుగు ద్వారాలలో ఉంచాలి. అప్పుడే శ్రీ చక్రాన్ని పూజించాలి. అందుకే

*"మాతృకాం వశినీయుక్తాం యోగినీభి స్సమన్వితామ్ ।*
*గంధాద్యాకర్షిణీయుక్తాం సంస్మరేత్త్రిపురాంబికామ్ ॥"*

అని చెప్పబడింది. అనగా

| | | | |
|---|---|---|---|
| 1. | షట్చక్రాలకు | – | శ్రీ చక్రానికి తాదాత్మ్యము |
| 2. | బిందు స్థానమైన చతురస్రానికి | – | సహస్రారంతో తాదాత్మ్యము |
| 3. | బిందువులో ఉన్న శివునకు | – | దేహంలో ఉన్న శివునితో తాదాత్మ్యము |
| 4. | శ్రీచక్రానికి | – | మూలమంత్రానికి తాదాత్మ్యము |

ఈ రకంగా చతుర్విధైక్యము ఉన్నది అని కొందరి వాదము. నాదము నాలుగు విధాలుగా ఉంటుంది. అవి :

1. పర – త్రికోణంలోను
2. పశ్యంతి – అష్టకోణంలోను
3. మధ్యమ – దశారద్వయంలోను
4. వైఖరి – చతుర్దశారంలోను

అంతర్భూతములు కాబట్టి శ్రీచక్రాన్ని నాదము అని పిలుస్తారు. షట్చక్రాలను బిందువు అంటారు. పరదేవత నాద బిందు కళాతీతమైనది. నాద బిందు కళల ఐక్యత ఆరు విధములు.

**1. నాద బిందు ఐక్యము :** నాదము అంటే శ్రీచక్రము. బిందువు అంటే షట్చక్రాల వనం. వీటి ఐక్యతను పైన వివరించటం జరిగింది.

**2. బిందు – కళల ఐక్యము :** బిందువు అంటే షట్చక్రాల వనము అని చెప్పబడింది. కళలు అంటే యాభై అక్షరాలు. షట్చక్రాలు మూడు ఖండాలుగా ఉన్నాయి. వాటిలో అక్షరాలు ఐక్యమవుతున్నాయి. అసలు అక్షరాలు యాభై. షట్చక్రాలలో ఉండే కళలు యాభై.

1. చంద్ర ఖండంలో – అచ్చులు పదహారు
2. సూర్య ఖండంలో – స్పర్శలు ఇరవైఐదు
3. అగ్ని ఖండంలో – అంతస్థములు, ఊష్మములు ఎనిమిది

హ కార, ళ కారముల బిందువునందు, క్ష కారము సర్వత్ర వ్యాపించి ఉంటుంది.

**3. నాద బిందు కళల ఐక్యత :** కళలు తిథుల స్వరూపాలు. నిత్యలు కళా స్వరూపాలు. కళలు పంచదశీ మహామంత్రంలో అక్షర రూపాలు. మూల మంత్రంలోని పదిహేను అక్షరాలు మూడు ఖండాలుగా ఉన్నాయి. ఇవి సోమ, సూర్య, అనలాత్మకములు. ఈ ఖండాలనే బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథులు. ఆ గ్రంథులే మంత్రంలోని మూడు హ్రీంకారాలు. హ్రీంకారము నకు భువనేశ్వరీ మంత్రత్వము ఉన్నది. అది మూలమంత్రంలో ఉంది. మూలమంత్రం శ్రీచక్రాత్మము. ఆ శ్రీచక్రానికి షట్చక్రాలతో ఐక్యము. దీన్ని నాదబిందు కళల ఐక్యము అంటారు. ఈ రకంగా తిథులు, కళలు, నిత్యలు, షట్చక్రాలు, మూలమంత్రము, శ్రీచక్రాలకు ఐక్యత చెప్పబడింది.

**4. షడ్విధైక్యము :** ఇది ఆరు రకాలుగా ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| 1. | నాద | – | బిందువులకు ఐక్యత |
| 2. | బిందు | – | కళలకు ఐక్యత |
| 3. | కళా | – | నాదాలకు ఐక్యత |
| 4. | కళా | – | బిందువులకు ఐక్యత |
| 5. | నాద | – | కళలకు ఐక్యత |
| 6. | శ్రీవిద్యకు | – | పై ఐదింటితోను ఐక్యత |

ఈ రకంగా సంధానం చేస్తే మణిపూరంలో భగవతి పది చేతులతో దర్శనమిస్తుంది.

**5. చతుర్విధైక్య సంధానము :** ఇది నాలుగు రకాలు :

1. షట్కమలాను సంధానము
2. పంచ విధ సామ్యము
3. షడ్విధైక్య సంధానము
4. పిండాండ బ్రహ్మాండాలకు సంధానము

చతుర్విధైక్యము చేసిన వారికి పిండాండ మంతా కూడా బ్రహ్మాండంగా దర్శన మిస్తుంది. మణిపూరంలో భగవతి నాలుగు చేతులలో దర్శనమిస్తుంది.

ఈ రకంగా ఐక్యాను సంధానం చెయ్యటాన్నే సపర్య అంటారని, చతుర్విధైక్య సంధానము, షడ్విధైక్య సంధానము, రెండు కూడా సమయమతస్థులకు అంగీకారమే అని లక్ష్మీధరుల అభిప్రాయము.

## చతుర్ధైక్యము

*కళా నాదో బిందు : క్రమశ ఇహ వర్ణాశ్చ చరణం*
*షడబ్జంచాధార ప్రభృతిక మమీషాం మిలనమ్!*
*తదేవం షోడైక్యం భవతి ఖలు యేషాం సమయినాం*
*చతుర్ధైక్యం తేషాం భవతి హి సపర్యా సమయినామ్॥* **13**

కళ, నాదము, బిందువు అని మూడు. చరణము అంటే చక్రము, వర్ణాలు, షట్చక్రాలను కలపటమే షడ్విధైక్యము అంటారు. కాని కొందరు సమయులు నాలుగు విధముల ఐక్యము (చతుర్విధైక్యము) మాత్రమే తీసుకోవాలి అంటారు.

1. షోడశ నిత్యలకు - మూలమంత్రానికి ఐక్యము

2. మూల మంత్రానికి - యాభై అక్షరాలతో ఐక్యము

3. యాభై అక్షరాలకు - చంద్రసూర్యాగ్నుల కళాత్మత్వము

4. చంద్రసూర్యాగ్నులతో - త్రిఖండత్వము

వీటిని చతుర్విధైక్యము అంటారు.

నాలుగు దళాలు కలిగిన ఆధారచక్రాన్ని స్వాధిష్ఠానంతో అంతర్భూతం చేసి కౌళులు ఉపాసిస్తారు. ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. అక్కడ సమయులకు పూజలేదు. సమయులు మణిపూరం చేరిన దేవిని మాత్రమే పూజిస్తారు. ఇది సమయమతరహస్యము. షట్చక్రాలలో పంచభూతాలు, మనస్సు కలిసి ఉన్నాయి.

1. పిండాండ బ్రహ్మాండ ఐక్యాను సంధానము

2. షట్కమలాను సంధానము

3. పంచవిధ సామ్యముల అనుసంధానం

4. షడ్విధైక్యాను సంధానము చేత పిండాండము బ్రహ్మాండము వలె ప్రకాశిస్తుంది. ఇది యోగ శాస్త్ర రహస్యము. అందుకని యోగి అయినవాడు చతుర్విధైక్య సంధానము చెయ్యాలి అని చెప్పబడింది.

**పిండ బ్రహ్మాండయోరైక్యం లింగ సూత్రాత్మనోరపి ।**

**స్వాపావ్యాకృతయోరైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనోః॥**

1. పిండాండ బ్రహ్మాండములకు ఐక్యము

2. సూక్ష్మ శరీరానికి సూత్రాత్మకు ఐక్యము

3. స్వాపావ్యాకృతులకు ఐక్యము

4. క్షైతజ్ఞపరమాత్మలకు ఐక్యము. దీని వివరణ ఏమంటే,

1. పిండాండ బ్రహ్మాండాలకు ఐక్యము అంటే తెలుస్తుంది.

2. లింగ సూత్రాలకు ఐక్యము. ఇక్కడ, లింగాత్మ అంటే లింగ శరీరము. పదకొండు ఇంద్రియాలు గల గణము. సూత్రాత్మ అంటే బ్రహ్మాండం అంతా అర్చిరాది మార్గాలలో తీసుకుని పోయేవాడు. ఈ ఇరువురికీ ఐక్యము.

**3. స్వాపావ్యాకృతులకు ఐక్యము :** స్వాపుడు అంటే సుషుప్త్యవస్థ పొందిన వాడు సాక్షి ప్రాజ్ఞుడు. అవ్యాకృతుడు అంటే అవిద్యాశబలిత మగు బ్రహ్మ. ఈ ఇద్దరికి ఐక్యము.

**4. క్షేత్రజ్ఞ పరమాత్ములకు ఐక్యము :** క్షేత్రజ్ఞుడు అంటే జీవాత్మ. పరమాత్మ అంటే పరబ్రహ్మ స్వరూపము. ఈ ఇద్దరికీ ఐక్యము.

ఈ నాలుగు రకాల ఐక్యతను చతుర్విధైక్యము అంటారు. ఇది సంప్రదాయరహస్యము. కొందరు సమయాచారుల ప్రకారము

1. ఆధారాది షట్చక్రాలకు – త్రికోణాది షట్చక్రాలకు
2. బిందు స్థానానికి – సహస్ర కమలానికి
3. బిందువుకు – శివునికి
4. శ్రీచక్రానికి – మూలమంత్రానికి గల ఐక్యతనే చతుర్విధైక్యము అంటారు

మరికొందరి మతము ప్రకారము

1. కళా మేళనము
2. నాద చరణ మేళనము
3. బిందు షట్చక్రమేళనము
4. పై మూడింటికీ శివునితో మేళనములను చతుర్విధైక్యమంటారు. దీనినుంచే విశ్వమంతా వ్యాపించి ఉన్నది. దీని స్థానము సహస్రారము.

కళలు, నిత్యలు, తిథులు, స్వరములు అన్నీ పదహారు చొప్పున ఉన్నాయి. ఇవన్నీ పంచదశీ మహామంత్రంలో ఖండాలుగా ఉండి సోమ, సూర్య అనలాత్మకములుగా పిలువబడుతున్నాయి. వీటికి మూడు గ్రంథులున్నాయి. గ్రంథిత్రయమే హ్రీంకార త్రయము. హ్రీంకారము భువనేశ్వరి. భువనేశ్వరీ మంత్రార్గతమైన మూలమంత్రము శ్రీచక్రస్వరూపము. శ్రీచక్రం షట్చక్రాంతర్గతము. ఇవి శ్రీవిద్యలో గల పంచైక్యములు.

బిందువునుండి వెలువడిన విశేషములే తత్త్వాలు. ఇవి ఇరవైనాలుగు అని, ముప్పైఆరు అనీ, యాభై ఒకటి అని అంటారు. బిందువు నుండి వెలువడిన శబ్ద పరిణామమే పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనేవి శ్రీచక్రంలో గల

1. త్రికోణము – పర
2. అష్టకోణము – పశ్యంతి
3. దశార ద్వయము – మధ్యమ
4. చతుర్దశారము – వైఖరి.

కాబట్టి శ్రీచక్రానికి నాద వ్యవహారము కలిగింది. ఇంద్రియాలు, చంద్ర సూర్యాగ్ని మండలాలు, త్రిలోకాలు శ్రీచక్రంలో ఉన్నాయి. షట్చక్రాలకు శ్రీచక్రంతో ఐక్యత ఉంది. కాబట్టి శ్రీచక్రానికి నాదత్వ వ్యవహారము ప్రసిద్ధము అని చెప్పబడింది.

పిండాండము ద్రష్ట, బ్రహ్మాండము దృశ్యము. 1. బ్రహ్మాండము 2. పిండాండము 3.దేవతలు వీటికి ప్రతీకలుగా 1. బిందువు 2. నాదము 3. కళలు ఉన్నాయి.

అపుడు 1) బిందువు 2) బ్రహ్మాండము 3) నాదము 4) పిండాండము 5) కళలు 6) దేవతలతో కూడిన యంత్రం వస్తుంది. బిందువు పిండాండానికి ప్రతిబింబము. నాదము శ్రీచక్రము బ్రహ్మాండానికి ప్రతిబింబము. మంత్రము దేవతకు ప్రతిబింబము. ఇవన్ని ఒకటే. వీటికి బేధాలు లేవు.

| | | |
|---|---|---|
| 1. శ్రీచక్రంలో | – | బ్రహ్మాండము |
| 2. మంత్రంలో | – | దేవత |
| 3. బిందువులో | – | పిండాండము |
| 4. పిండాండంలో | – | బ్రహ్మాండము |
| 5. పిండాండమున | – | దేవత |
| 6. పిండాండమున | – | బిందువు |

వీటిని ఐక్యమొనర్చినట్లు భావిస్తే దాన్ని షడ్విధైక్యము అంటారు. బిందునాద కళలను దేవతతో ఐక్యమొనరిస్తే చతుర్విధైక్యమంటారు.

సాధకుడు చతుర్విధైక్యము చేసినట్లయితే మణిపూరంలో దేవత చతుర్భుజగాను, షడ్విదైక్యము చేసినట్లయితే దశభుజగాను దర్శనమిస్తుంది. ఇది సమయమతరహస్యము.

## మణిపూరంలో భగవతి

*తటిల్లేఖా మధ్యే స్ఫురతి మణిపూరే భగవతీ*
*చతుర్ధైక్యం తేషాం భవతి చ చతుర్బాహు రుదితా!*
*ధనుర్బాణా నిక్షూద్భవకుసుమజానంకుశవరం*
*తథా పాశం బిభ్రత్యుదిత రవి బింబాకృతి రుచిః !!* ***14***

చతుర్విధైక్య సంధానము చేసినట్లయితే సాధకుడికి మణిపూరంలో భగవతి చతుర్బాహువులతో దర్శనమిస్తుంది. అప్పుడు ఆమె చేతులయందు ధనుస్సు, పుష్పబాణము,

పాశము, అంకుశము ధరించి ఉదయిస్తున్న సూర్యబింబము లాగా ప్రకాశిస్తూ ఉంటుంది. అక్కడ దర్శనమిచ్చే దేవిని, కాళిదాసు.

**చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమ రాగశోణే,**
**పుండ్రేక్షుపాశాంకుశ పుష్ప బాణ హస్తే నమస్తేజగదేకమాతః.**

అని స్తుతించాడు. శంకరాచార్యులవారు కూడా ఇంచుమించు ఇదే అభిప్రాయం వెలిబుచ్చుతూ.

**క్వణత్కాఞ్చీదామా కరికలభ కుంభస్తననతా**
**పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్రవదనా**
**ధనుర్బాణాన్ పాశం సృణి మపి దధానా కరతలై :**

అన్నారు. మణిపూరంలో భగవతి స్థిరసౌదామిని వలె ఉంటుంది. సిద్ధఘటికలో

**మణిపూరైక వసతిః ప్రావృ షేణ్య స్సదాశివః ।**
**అంబుదాత్మతయా భాతి స్థిరసౌదామినీ శివా ॥**

లెక్కలేనన్నీ సూర్యకిరణాలు మేఘరూపం పొంది జలరూపంలో ఆధార స్వాధిష్ఠానాల మధ్య ఉన్నాయి. అనాహతం పైన ఉన్న సూర్యకిరణాలు స్వాధిష్ఠానాగ్నిచే చుట్టబడినవై మణిపూరంలో ప్రవేశించి జలరూపం పొందుతున్నాయి. ఇక్కడ దేవి ఇంద్రధనుస్సులా మెరుస్తూ ఉంటుంది. ఇంద్రధనుస్సుకు అల్లెత్రాడు ఉండదు. ఇదే విషయం తైత్తిరీయారణ్యకశ్రుతిలో ఈ విధంగా ఉంది.

**తదింద్రధను రిత్యజ్యమ్, అభ్రవర్ణేషు చక్షతే ।**
**ఏతదేవ శంయోర్బార్హ స్పత్యస్య ఏతద్రుద్రస్య ధనుః ॥**

సూర్య మండలం అమృతంతో పూర్తిగా నిండి ఉంది. చంద్రమండలము నుండి స్రవించే అమృత ధారలతో సూర్యమండలానికి పరిపూర్ణత కలుగుతుంది. అందుకే **చంద్రజ్ఞానవిద్యలో** ఈ విధంగా అన్నారు.

**"సూర్య మండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం ।**
**పాశాంకుశధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥"**

పాశాంకుశములు, ధనుర్బాణములు ధరించి సూర్యమండలము మధ్య ప్రకాశించే భగవతిని ధ్యానించాలి. అందుకే కాళిదాసు ఇలా అన్నాడు.

*యే చింతయంత్యరుణమండలమధ్యవర్తి*
*రూపం తవాంబ నవయావకపంకరమ్యమ్.*
*తేషాం సదైవ కుసుమాయుధబాణభిన్న*
*వక్షస్థలా మృగదృశో వశగా భవంతి ॥*

## దేవి సాక్షాత్కార రూపము

*భవత్త్రైక్యం షోఢా భవతి భగవత్యాః సమయినాం*
*మరుత్వత్కోదండ ద్యుతినియుత భాసా సమరుచిః !*
*భవత్పాణివ్రాతో దశవిధ ఇతీదం మణిపురే*
*భవాని ప్రత్యక్షం తవ వపురుపాస్తే నహి పరమ్ ॥* ***15***

సమయ మతంలో కొందరు చతుర్విధైక్య సంధానము చేయగా మరికొందరు షడ్విధైక్య సంధానము చెయ్యాలి అంటారు. షడ్విధైక్య సంధానము చేసిన వారికి దేవి దశభుజగా దర్శనమిస్తుంది. మణిపూరంలో భగవతి విద్యుల్లత వలె ప్రకాశిస్తుంది.

ఆధార చక్రానికి నాలుగుదళాలు, స్వాధిష్ఠానానికి ఆరుదళాలు, ఉంటాయి. మణిపూరము ఈ రెండు చక్రాలకు ప్రతిరూపము. అందుచేతనే మణిపూరంలో పది దళాలుంటాయి. మణిపూరం దగ్గర నుండి ఆజ్ఞాచక్రం వరకు ఉన్న చక్రాలన్నీ ఆధార స్వాధిష్ఠానాలకు ప్రతీకలు.

కౌళమతం వారు ఆధార స్వాధిష్ఠానాలను అనుసంధానం చెయ్యటం వల్ల షట్చక్రాలను అనుసంధానం చేసిన ఫలం కలుగుతుంది. కాని చతుర్విధైక్య లేదా షడ్విధైక్య సంధానము చెయ్యక పోవటంవల్ల భగవతి మణిపూరంలో ప్రత్యక్షం కాదు. అయితే కౌళమతస్థులు ఐహికవాంఛాపరులు, వారి ధ్యేయం కామ్యసిద్ధి. అందుచేత మణిపూరంలో భగవతి సాక్షాత్కారం వారికి అవసరం లేదు.

**ధారణా పరిజ్ఞానాన్ముక్తి :** అని భగవత్పాదులు అన్నారు. ఈ ధారణలు మూడువందల అరవై ఉన్నాయి. నాదకళల ద్వారా షట్చక్రములందు కలుగువాయు నిరోధమే ధారణ. ఒక్కొక్క చక్రంలోనూ యాభై చొప్పున ఆరు చక్రాల్లోను 6×50= 300 + సహస్రారంలో అరవై. మొత్తం మూడువందల అరవై ధారణలు అవి నాదబిందుకళలతో కలిసి మతి, స్మృతి, ప్రజ్ఞ, మేధ, ప్రతిభ, ప్రతీకలను కలుగచేస్తాయి. **సకలజననీస్తోత్రం**లో కాళిదాసు.

*"చతుష్ప త్రాంతష్షడ్దలపుట భగాంతస్త్రివలయ*
*స్ఫురద్విద్యు ద్వహ్ని ద్యుమణి నియుతాభద్యుతిలతే*
*షడస్రం భిత్వాఽఽ ఽదౌ దశదళమథ ద్వాదశదళం*
*కళాస్రం చ ద్వ్యస్రం గతవతి నమ స్తే గిరిసుతే"*

అన్నాడు. నాలుగుదళాలు కలది ఆధారచక్రము. ఆరు దళాలు కలది స్వాధిష్ఠానము. దీని సంపుటాత్మకమున త్రికోణములు తరువాత నాలుగు చక్రాలకు చెందినవి. ఈ ఆరు చక్రాల మధ్య గ్రంథిత్రయం ఉంది. ఇక్కడ విద్యుల్లత లాగా పరాశక్తి ఉంటుంది. బ్రహ్మగ్రంథి భేదన సమయంలో ఆ శక్తి విద్యున్నియుతాభాగగను, రుద్రగ్రంథి భేదన సమయంలో వహ్నినియుతా భాగగను, విష్ణుగ్రంథి భేదన సమయంలో ద్యుమనియుతా భాగగను కన్పించును. నియుత మనగా అసంఖ్యాకమని అర్థము.

చతుర్విధైక్యము చేసిన వారికి దేవి పాశాంకుశ ధనుర్బాణములు ధరించి మణిపూరంలో నాలుగుచేతులతో దర్శనమిస్తుంది. షడ్విధైక్యసంధానము చేసినట్లయితే దేవి దశభుజగా దర్శనమిస్తుంది. అప్పుడు దేవి ధనుర్బాణములు, పాశాంకుశములు, వరదాభయముద్రలు, పుస్తకము, అక్షమాల, రెండు చేతుల వీణ ధరించి ఉంటుంది. **లఘుస్తవం** లో చెప్పినట్లుగా.

***"వామే పుస్తకధారిణీ మభయదాం సాక్షస్రజం దక్షిణే***
***భక్తేభ్యో వరదాన పేశలకరాం కర్పూరకుందోజ్జ్వలామ్ ।***
***ఉజ్జృంభాంబుజపత్రకాంతి నయన స్నిగ్ధ ప్రభాలోకనీం***
***యేత్వామంబ న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః॥"***

అటువంటి దేవిని ధ్యానించినట్లయితే కవిత్వం సిద్ధిస్తుంది. సమయాచారులకు బాహ్యపూజలేదు. హృదయమందు మాత్రమే దేవిని పూజించాలి.

***"మాతృకాం వశినీయుక్తాం యోగినీభి స్సమన్వితామ్***
***గంధాద్యాకర్షిణీయుక్తాం సంస్మరే త్త్రిపురాంబికామ్"***

సాధకులు వశిన్యాదిశక్తియుక్తము, యోగినీ గణసమన్వితము, గంధాకర్షిణీ సహితము అయిన త్రిపురాంబికను ధ్యానించాలి.

*"యః స్ఫటికాక్షగుణ పుస్తక కుండికాఢ్యాం*
*వ్యాఖ్యా సముద్యతకరాం శరదిందుశుభ్రామ్*
*పద్మాసనాం చ హృదయే భవతీముపాస్తే*
*మాతః స విశ్వకవితాం కిం చక్రవర్తీ ॥"*

చేతులయందు అక్షమాల, పుస్తకము, కమండలము ధరించి పద్మాసనాసీన అయిన భగవతిని ధ్యానించినట్లైతే ప్రపంచాన్ని సమ్మోహనం చేసే కవిత్వం సిద్ధిస్తుంది. **చర్చాస్తవం**లో చెప్పినట్లుగా.

*యే చింతయంత్యరుణ మండలమధ్యవర్తి*
*రూపం తవాంబ నవయావకపంకరమ్యమ్*
*తేషాం సదైవ కుసుమాయుధబాణభిన్న*
*వక్షస్థ్సలా మృగదృశో వశగా భవంతి॥*

సూర్యమండల మధ్యవర్తియై ఎర్రని ఛాయతో వెలుగొందుతున్న దేవిని ఆరాధిస్తే, లేడి కనుల జవరాండ్రు అతనికి వశమవుతారు. అవి ఇవీ అని ఎందుకు ? ఆ దేవిని గనక ధ్యానించి నట్లైతే సకలవిజయాలు సిద్ధిస్తాయి.

*త్వాం వ్యాపినీతి సుమనా ఇతి కుండలీతి*
*త్వాం కామినీతి కమలేతి కళావతీతి*
*త్వాం మాలినీతి లలితే త్యపరాజితేతి*
*దేవి స్తువంతి విజయేతి బయే త్యుమేతి*

## ఆయుధములు

*భవాని శ్రీహస్తైః వహసి ఫణిపాశం సృణి మథో*
*ధనుః పౌండ్రం పౌష్పం శరమథజపస్రక్షుకవరౌ !*
*అథద్వాభ్యాం ముద్రామభయవరదానైక రసికాం*
*క్వణద్వీణాం ద్వాభ్యాం త్వమురసి కరాభ్యాం చ భిభృషే ॥* **16**

ఈ శ్లోకంలో దేవికి ఎన్ని చేతులు ఉన్నాయి ? ఆ చేతులయందు ఏ ఏ ఆయుధములు ఉన్నాయి. అనే విషయాన్ని గౌడపాదులు వివరిస్తున్నారు. సమయాచారంలో

బాహ్యాపూజలేదు. మానసిక పూజమాత్రమే చేయాలి. ఆశ్వయుజశుద్ధ నవమి నాటి రాత్రి గురువు శిష్యుని తలపై చేయి ఉంచి, మరల మంత్రోపదేశం చేసి షట్చక్రపూజవిధానము, చతుర్విధైక్య సంధానము ఉపదేశిస్తాడు. తరువాత సాధకునికి భగవతి మణిపూరంలో సాక్షాత్కరిస్తుంది. ఆధార స్వాధిష్టానాలు అంధకారబంధురాలు. వాటిలో సమయులకు పూజలేదు. వీరు మణిపూరంలో మాత్రమే దేవిని పూజించాలి చంద్రజ్ఞాన విద్యలో చెప్పినట్లుగా.

*"సూర్య మండలమధ్యస్థాం దేవీ త్రిపురసుందరీం ।*
*పాశాంకుశధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥"*

పాశాంకుశ ధనుర్బాణములు ధరించి సూర్య మండలము మధ్యన అనగా మణిపూరమున ప్రకాశిస్తున్న దేవిని మాత్రమే పూజించాలి.

అయితే సూర్యమండలంలో ప్రకాశించే దేవికి ఎన్ని చేతులు ఉంటాయి అనేది సాధకుడు చేసే అనుసంధానం మీద ఆధార పడి ఉంటుంది.

సాధకుడు గనక చతుర్ధైక్య సంధానము చేసినట్లైతే సూర్యమండలంలో దేవి పాశము, అంకుశము, ధనుస్సు, బాణములు ధరించి చతుర్భుజగా ధర్శనమిస్తుంది.

*పింద బ్రహ్మాండయోరైక్యం లింగ సూత్రాత్మనోరపి ।*
*స్వాపావ్యాకృతయోరైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనో ॥*

1. పిండబ్రహ్మాండములకు ఐక్యము
2. లింగ సూత్రాలకు ఐక్యము
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము
4. క్షేత్రజ్ఞ పరమాత్ములకు ఐక్యము

ఈ నాలుగు రకాల ఐక్యతనే చతుర్ధైక్యము అంటారు. చత్మర్ధైక్య సంధానము చేసిన వారికి కాళిదాసు చెప్పినట్లుగా ఆ దేవి

***చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్న తే కుంకుమరాగశోణే,***
***పుండ్రేక్షు పాశాంకుశపుష్ప బాణ హస్తే నమస్తే జగదేక మాతః***

పుండ్రేక్షు చాపము, పుష్ప బాణము, పాశము, అంకుశము ధరించి నాలుగు చేతులతో దర్శనమిస్తుంది. శంకరభగవత్పాదులవారు కూడా ఇంచుమించు ఇదే అభిప్రాయాన్ని సౌందర్యహరిలో వ్యక్తం చేశారు.

**క్వణత్కాఞ్చీదామా కరికలభ కుంభ స్తననతా**
**పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్రవదనా**
**ధనుర్బాణాన్ పాశం సృణి మపి దధానా కరతలైః**

షడ్విధైక్య సంధానం చేసిన వారికి మణిపూరంలో దేవి దశభుజగా దర్శనమిస్తుంది 1) కళలు, 2) నాదము 3) బిందువు, 4) వర్ణములు 5) శ్రీచక్రము 6) షట్చక్రాల అనుసంధానమునే షడ్విధైక్యము అని సమయాచారులంటారు. సాధకుడు షడ్విధైక్య సంధానం గనక చేసినట్లైతే మణిపూరంలో భగవతి దశభుజగా సాక్షాత్కరిస్తుందని గౌడపాదులవారు అంటున్నారు. ఆ దేవి పుండ్రేక్షు చాపము, పుష్పబాణము, సర్పరూప పాశము, అంకుశము, జపమాల, శుకవరము, అభయవరదముద్రలు, రెండు చేతుల యందు వీణ ధరించి ఉంటుందని కొందరి అభిప్రాయము కాగా మరికొందరి అభిప్రాయములో పాశాంకుశములు, పుండ్రేక్షు చాపము, పుష్పబాణము, జపమాల, శుకవరము, అభయవరద ముద్రలు, రెండు చేతులలోను వీణ ధరించి ఉంటుంది.

ఈ రకంగా చతుర్విధైక్య సంధానము చేసిన వారికి దేవి చతుర్భుజగాను, షడ్విధైక్య సంధానము చేసిన వారికి దేవి దశభుజగాను దర్శనమిస్తుంది. ఈ రెండూ సమ్మతములే అని గౌడపాదులు, శంకర భగవత్పాదులు, లక్ష్మీధరులు, భాసురానందులు కూడా అన్నారు.

సాధకుడు ఎప్పుడైతే ఈ రకంగా అనుసంధానం చేయగలిగాడో అప్పుడు జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే అని తెలుసుకుని ఈ విశ్వమంతా తనలోనే చూడకలుగుతాడు. అలౌకికమైన ఆనందాన్ని పొందగలుగుతాడు. ఎవరికి ఏరకమైన కష్టం వచ్చినా అది తనకు వచ్చినట్లుగానే భావించగలుగుతాడు. అందుకే అటువంటివ్యక్తిని ప్రపంచం గౌరవిస్తుంది. అతడికి దాసోహం అంటుంది.

***సూర్య మండల మధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం***
***పాశాంకుశ ధనుర్బాణ హస్తాం ధ్యాయేత్సు సాధకః***
***త్రైలోక్యం మోహయేద్యాశు నరనారీ గణైర్యుతం***

ఆ రకంగా సూర్యమండలంలో ప్రతిభాసించే దేవిని ధ్యానించినట్లైతే నరనారీ గణములతో కూడిన మూడులోకాలు ఆ సాధకుడి వశమవుతాయి. అని సుభగోదయంలో

చెప్పబడింది. సూర్యమండలంలో ప్రకాశించే ఆ దేవిని గనక ధ్యానిస్తే లేడికనులు కలిగిన జవరాండ్రు సాధకుడికి వశమవుతారు అని చర్చాస్తవంలో చెప్పబడింది.

***యే చింత యంత్యరుణమండలమధ్యవర్తి***
***రూపం తవాంబ నవయావకపంకరమ్యమ్***
***తేషాం సదైవ కుసుమాయుధబాణభిన్న***
***వక్షస్థలా మృగదృశో వశగా భవంతి ॥***

లఘుస్తవంలో చెప్పినట్లుగా చేతులయందు పుస్తకము, అక్షమాల అభయవరద ముద్రలు ధరించి, కర్పూరము, మల్లెపూలవలె స్వచ్ఛమైనదిగా ప్రకాశించే ఆదేవిని ధ్యానించినట్లైతే  కవిత్వం సిద్ధిస్తుంది.

***"వామే పుస్తకధారిణీ మభయదాం సాక్షస్రజం దక్షిణే***
***భక్తేభ్యో వరదాన పేశలకరాం కర్పూరకుందోజ్జ్వలామ్ ।***
***ఉజ్జృంభాంబుజపత్రకాంతి నయన స్నిగ్ధ ప్రభాలోకనీం***
***యేత్వామంబ న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః॥"***

చేతులయందు అక్షమాల, పుస్తకము, కమండలము ధరించి పద్మసనాసీనయై, శరత్కాల చంద్ర బింబము వలె ప్రకాశించు దేవిని ఎవరైతే ధ్యానిస్తారో వారికి ఈలోకాన్ని సంమోహనం చేసే కవిత్వం సిద్ధిస్తుందని అంబాస్తవంలో చెప్పబడింది.

***"యః స్ఫటికాక్షగుణ పుస్తక కుండికాఢ్యాం***
***వ్యాఖ్యా సముద్యతకరాం శరదిందుశుభ్రామ్ ।***
***పద్మాసనాం చ హృదయే భవతీముపాస్తే***
***మాతః స విశ్వకవితాం కిం చక్రవర్తీ ॥"***

ఆ దేవిని ధ్యానించే వాడికి ధనధాన్యాదులు సమృద్ధిగా సమకూరతాయి. లక్ష్మీదేవి అతనికి వశమౌతుంది.

***లక్ష్మీవశీకరణ కర్మణి కామినీనా***
***మాకర్షణ వ్యతికరేషు చ సిద్ధమంత్రః***
***నీరంధ్ర మోహ తిమిర చ్ఛిదురు ప్రదీపో***
***దేవీ త్వదంఘ్రి జనితో జయతి ప్రసాదః***

అసలు అవి, ఇవి అని ఎందుకు ? సూర్యమండలంలో ఉన్న దేవిని గనక దేవిని పూజించినట్లైతే సాధకుడికి సర్వకార్యాలు నెరవేరతాయి. సర్వ విజయాలు సిద్ధిస్తాయి.

**త్వాం వ్యాపినీతి సుమనా ఇతి కుండలీతి**
**త్వాం కామినీతి కమలేతి కళావతీతి**
**త్వాం మాలినీతి లలితే త్యపరాజితేతి**
**దేవీం స్తువంతి విజయేతి జయే త్యుమేతి**

## శ్రీచక్ర స్వరూపము

***త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ***
***ద్దశారంభూగేహాదపిచ భువనాశ్రం సమభవత్ !***
***తతోऽభూన్నాగారం నృపతిదళమస్మా త్త్రివలయం***
***చతుర్ద్వాః ప్రాకారత్రితయమిదమేవాంబ శరణమ్ ॥*** **17**

ఈ శ్లోకంలో గౌడపాదాచార్యులవారు శ్రీచక్ర స్వరూప స్వభావాలను వివరిస్తున్నారు. శ్రీచక్రంలో శక్తి చక్రమైన త్రికోణమునుండి మిగిలిన శక్తి చక్రాలు విస్తరించి ఉన్నాయి. మొదటగా బిందువు, త్రికోణము, అష్టకోణము, దశకోణములు రెండు, చతుర్దశారము, అష్టదళము, షోడశదళము, భూపురత్రయములతో ఉన్న చక్రాన్ని శ్రీచక్రం అంటారు. ఇందులో షోడశదళం తరువాత త్రివలయాలు ఉంటాయి.

శ్రీచక్రాన్ని గురించి శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో

**చతుర్భిః శ్రీకణ్ఠైః శ్శివయువతిభిః పఞ్చభిరపి**
**ప్రభిన్నాభి శ్శమ్భో ర్నవభిరపి మూలప్రకృతిభిః**
**చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ**
**త్రిరేఖాభి స్సార్ధం తవ శరణకోణాః పరిణతాః॥**

నాలుగు శివచక్రాలతోను, ఐదు శక్తిచక్రాలుతోను తొమ్మిది మూల ప్రకృతికలతోను, శ్రీచక్రము శివాశివులకు నిలయమై ఉన్నది. శ్రీచక్రంలో బీజాక్షరాలు ఉండవు. ఇది కేవలము రేఖా నిర్మితము.

***బిన్దు త్రికోణ వసుకోణ దశారయుగ్మ***

***మన్వస్ర నాగదళ షోడళ పత్రయుక్తం***

***వృత్తత్రయంచ ధరణీ సదన త్రయంచ***

***శ్రీచక్ర రాజఉదితః పరదేవతాయాః ॥***

శ్రీచక్రంలో బిందువు, త్రికోణము, అష్టకోణము, దశకోణయుగ్మము, చతుర్దశ కోణము, అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము, భూపురత్రయము ఉంటాయి. ఇదే విషయాన్ని చాలా చోట్ల చెప్పటం జరిగింది. శ్రీచక్రాన్ని గురించి **భైరవయామళం**లో ఈ విధంగా చెప్పబడింది.

***చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః ।***

***శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః ॥***

నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు వెరసి తొమ్మిదిచక్రాలతో శ్రీచక్రము శివశక్తుల స్వరూపమై ఉన్నది.

***త్రికోణ మష్టకోణం చ దశకోణ ద్వయం తథా ।***

***చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ చః ॥***

దీనిలో త్రికోణము, అష్టకోణము, దశకోణములు రెండు, చతుర్దశ కోణము అను ఐదూ శక్తిచక్రాలు. శక్తి చక్రాలన్నీ కోణాకారంలోనే ఉంటాయి.

***బిందు శ్చాష్టదళం పద్మం, పద్మం షోడశపత్రకమ్ ।***

***చతురశ్రంచ చత్వారి, శివచక్రాణ్యనుక్రమాత్ ॥***

బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురము అను నాలుగు శివచక్రాలు. ఈ రకంగా శ్రీచక్రంలో మొత్తం తొమ్మిది చక్రాలు ఉన్నాయి.

శ్రీచక్రము మొత్తము తొమ్మిది చక్రాల సమూహమై ఉన్నది. దీనినే 'నవయోన్యాత్మకము' అంటారు. ఈ నవయోనులు నవధాతువులకు ప్రతీకలు **కామికాతంత్రం**లో చెప్పినట్లుగా

***త్వగసృఙ్మాంసయే దోఽస్థి ధాతవ శ్శక్తి మూలకాః ।***

***మజ్జా శుక్ల ప్రాణ జీవ ధాతవ శ్శివమూలకాః ॥***

చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు అను ఐదుధాతువులు శక్తి మూలకాలు. మజ్జ, వీర్యము, ప్రాణము జీవము అనే నాలుగు ధాతువులు శివ మూలకాలు.

***నవధాతు రయందేహో నవయోని సముద్భవః ।***
***దశమీ యోని రేకైవ (దశమోధాతు రేకైవ) పరాశక్తి స్తదీశ్వరీ ॥***

ఈ దేహము నవయోనుల వలన పుట్టి నవధాతు మయమై ఉన్నది. దీనిలో పదవ ధాతువు పరమేశ్వరి.

***ఏవం పిండాండ ముత్పన్నం తద్వద్బ్రహ్మాండ ముద్భభౌ***
***పంచభూతాని శాక్తాని మాయాదీని శివస్యతు ॥***
***మాయాచ శుద్ధ విద్యాచ మహేశ్వర సదాశివౌ***
***పంచవింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతితే ॥***

పంచభూతాలు శక్తిసంబంధాలు. మాయాదులు శివసంబంధాలు. ఇవన్నీ కలసి ఇరవైఐదు తత్త్వాలై, నవయోనులందు అంతర్భావము పొందుతున్నాయి. అవి :

| | | |
|---|---|---|
| 1. | పంచభూతాలు | 5 |
| 2. | తన్మాత్రలు | 5 |
| 3. | జ్ఞానేంద్రియాలు | 5 |
| 4. | కర్మేంద్రియాలు | 5 |
| 5. | మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | 4 |
| 6. | మనస్సు | 1 |
| | మొత్తం తత్త్వాలు | 25 |

ఈ తత్త్వాలు ఇరవైఐదు కాదు యాభై ఒకటి అని, ముప్పైఆరు అని, కొందరి వాదన. దీనికి వివరణ నాచే వ్రాయబడిన **శ్రీవిద్యారహస్యము**లో శ్రీచక్రము తత్త్వాలు అనే వ్యాసంలో ఇవ్వబడింది.

ఈ ఇరవైఐదు తత్త్వాలు నవయోనులందు అంతర్భావం పొందుతున్నాయి. గనకనే శ్రీచక్రాన్ని బ్రహ్మాండాకారంగా వర్ణించటం జరిగింది.

***శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకార మీశ్వరీ ।***
***పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవచ ॥***
***ఇంద్రియాత్మక మేవంచ మన స్తత్త్వాత్మకం తథా ।***
***మాయాది తత్త్వరూపంచ తత్త్వాతీతం చ బైందవమ్ ॥***

**అహం దేవీ నచాన్యోఽస్మి బ్రహ్మైవాహంనశోక భాక్ ।**
**సర్వంఖల్విద మేవాహం నాన్యద స్తి సనాతనమ్ ॥**

శ్రీచక్రంలో కోణాల సంఖ్య మొత్తం నలభైమూడు. అది ఏవిధంగా అంటే

| అసలు ఉండేవి | | కంటికి కనిపించేవి | |
|---|---|---|---|
| చతుర్దశారంలో | 14 | చతుర్దశారంలో | 14 |
| బహిర్దశారంలో | 10 | బహిర్దశారంలో | 10 |
| అంతర్దశారంలో | 10 | అంతర్దశారంలో | 10 |
| అష్టకోణంలో | 8 | అష్టకోణంలో | 8 |
| త్రికోణంలో | 3 | త్రికోణంలో | 1 |
| మొత్తం కోణాలు | 45 | మొత్తం కోణాలు | 43 |

ప్రస్తారమును బట్టి శ్రీచక్రాన్ని గీసేటప్పుడు త్రికోణంలోని క్రింది రెండు కోణాలు అష్టకోణంలో అంతర్గతమౌతాయి. కాబట్టి త్రికోణంలో ఒక కోణమే కనిపిస్తుంది. అందుచేత శ్రీచక్రంలోని కోణాల సంఖ్యను లెక్కపెడితే నలభైమూడు వస్తుంది. బిందువుతో కలిపితే నలభైనాలుగు అవుతాయి. మేరు ప్రస్తారంలో కోణాల సంఖ్య 45 విపులంగా తెలుస్తుంది. శ్రీచక్రంలోని ఆవరణలను, కోణాలను ప్రక్క పటంలో విపులంగా చూపటం జరిగింది. ఇక్కడ శివచక్రాలు, శక్తి చక్రాలు ఒక దానితో ఒకటి అంతర్భావం పొందుతున్నాయని **భైరవయామళం**లో చెప్పబడింది.

***త్రికోణే బైందవం శ్లిష్టం, అష్టారేఽష్టదళాంబుజమ్ ।***
***దశారయోష్షోడశారం భూగృహం భువనాశ్రకే ॥***

1. త్రికోణమున - బిందువు
2. అష్టకోణమున - అష్టదళ పద్మము
3. దశారయుగ్మమున - షోడశదళము
4. చతుర్దశారమున - భూపురము చేరుతున్నాయి.

***శై వానామపి శాక్తానాం చక్రాణాంచ పరస్పరమ్ ।***
***అవినాభావసంబంధం యో జానాతి స చక్రవిత్ ॥***

శివచక్రములకు, శక్తిచక్రములకు అవినాభావ సంబంధమున్నది. ఆ సంబంధము నెరిగిన వాడే చక్రవిదుడు. శ్రీచక్రంలో ఇరవై నాలుగు సంధులు, ఇరవై ఎనిమిది మర్మస్థానాలు ఉన్నాయి.

**ద్విరేఖాసంగమస్థానం సంధి రిత్యభిధీయతే ।**
**త్రిరేఖా సంగమస్థానం మర్మ మర్మవిదో విదుః॥**

రెండు రేఖలు కలిసినచోట సంధి అనీ, మూడురేఖలు కలిసిన చోట మర్మస్థానము అనీ చెప్పబడింది. **చంద్రజ్ఞానవిద్యలో** చెప్పబడినట్లుగా

**"మన్వశ్ర ద్విదశారాష్టకోణవృత్త చతుష్టయమ్ ।**
**అష్టావింశతిమర్మాణి చతుర్వింశతి సంధయః ॥**

అనగా చతుర్దశారము, దశారయుగ్మము, అష్టకోణము మొదలైన శక్తి చక్రాల యందు ఇరవైనాలుగు సంధులు, ఇరవై ఎనిమిది మర్మస్థానాలు ఉన్నాయి. కాని ఆ చక్రములు గీసి లెక్కించగా ఇరవైనాలుగు మర్మస్థానాలు మాత్రమే ఉంటాయి. అయితే శివచక్రాలకు సంగమస్థానం లేకపోయినప్పటికి, వాటిని కూడా మర్మస్థానాలుగానే పరిగణించాలి. అప్పుడు మర్మస్థానాల సంఖ్య ఇరవైఎనిమిది అవుతుంది. ఈ రకంగా శ్రీచక్రంలో నలభైమూడు కోణాలు, ఇరవైనాలుగు సంధులు, ఇరవై ఎనిమిది మర్మస్థానాలు ఉన్నాయి.

శ్రీచక్రాన్ని రెండు రకాలుగా గీయటం జరుగుతుంది. 1) సృష్టి క్రమము 2) సంహార క్రమము.

**1) సృష్టి క్రమము :** ఇది సమయాచార చక్రము. దీనిలో నలభైమూడు కోణాలు ఇరవైనాలుగు సంధులు, ఇరవై ఎనిమిది మర్మ స్థానాలు ఉంటాయి. దీనిలో ఐదు కోణములు క్రిందవైపుకూ, నాలుగు కోణములు పై వైపుకూ ఉంటాయి. బిందువు త్రికోణం మధ్య ఉంటుంది.

**2) సంహార క్రమము :** ఇది కౌళాచార చక్రము. దీనిలో నాలుగు కోణాలు క్రింది వైపుకూ, ఐదు కోణాలు పై వైపుకూ ఉంటాయి. బిందువు త్రికోణం మధ్యన ఉంటుంది. దీనిలో కోణములకు సంఖ్యా నియమం లేదు. ఇరవైనాలుగు సంధులు, ఇరవై ఎనిమిది మర్మస్థానాలు మాత్రం ఉంటాయి.

ఈ రెండు చక్రములందు శివచక్రాలు ఒకే విధంగా ఉంటాయి.

శ్రీచక్రలేఖనంలో బిందువు నుండి మొదలు పెట్టి భూపురం వరకు గీసినట్లైతే సృష్టిచక్రం అని, భూపురంతో మొదలు పెట్టి బిందువు వరకు గీసినట్లైతే సంహారచక్రం అంటారు.

ప్రస్తారమును బట్టి శ్రీచక్రాన్ని మూడు రకాలుగా విభజించవచ్చు.

1) భూప్రస్తారము 2) మేరు ప్రస్తారము 3) కైలాస ప్రస్తారము. ఇవే కాక అర్ధమేరువు. కూర్మ ప్రస్తారాలు కూడా ఉన్నాయి.

*బీజాక్షర యుతం చక్రం । యతీనా ముత్త మోత్తమం ।*
*బీజాక్షర విహీనంతు గృహస్థా నాం ప్రశస్తకం ॥*

పైన చెప్పిన మూడు రకాల శ్రీచక్రాలలోను బీజాక్షరములు గలది యతుల దగ్గర ఉండటం శ్రేయస్కరము. బీజాక్షరములు లేని చక్రము గృహస్థులకు ప్రశస్తమైనది. కాగా **శక్తిసంగమతంత్రం**లో.

*బీజం వినాతునిర్జీవం । శవ వత్పరికీర్తి తం ।*
*బీజయుక్తం భవేద్యంత్రం । నిశ్శృత్తం సిద్ధిదాయకం ।*
*శ్రీచక్రం బీజసంయక్తం । నిశ్శృత్తం పరమేశ్వరీ ।*
*బీజహీనంతుయచ్చక్రం । తచ్చక్రం సిద్ధిదం నచ ॥*

శ్రీచక్రంలో బీజాక్షరాలు లేకపోతే అది నిర్జీవం అవుతుంది. అందుచేత బీజాక్షరాలు లేని శ్రీచక్రపూజ సిద్ధించదు.

శ్రీచక్ర లేఖనంలో కొన్ని తేడాలున్నాయి. అయితే ఈ తేడాలు వృత్తాలకూ, బిందువుకూ మాత్రమే పరిమితం అయి ఉన్నాయి.

ముందుగా వృత్తాలను చూసినట్లైతే, అసలు శ్రీచక్రంలోఎన్ని వృత్తాలున్నాయి ? అవి ఎక్కడ ఉన్నాయనేదే ప్రశ్న. మనకు దొరికినంత వరకు శాస్త్రాలను బట్టి శ్రీచక్రంలో మూడు వృత్తాలున్నాయని దాదాపు అందరూ ఒప్పుకుంటున్నారు. అయితే అవి చతుర్దశారం తరువాత ఒకటి, అష్టదళం తరువాత ఒకటి, షోడశదళం తరువాత ఒకటి ఉన్నాయని కొందరు, మూడువృత్తాలు షోడశారం తరువాతే ఉన్నాయని మరికొందరూ శాస్త్రాల ఆధారంగా నిరూపిస్తున్నారు. అయితే శ్రీచక్రంలో ఉండేవి మూడువృత్తాలు కాదు. నాలుగు అని, ఐదు అని, ఆరు అని, ఏడు అని, ఎనిమిది అని భిన్న వాదనలున్నాయి. ఇవన్నీ

**వామకేశ్వరతంత్రం సేతుబంధం** వ్యాఖ్యలో చర్చించబడ్డాయి. కాని చివరకు భాసురానందుల వారు షోడశారం తరువాతనే వృత్తత్రయం ఉండాలని తీర్మానించారు.

శ్రీచక్రంలో వృత్తాలు ఎన్ని ఉన్నప్పటికీ అవి నవావరణలో చేరటం లేదు. వాటికి ప్రత్యేకపూజ కూడా లేదు. అందువల్ల ఈ వృత్తాలను చక్రనిర్మాణంలో ఒక భాగంగా మాత్రమే గుర్తించాల్సి ఉంటుంది. బహుశః ఆయా చక్రాలలో ఉండే దేవతల పరిధి నిర్ణయించటానికే ఈ వృత్తాలు ఏర్పాటు చేసి ఉంటారని పుష్పగిరి పీఠ ఆస్థాన పండితులు శ్రీ విశ్వనాథం గారు అభిప్రాయపడుతున్నారు. కాని శ్రీచక్రంలోని మూడు వృత్తాలూ, మంత్రం లోని మూడు హ్రీంకారాలకు ప్రతీకలుగా చెప్పబడుతున్నాయి.

శ్రీచక్రంలో ప్రధానమైనది బిందువు. ఇది తొమ్మిదవ ఆవరణ. దీనిని సర్వానంద మయ చక్రం అంటారు. ఇది శివశక్తుల క్రీడాప్రదేశం. "త్రికోణే బైందవమ్ శ్లిష్టం". అనగా బిందువు త్రికోణం మధ్యన ఉంటుంది. అని లలితా త్రిశతి ఫలస్తుతిలోనూ, భైరవయామళంలోనూ చెప్పబడింది. దీనిని అందరూ అంగీకరిస్తూ కౌళ, సమయాచారాల్లో అర్చనాభేధం మాత్రమే ఉన్నది అన్నారు. కాని లక్ష్మీధరులు మాత్రం చక్రనిర్మాణంలోనే భేదం చెప్పారు. వీరి మతానుసారం సంహారచక్రంలో బిందువు త్రికోణంలో ఉంటుంది. కాని సృష్టి చక్రంలో మాత్రం బిందువు చతుష్కోణము లేదా షట్కోణము మధ్యన ఉంటుంది. ఈ విషయం ప్రక్కన ఉన్న పటంలో చక్కగా చూపబడింది. అంతే కాకుండా లక్ష్మీధరులు శ్రీచక్రంలోని మర్మాలు ఇరవైఎనిమిదిగా చెప్పి, సంగమస్థానాలు లేకపోయినప్పటికీ, శివచక్రాలను కూడా మర్మాలుగానే గ్రహించాలి అన్నారు. ఇవన్నీ వామకేశ్వరతంత్రం, యెగినీహృదయం, కులార్ణవ తంత్రం మొదలైన గ్రంథాలకు భిన్నంగా ఉన్నాయి. ఈ రకంగా సంప్రదాయ భేదాలున్నప్పుడు గురుసంప్రదాయాన్ని మాత్రమే పాటించాలి అని ఆర్యోక్తి.

**మానవదేహము - శ్రీచక్రము** :

మానవదేహం రక్తము, చర్మము మొదలైన తొమ్మిది ధాతువులతో ఏర్పడింది. వీటిలో ఐదు ధాతువులు శక్తిమూలకాలు కాగా నాలుగు ధాతువులు శివమూలకాలు అని శ్రీచక్రాన్ని నవయోన్యాత్మకము అంటారని ఇదివరకే చెప్పబడింది. ఈ నవయోనులు నవధాతువులకు

ప్రతీకలు. మానవ శరీరంలో నవరంధ్రాలు ఉన్నాయి. శ్రీచక్రంలో నవావరణలు ఉన్నాయి. ఈ రకంగా శ్రీచక్రానికి మానవ దేహానికి అవినాభావ సంబంధం ఉంది.

**బైందవం బ్రహ్మరంధ్రంచ, మస్తకం చ త్రికోణకమ్**
**లలాటేష్టార పత్రంచ, భ్రువోర్మధ్యే దశారకమ్**
**కంఠే బహిర్దశారంచ హృదయేచతుర్దశారకమ్**
**నాభౌచ వసు పత్రంచ, కట్యాం షోడశ పత్రకమ్**
**వృత్తత్రయంచ ఊరుభ్యాం, పద్భ్యాం భూపురత్రయమ్ ॥**

మానవశరీరంలోని భాగాలు శ్రీచక్రంలోని తొమ్మిదిచక్రాలతో సమన్వయం చేయబడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | బ్రహ్మరంధ్రం | – | బిందువు |
| 2. | తలముందుభాగము | – | త్రికోణము |
| 3. | లలాటం | – | అష్టారం |
| 4. | భ్రూమధ్యం | – | అంతర్దశారం |
| 5. | కంఠం | – | బహిర్దశారం |
| 6. | హృదయం | – | చతుర్దశారం |
| 7. | నాభి | – | అష్టదళం |
| 8. | కటి | – | షోడశదళం |
| 9. | ఊరువులు | – | వృత్తాలు |
| 10. | పాదాలు | – | భూపురం |

సమయాచారులప్రకారము శ్రీచక్రము (త్రికోణంలో బిందువు)



లక్ష్మీధరుల సమయమతానుసారము శ్రీచక్రము (చతుష్కోణంలో బిందువు)



అలాగే శ్రీచక్రంలో ఉన్న తొమ్మిదిచక్రాలు మానవ దేహంలోని షట్చక్రాలతో ఐక్యము చెందుతున్నాయి. దీనినే 'నాదబిందు ఐక్యత' అంటారు. ఇక్కడ నాదము అంటే శ్రీచక్రము. బిందువు అంటే షట్చక్రాలసమూహము. ఈ ఐక్యత ఏరకంగా ఉంటుందంటే.

1. ఆధార చక్రానికి - త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి - అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి - అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి - బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధి చక్రానికి - చతుర్దశకోణంతో ఐక్యత
6. ఆజ్ఞాచక్రానికి - అష్టదళము, షోడశదళముతో ఐక్యత
7. సహస్రారానికి - చతుర్ద్వార సహితమైన భూపురంతో ఐక్యత.

ఇదే రకంగా శ్రీచక్రంలో ఉండే మూడు వృత్తాలు వరుసగా

1. స్వాధిష్ఠానానికి పై భాగంలో - రుద్రగ్రంథిరూపంలోనూ
2. అనాహతానికి పై భాగంలో - విష్ణుగ్రంథి రూపంలోనూ
3. ఆజ్ఞాచక్రానికి పై భాగంలో - బ్రహ్మగ్రంథి రూపంలోనూ

ఉంటాయి. ఈ రకంగా మానవ దేహానికీ, శ్రీచక్రానికీ ఐక్యత చెప్పబడింది.

**శ్రీచక్రము - మూలమంత్రము :**

శ్రీవిద్యకు మూలమంత్రమైన పంచదశీమహామంత్రము యొక్క యంత్రస్వరూపమే శ్రీచక్రము కాని వేరు కాదు. పంచదశీ మహామంత్రంలో ఉండే మూడు హ్రీంకారాలే శ్రీచక్రంలోని మూడు వృత్తాలు అసలు శ్రీచక్రమే పంచదశీమహామంత్రం నుంచి పుట్టింది అని భాస్కరరాయల వారు తమ **వరివస్యారహస్యము** అనే గ్రంథంలో వ్రాశారు.

***కత్రి తయాదీ కారాద్బిందుర్జాత స్తదగ్రిమేచక్రే,***
***హృల్లేఖాభి స్తత్పర చక్ర త్రితయం హకారాభ్యామ్.***
***ఏకారేణచ తత్పర చక్రేజాతే సకారాభ్యామ్,***
***చతురశ్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్రజనిః.***

1. శ్రీవిద్య యందలి మూడవ క కారము వలన,ఈ కారము వలన బిందువు పుట్టింది.
2. మూడు హ్రీంకారాల వల్ల -- త్రికోణము, వసుకోణము పుట్టినాయి.
3. రెండు హ కారములు, ఏ కారము వల్ల - అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము వృత్తత్రయము పుట్టినాయి.
4. రెండు స కారముల వల్ల --- అష్టదళము, షోడశదళము పుట్టినాయి.
5. ల కారమువల్ల --- భూపురత్రయం పుట్టింది.

ఈ విధంగా పంచదశీ మహామంత్రం నుంచే శ్రీచక్రం పుట్టింది.

**శ్రీ చక్రము - గణేశాదిరూపాలు :**

శ్రీచక్రానికి 1) గణేశ రూపము, 2) యోగినీ రూపము, 3) నవగ్రహ రూపము, 4) రాశి స్వరూపము, 5) నక్షత్ర రూపము కూడా వరివస్యారహస్యంలో చెప్పబడ్డాయి.

**1. గణేశ రూపము :**

***రేఖాదళ కోణగణై ర్ఘటనాచక్రే గణేశత్వమ్***

శ్రీచక్రంలో భూపురంలోని రేఖలు, అష్టదళము, షోడశదళమునందలి దళములు త్రికోణము మొదలు చతుర్దశారము వరకు ఉన్న కోణములు మొదలైనవన్నీ గణాలుగా చెప్పబడ్డాయి. ఈ గణాలన్నీ సమూహంగా ఉండటంచేత శ్రీచక్రానికి గణేశత్వం లభించింది.

**2. యోగినీరూపము :**

***స్థితిసంహృతి చక్రేద్వే, పద్మేద్వే, వృత్తభూగృహేచద్వే,***
***ఏవం షడ్భిర్యోగాత్ శ్రీచక్రం, యోగినీరూపమ్.***

శ్రీచక్రాన్ని సృష్టిచక్రము, స్థితిచక్రము, సంహృతిచక్రము అని మూడుభాగాలుగా విభజించవచ్చు. అవి.

1. అష్టదళము, షోడశదళము, భూపురము - సృష్టి చక్రము
2. అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము - స్థితి చక్రము
3. బిందువు, త్రికోణము, అష్టకోణాలు - సంహృతి చక్రము.

వీటిలో స్థితిచక్రము, సంహారచక్రము, అష్టదళము, షోడశదళము, షోడశదళము చివరనున్న వృత్తము, భూపురము మొత్తం సంఖ్య ఆరు. ఇది షట్చక్రాలకు అధిదేవతలైన ఢాకిని, రాకిని, లాకిని, కాకిని, సాకిని, హాకిని, అను యోగినుల సంఖ్య ఆరుకు సమానము. కాబట్టి శ్రీచక్రానికి యోగినీరూపం వచ్చింది.

**3. నవగ్రహరూపము :**

***త్రైలోక్యమోహనాద్యై ర్నవభిశ్చక్రైర్గ్రహత్వంచ ॥***

శ్రీచక్రంలో శివచక్రాలు నాలుగు, శక్తిచక్రాలు ఐదు. మొత్తం తొమ్మిది చక్రాలున్నాయి. గ్రహాలు తొమ్మిది. కాబట్టి శ్రీచక్రానికి నవగ్రహత్వం ఏర్పడింది.

**4. రాశిస్వరూపము :**

***పంచచతుశ్శక్త్యనలాబిందుః వృత్తంచ భూబింబమ్ ।***
***ఏవం ద్వాదశ సంఖ్యై ర్ఘటనాచ్చక్రస్యరాశిత్వమ్ ॥***

శ్రీచక్రంలో పై వైపు కోణాలు ఐదు. క్రింది వైపు కోణాలు నాలుగు వృత్తత్రయం ఒకటి, భూపురము, బిందువు. మొత్తం సంఖ్యపన్నెండు. రాశులు పన్నెండు, కాబట్టి శ్రీచక్రానికి రాశి స్వరూపం వచ్చింది.

**5. నక్షత్రరూపము :**

***వృత్తత్రయధరణీత్రయ మన్వశ్రాణాం విదజ్యగణనేన ।***
***సప్తభిరితరైశ్చక్రై శ్చక్రేనక్షత్ర రూపత్వమ్ ॥***

శ్రీచక్రంలో వృత్తాలు మూడు. భూపుర రేఖలు మూడు, చతుర్దశారంలోకోణాలు పధ్నాలుగు. బిందువు, త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, అష్టదళము, షోడశదళము, మొత్తం సంఖ్య ఇరవై ఏడు. నక్షత్రాల సంఖ్య ఇరవై ఏడు కాబట్టి శ్రీచక్రానికి నక్షత్ర స్వరూపం చెప్పబడింది.

**రుద్రయామళం**లో శ్రీచక్రాన్ని గురించి ఈవిధంగా చెప్పబడింది.

పృశ్నయో నామ మునయః సర్వే చక్ర సమాశ్రయాః
సేవమానా శ్చక్రవిద్యాం దేవగంధర్వ పూజితామ్ ॥

***అగ్నీష్టోమాత్మకం చక్ర మగ్నీష్టోమ మయం జగత్।***
***అగ్నా వంతర్బభౌ భానుః అగ్నీ ష్టోమమయం స్మృతమ్ ॥***

***త్రిఖండం మాతృకా చక్రం, సోమసూర్యానలాత్మకమ్ ।***
***త్రికోణం బైందవం సౌమ్య మష్టకోణంచ మిశ్రకమ్ ॥***

***చక్రం చంద్రమయం చైవ దశార ద్వితయం తథా ।***
***చతుర్దశారం వహ్నేస్తు చతుశ్చక్రంచ భానుమత్ ॥***

***ఏతత్ప్రసాదా దింద్రాద్య వసవోఽష్టో మరుద్గణాః ।***
***యే యే సమృద్ధా లోకేఽస్మిన్ త్రిపురా చక్రసేవకాః ॥***
***పురత్రయంచ చక్రస్య సోమసూర్యానలాత్మకమ్***
***మహాలక్ష్మ్యాః పురం చక్రం తత్రైవాస్తే సదాశివః ॥***

పృశ్నులను మునులందరూ శ్రీచక్రము నాశ్రయించినారు. దేవగంధర్వులు పూజించు శ్రీచక్రవిద్యను సేవించి ఉన్నారు.

శ్రీచక్రము అగ్నిష్టోమాత్మకమైనది. ఎందుకంటే జగత్తు అంతాకూడా అగ్నిమయమే. అగ్నియందు లోపల సూర్యుడు ప్రకాశించుచున్నాడు. మాతృకా చక్రమనబడు శ్రీచక్రము సోమసూర్యఅనలాత్మకమై మూడు ఖండములుగా ఉన్నది. బైందవ స్థానము, త్రికోణము, అష్టకోణము అను ఈ భాగములు చంద్రమయములు. దశారయుగ్మము, చతుర్దశారము, అగ్నిమయములు. మిగిలిన అష్టదళము, షోడశదళము, భూపురములు భానుమయములు.

శ్రీచక్రప్రసాదము వలన ఇంద్రుడు మొదలగు దేవతలు, అష్టవసువులు, మరుద్గణములు వెలయుచున్నారు. ఎవరెవరు లోకమందు సంపదలతో తులతూగుచున్నారో వారందరూ శ్రీచక్ర సేవకులే. శ్రీచక్రము మహాలక్ష్మీపురము. ఇందే సదాశివుడున్నాడు.

శ్రీచక్రంలో మొత్తం తొమ్మిది ఆవరణలు ఉన్నాయి. ఈ తొమ్మిది ఆవరణలలోనూ విడివిడిగా ఆవరణ దేవతలున్నారు. తొమ్మిదవ ఆవరణే బిందువు. దీనిని సర్వానందమయ చక్రము అంటారు. ఇదే శివాశివుల క్రీడా ప్రదేశం.

ఈ తొమ్మిది ఆవరణల గురించి రత్నాయర్షి తన "ఆవరణదేవతాస్తుతి"లో వివరించారు. ఆ వివరణ కోసం నేను వ్రాసిన **శ్రీవిద్యాదర్శనము**లో నవావరణపూజ చూడండి.

**శ్రీచక్రపూజ :** ఇంతకీ శ్రీచక్రాన్ని ఏరకంగా పూజించాలి. ఏ రకమైన శ్రీచక్రాన్ని పూజించాలనేది **రుద్రయామళం**లో ఈ విధంగా చెప్పబడింది.

***తతః కుంకుమ సింధూరైః కార్యంయత్నంతు యోగినా!***
***సౌవర్ణే రాజతే తామ్రే స్ఫాటికే వైద్రుమే తథా !!***
***చక్రే చోక్త విధానేన పూజ్యా దేవీ వరోత్తమైః***

కుంకుమ, సింధూరాలతో నేలమీద గీసిన శ్రీచక్రాన్ని పూజిస్తే కార్యసిద్ధి కలుగుతుంది. వెండి, బంగారము, రాగి, స్ఫటిక చక్రాలనుకూడా పూజించవచ్చు. **తంత్రరాజం** లో

***రత్న హేమని రూప్యే వా తామ్రే దృషది చక్రమాత్ ।***
***కృత్వా చక్రస్య నిర్మాణం స్థాపయేత్ పూజయేదపి ॥***
***లక్ష్మీ కాంతి యశః పుత్ర ధనారోగ్యాది సిద్ధయే ॥***

బంగారము, వెండి, రాగి, గండకీశిల (సాలగ్రామశిల)తో చేసిన శ్రీచక్రాన్ని అర్చించినట్లైతే పుత్ర, ధన, ధాన్యాభి వృద్ధి కలుగుతుంది. అని చెప్పబడింది. **రత్నసాగరంలో**

***యావజ్జీవం సువర్ణే స్యా ద్రూప్యే ద్వావింశతిః ప్రియే ।***
***తామ్రే ద్వాదశకం వర్షమ్, తదర్ధం భూర్జపత్రకే ॥***

బంగారంతో చేసిన శ్రీచక్రాన్ని జీవితాంతం పూజించవచ్చు. వెండితో చేసిన దాన్ని ఇరవైరెండు సంవత్సరాలు, రాగితో చేసిన దాన్ని పన్నెండు సంవత్సరాలు, భూర్జరీపత్రం మీద వ్రాసిన దాన్ని ఆరు సంవత్సరములు పూజచేయవచ్చు. **లక్షసాగరం** లో ఈ విధంగా చెప్పబడింది.

***భూమౌ సింధూరరజసా రచితం సర్వకామదమ్ !***
***సువర్ణ రచితం యంత్రం సర్వ రాజవశంకరమ్ ॥***
***రజితేన కృతం యంత్రమాయురారోగ్య కామదమ్ !***
***తామ్రేతు రచితం యంత్రం సర్వైశ్వర్య ప్రదమ్ మతమ్ ॥***
***క్లుప్తం మరకతే యంత్రం సర్వశత్రు వినాశనమ్ ।***
***లోహత్ర యోద్భవం యంత్రం సర్వసిద్ధికరమ్ మతమ్ ॥***

నేలమీద సింధూరంతో శ్రీచక్రాన్ని గీసి పూజించినట్లైతే సర్వకార్యసిద్ధి కలుగుతుంది. బంగారంతో చేసిన శ్రీచక్రాన్ని పూజిస్తే రాజవశ్యము, వెండిదైతే ఆయురారోగ్య ఐశ్వర్యములు, మరకతంతో చేసిన చక్రాన్ని పూజిస్తే శత్రునాశనము, మూడు లోహములతో చేసిన యంత్రాన్ని పూజిస్తే సర్వకార్య సిద్ధి కలుగుతుంది.

శ్రీచక్ర పూజాఫలాన్ని తంత్రశాస్త్రాల్లో అనేకరకాలుగా చెప్పారు. శ్రీచక్ర పూజ చేస్తూ పంచదశీ మహామంత్రాన్ని

1. పచ్చకర్పూరంతో హోమం చేస్తే - వాగ్వశ్యము
2. ఎఱ్ఱకలువలతో హోమం చేస్తే - రాజవశ్యము
3. దాసాని పూలు, నేయితో హోమం చేస్తే - సర్వజన వశ్యము
4, ద్రాక్షపండ్లతో హోమం చేస్తే - అష్టసిద్ధులు
5. నువ్వులు, బియ్యంతో హోమం చేస్తే - సర్వోపద్రవాలు శాంతిస్తాయి.

ఈ రకంగా తంత్రశాస్త్రాలలో చాలా విషయాలు చెప్పబడ్డాయి. కాని అవి దుర్వినియోగమవుతాయనే భయంతో ఇక్కడ రాయటం లేదు. సాధకులు తమశక్తిని ఇతరులకు హానికలిగించటానికి కాకుండా పరోపకారానికి లోకకల్యాణానికి మాత్రమే ఉపయోగించటం శ్రేయస్కరమని గుర్తించాలి. శ్రీచక్రాన్ని గురించిన మర్నిన్ని వివరాలకు నాచేవ్రాయబడిన **“శ్రీవిద్యా మహాయంత్రము”** చూడండి.

## తంత్రములు

***చతుష్షష్టి స్తంత్రాణ్యపి కులమతం నిందితమభూ***
***ద్యదేతన్మిశ్రాఖ్యం మతమపిభ వే న్నిందితమిహ***
***శుభాభ్యాః పంచైతాః శ్రుతినరణిసిద్ధాః ప్రకృతయో***
***మహావిద్యాస్తాసాం భవతి పరమార్థో భగవతీ ॥*** ***18***

శాక్తేయంలో కౌళాచారులకు అరవైనాలుగు, మిశ్రమాచారులకు ఎనిమిది తంత్రాలున్నాయి. సమయాచారులకు మాత్రం “శుభాగమ పంచకము” ప్రామాణికము. శంకర భగవత్పాదులవారు **సౌందర్యలహరిలో** చతుష్షష్టితంత్రాలను గురించి ఈ విధంగా చెప్పారు.

***చతుష్షష్ట్యా తంత్రైః సకలమతిసంధాయ భువనం***
***స్థిత స్తత్సిద్ధి ప్రసవపరతంత్రైః పశుపతిః***
***పునస్త్వన్నిర్బంధాదఖిలపురుషార్థైకఘటనా***
***స్వతంత్రం తే తంత్రం క్షితితలమవాతీతరదిదమ్ ॥***

‘దేవా నీవు చెప్పిన అరవైనాలుగు తంత్రాలద్వారా నాభక్తులు అజ్ఞానంలో కూరుకుపోతున్నారు. వారిని ఉద్ధరించటానికి ఏదైనా ఇంకొక మార్గం చూపవలసినది. అని పార్వతీదేవి శివుణ్ణి కోరగా పరమశివుడు కరుణించి **శ్రీవిద్యాతంత్రము** అనే కొత్త తంత్రాన్ని చెప్పాడు.

ఈ శ్లోకాన్ని బట్టి లోకంలో కామ్యవాదులు, మోక్షవాదులు అని రెండు రకాలు వారున్నారు. ఆచార వ్యవహారాలనుబట్టి, వీరిని మూడురకాలుగా విభజించవచ్చు.

1. కౌళాచారులు 2. మిశ్రమచారులు 3. సమయాచారులు

సగుణబ్రహ్మను గురించి చెప్పే తంత్రశాస్త్రాలను ఆగమాలు అంటారు. వీటినే సమిష్టిగా మంత్ర శాస్త్రం అంటారు. ఆగమాలు మూడు రకాలు అవి : 1) వైష్ణవ ఆగమాలు, 2) శైవ ఆగమాలు, 3) శక్తి ఆగమాలు. శక్తిని జగన్మాతగా వివరించే ఆగమాలను శక్త్యాగమాలు అంటారు. వీటిలో

1. సాత్విక ఆగమాలను - తంత్రాలని
2. రాజసాలను - యామళాలు అని
3. తామసాలను - డామరాలు అని అంటారు.

**1) కౌళాచారులు :** వీరు చతుర్విధపురుషార్థాలలో అర్ధకామాలకే ప్రాధాన్యతనిస్తారు. వీరికి బాహ్యాపూజయేకాని అంతఃపూజ లేదు. వీరు ఆధారచక్రంలో దేవిని పూజిస్తారు. కౌళాగమాలుగా పిలువబడే అరవై నాలుగు ఆగమాలు, వీరికి ప్రామాణికాలు. ఈ అరవైనాలుగు ఆగమాలు దేవీపూజకు ఉత్తమమైనవి అని చతుశ్శతిలో చెప్పబడింది.

*చతుష్షష్టిశ్చ తంత్రాణి మాతౄణా ముత్తమానిచ ।*
*మహామాయా శంబరం చ యోగినీ జాల శంబరమ్ ॥*

*తత్త్వ శంబరకంచైవ భైరవాష్టక మేవ చ ।*
*బహురూపాష్టకం చైవ యమళాష్టక మేవ చ ॥*

*చంద్రజ్ఞానం మాలినీం చ మహాసమ్మోహనం తథా ।*
*వామజుష్టం మహాదేవం వాతులం వాతులోత్తమమ్ ॥*

*హృద్భేదం తంత్రభేదంచ గుహ్యతంత్రంచ కామికమ్ ।*
*కలవాదం కలాసారం తథాన్యత్ కుండికామతమ్ ॥*

*మతోత్తరంచ వీణాఖ్యం త్రోతలం త్రోతలోత్తకమ్ ।*
*పంచామృతం రూపభేదం భూతోడ్డామర మేవచ ॥*

*కులసారం కులోడ్డీశం కుల చూడామణి స్తథా ।*
*సర్వజ్ఞానోత్తరం చైవ మహాకాళీమతం తథా ॥*

అరుణేశం మోదినీశం వికుంతేశ్వర మేవచ ।
పూర్వ పశ్చిమ దక్షంచ ఉత్తరంచ నిరుత్తరమ్ ।
విమలం విమలోత్థంచ దేవీమత మతఃపరమ్ ॥

ఈ రకంగా అరవైనాలుగు తంత్రాలు పార్వతీదేవిని గూర్చి చెప్పబడ్డాయి.. ఇవన్నీ అవైదికములు, నీతి బాహ్యములు. ఇవి లోకంలో మహాజ్ఞానులైన విద్వాంసులను కూడా వంచించి భ్రష్టులను చేస్తాయి. ఆ తంత్రములు వివరణ :

**1. మహామాయాశాంబరము :** మాయా ప్రపంచాన్ని నిర్మింపచేసే తంత్రము. అనగా ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు కనిపిస్తుంది.

**2. యోగినీజాలశాంబరము :** ఇదికూడా మాయాప్రధానమైన విద్యయే.

**3. తత్త్వశాంబరము :** ఇది ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలకు సంబంధించినది.

**4-11 భైరవాష్టకము :** ఇవి మొత్తం ఎనిమిది తంత్రాలు.

1) సిద్ధ భైరవ
2) వటుక భైరవ
3) కాల భైరవ
4) కాలాగ్ని భైరవ
5) కంకాళ భైరవ
6) యోగినీ భైరవ
7) మహా భైరవ
8) శక్తి భైరవ

ఇవన్నీ కూడా నిధి నిక్షేపాలను కనుగొనటానికి ఉపయోగిస్తాయి.

**12-19 బహు రూపాష్టకము :** ఇవి ఎనిమిది రూపములు గల శక్తి తంత్రములు. అవైదికములు. ఆశక్తులు వరుసగా,

1) బ్రాహ్మీ
2) మహేశ్వరి
3) కౌమారి
4) వైష్ణవి
5) వారాహి
6) మాహేంద్రీ
7) చాముండ
8) మహాలక్ష్మీ

**20-27 యమళాష్టకము :**

కామసిద్ధాంబకు యామళ అని పేరు. కామసిద్ధాంబ ప్రతిపాదితమైన తంత్రాలకు యామళాష్టకమని పేరు. ఇవి వైదిక మార్గ దూరములు. భైరవ యామళము, రుద్రయామళము మొదలైనవి ఇందు చెప్పబడ్డాయి.

**28. చంద్రజ్ఞానము :** ఇది కాపాలిక మతసంబంధమైనది. సమయాచార సంబంధమైన చంద్రజ్ఞాన విద్యకాదు.

**29. మాలినీ తంత్రము :** దీనిని మాలినీవిద్యా తంత్రము అనికూడా అంటారు. సముద్రయానమునకు ఉపయోగిస్తుంది.

**30. మహాసమ్మోహనము :** మేల్కొన్న వారిని నిద్రపోయినట్లుగా మైకంలో ముంచెత్తగలదు. 14 సంవత్సరాల బాలుని నాలుకను కోసి ఈ విద్య సాధించాలి. పూర్తిగా అవైదికము.

**31, 32. వామజుష్ట, మహాదేవ తంత్రములు :** ఇవి వామాచారానికి సంబంధించినవి.

**33, 34, 35 :- వాతుల, వాతులోత్తర, కామికా తంత్రములు :** వీటిలో ఆకర్షణ మొదలైన ప్రక్రియలున్నాయి. ఇవి కొంత భాగము వైదికము, తక్కినది అవైదికము.

**36. హృద్భేద తంత్రము :** దీనిలో షట్చక్రభేదనము, సహస్రార ప్రదేశము చెప్పబడినవి. ఇది వామాచారపద్ధతిలో ఉన్నది.

**37, 38. తంత్రభేదము, సహ్య తంత్రము :** వీటిలో మారణ విద్యలు చెప్పబడినవి.

**39. కలావాద తంత్రము :** ఇందులో చంద్రకళల ప్రతిపాదన చెప్పబడింది. అయినను, పరదారాగమనాదులను ఉపదేశించినదగుటచే నిషిద్ధము.

**40. కళాసార తంత్రము :** దీనిలో వర్ణముల ఆధిక్యత గురించి చెప్పబడినది వామాచార ప్రవృత్తికము.

**41. కుండికామతము :** ఇది ఘటికా సిద్ధి హేతువైనది. ఘటిక అంటే పానపాత్ర.

**42. మతోత్తరము :** దీనిలో రససిద్ధి చెప్పబడింది.

**43. వీణాఖ్య తంత్రము :** వీణ అనేది ఒక యక్షిణి పేరు. అది సిద్ధిస్తుంది కాబట్టి దీనిని వీణాఖ్య తంత్రము అంటారు. దీన్ని సంభోగ యక్షిణి అని కూడా అంటారు.

**44. త్రోతల తంత్రము :** దీనిలో ఘటిక (పానపాత్ర) సిద్ధి, అంజన సిద్ధి, పాదుకా సిద్ధి చెప్పబడ్డాయి.

**45. త్రోతలోత్తరము :** అరవైనాలుగు వేల మంది యోగినుల దర్శనము చేయించునది.

**46. పంచామృత తంత్రం :** అమృతము, మృత్యులేమి గురించి చెప్పబడినది.

**47-51. రూపభేదము, భూతోడ్డారము, కులాసారము, కలోడ్డీశము, కుల చూడామణి :** ఈ ఐదు తంత్రములు మారణ హేతువులు.

**52-56. సర్వజ్ఞానోత్తరము, మహాకాళిమతము, అరుణేశము, మోదినీశము, నికుంతేశ్వరము :** ఇవి కాపాలిక, దిగంబర మతాలకు చెందినవి.

**57-64. పూర్వ, పశ్చిమ, దక్షిణ, ఉత్తర, నిరుత్తర, విమలము, విమలోత్థము, దేవీ మతము :** ఇవి దిగంబర, క్షపణిక మతాలకు చెందినవి.

ఈ తంత్రాలన్ని కూడా ఐహికఫలాన్నే ఇస్తాయి. అవైదికములు, నీతి బాహ్యములు. కాబట్టి ఇవి పనికి రావు.

**2. మిశ్రమాచారులు :** కౌళ, సమయాచారాలను కలిపి ఆచరిస్తుంటారు. వీరికి

| | |
|---|---|
| 1) చంద్రకళ | 5) కులేశ్వరి |
| 2) జ్యోత్స్నవతి | 6) భువనేశ్వరి |
| 3) కళానిధి | 7) బార్హస్పత్య |
| 4) కులార్ణవ | 8) దూర్వాస తంత్రాలు ప్రామాణికాలు |

వీటిలో ధర్మ కర్మ ఉపాసనల వివరణ, కుండలినీ శక్తి, సాధనలు చెప్పబడ్డాయి. నాలుగు వర్ణముల వారికీ వీటిని సాధించటానికి అధికారం ఉంది. కాని మొదటి మూడు వర్ణాలవారు సవ్య మార్గంలోనే సాధించాలి. ఈ తంత్రాలు మిశ్రమాచారానికి చెందినవి. కాబట్టి వాటిని వదలి వేయాలి.

చంద్రకళాష్టకము కౌళ, సమయ మతాలు రెండిటినీ అనుసరించటం వలన, దాన్ని మిశ్రకము అన్నారు. "మిశ్రకం కౌళమార్గంచ పరిత్యాజ్యంచ శాంకరీ' అనే ఈశ్వర వచనము వల్ల మిశ్రమమతం కూడా కౌళ మతంగానే పరిగణించి వదలి వెయ్యాలి. ఈ రకంగా డైబ్బైరెండు తంత్రాలనూ వదలి వెయ్యాలి.

**3. సమయాచారులు :** వీరికి ప్రధానమైనది కైవల్యప్రాప్తి, **శుభాగమపంచకము** అనే ఐదు సంహితలలో, వైదిక మార్గంలో అనుష్ఠానకలాపము చెప్పబడింది. ఈ మార్గాన్ని వసిష్ఠ, సనక సనందన సనత్కుమార, శుక మహర్షులు చక్కగా వివరించారు. అదే సమయాచారము. గౌడపాదాచార్యులవారు, శంకరభగవత్పాదులవారు నిర్దేశించినది ఈ మార్గమే.

వైదికులు శుభాగమపంచకము చెప్పిన సమయమార్గాన్నే పాటించాలి. ఆచారాల మీద మరిన్ని వివరాలకు నేను వ్రాసిన **శ్రీవిద్యాదర్శనము**లో చూడండి.

## పంచదశీ మహామంత్రము

***స్మరో మారో మారః స్మర ఇతి వరో మార మదనః***
***స్మరానంగశ్చేతి స్మరమదన మారాః స్మర ఇతి!***
***త్రిఖండః ఖండాంతే కలిత భువనేశ్యక్షరయుత***
***శ్చతుః పంచార్ణాస్తే త్రయ ఇతి చ పంచాక్షరమనుః !!*** ***19***

గౌడ పాదాచార్యుల వారు ఈశ్లోకంలో పంచదశీమహామంత్రాన్ని వివరించారు. ఇది పదిహేను అక్షరాల మంత్రం.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | స్మర | - క కారబీజము | 7. | మదన | - క కారము |
| 2. | మారో | - ఏ కారము | 8,9. | స్మరానంగములు | - హ, ల కారములు |
| 3. | మారః | - ఈ కారము | | | |
| 4. | స్మర | - ల కారము | 10. | స్మరమదనము | - స కారము |
| 5. | పర | - హ కారము | 11. | మార | - క కారము |
| 6. | మార | - స కారము | 12. | స్మర | - ల కారము |

ఈ బీజాక్షరములను మూడుఖండములుగా చేసి, ఆఖండాంతములందు భువనేశ్వరీ బీజము అనగా హృల్లేఖ (హ్రీంకారము) లను చేర్చినట్లైతే పంచదశాక్షరీ మహామంత్రం అవుతుంది.

**మంత్రం :** క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీ ం। స క ల హ్రీం।

ఈ మంత్రాన్ని **సౌందర్యలహరి**లో శంకరభగవత్పాదులవారు ఈ విధంగా చెప్పారు.

***శివ శ్శక్తిః కామః క్షితి రథ శ్శీతకిరణః***
***స్మరో హంస శ్శక్ర స్తదనుచ పరా మార హరయః***
***హ్యమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః***
***భజన్తే వర్ణాస్తే తవ జనని నామావయవతామ్.***

శ్రీవిద్యలో ప్రసిద్ధమైనది పంచదశీమహామంత్రము. ఇది శాక్తేయానికి గాయత్రి వంటిది. గాయత్రీమంత్రం బ్రాహ్మణుల కోసం ఏర్పడగా, పంచదశీ మహామంత్రం

చతుర్వర్ణాల వారికి ఉపాస్య అని అగస్త్య మహర్షి వ్రాసిన **శ్రీవిద్యాదీపికలో** చెప్పబడింది. పంచదశీమహామంత్రం మాయను పోగొట్టి పరబ్రహ్మను ప్రకాశింపచేస్తుంది.

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మథుడు, అగస్త్యుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, శివుడు, విష్ణువు, దూర్వాసుడు, బలరాముడు, దత్తాత్రేయుడు మొదలైన అనేకమంది ఈ మంత్రం జపించి తరించారు అని **మానసోల్లాసము, జ్ఞానార్ణవములలో** చెప్పబడింది.

అయితే పంచదశీమహామంత్రాన్ని దర్శించి ఈ లోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అతడే ఈ మంత్రానికి ఋషి అని కొందరి వాదము. కాగా దక్షిణామూర్తి మూలపురుషుడు అని కొందరంటారు.

సంస్కృతభాషకు గల అక్షరాలలో అ నుంచి అః వరకు అచ్చులు, క నుంచి క్ష వరకు హల్లులు అచ్చులు శక్తిరూపాలు, హల్లులు శివరూపాలు. ఈ విషయాన్ని **మాతృకాహృదయం** అనే గ్రంథంలో వివరించటం జరిగింది.

***కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః ।***
***సమస్త వ్యస్తరూపేణ షట్ త్రింశత్ తత్త్వ విగ్రహాః ॥***
***అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః ।***
***నిత్యాషోడశ కాత్మనః పరస్పర మమీయుతాః ॥***
***శివశక్తి మయావర్ణా శబ్దార్థ ప్రతిపాదకాః ।***
***శివః స్వర పరాధీనో న స్వతంత్రః పదాప్యసౌః ॥***
***స్వరాః స్వతంత్రా జాయంతే న శివస్తు కదాచన॥ "***

అక్షరాలను మొత్తం మూడుభాగాలుగా చేసి, అంటే

1. అ నుంచి అః వరకు 16 అక్షరాలు – మొదటి భాగము.
2. క నుంచి త వరకు 16 అక్షరాలు – రెండవ భాగం
3. థ నుంచి స వరకు 16 అక్షరాలు – మూడవ భాగము

ఈ రకంగా మూడుభాగాలుగా చేసి వాటిలో సత్వ, రజస్, తమో గుణాల, త్రిమూర్తుల, చంద్రసూర్యాగ్నుల, జాగ్రత్ స్వప్న సుషుప్తి అనబడే మూడు అవస్థల తత్త్వాలు

చేర్చబడ్డాయి. వీటిలో నిత్యలను కూడా చేర్చటం జరిగింది. నిత్యలు మొత్తం పదహారు. ఈ షోడశనిత్యలను వసిష్ఠసంహితలో శివుడు పార్వతికి వివరించాడు.

*శృణుదేవి ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ ।*
*న కస్య చిన్మయాऽऽఖ్యాతం సర్వతంత్రేషు గోపితమ్ ॥*

*తత్రాదౌ ప్రథమానిత్యా మహాత్రిపురసుందరీ ।*
*తతః కామేశ్వరీ నిత్యా నిత్యాచ భగమాలినీ ॥*

*నిత్య క్లిన్నా తథాచైవ భేరుండా వహ్ని వాసినీ ।*
*మహావిద్యేశ్వరీ రౌద్రీ, త్వరితా కులసుందరీ ॥*

*నిత్యా నీలపతాకాచ విజయా సర్వమంగళ ।*
*జ్వాలామాలిని చిద్రూపాః ఏతానిత్యాస్తు షోడశ ॥*

*ప్రతిపత్ప్రభృతౌ దేవ్యాః పౌర్ణమాస్యంతమర్చయేత్ ।*
*ఏకాదివృద్ధ్యా హాన్యాచ దర్శాంతం దేవి విగ్రహమ్॥*

ఈ నిత్యలు వరుసగా

| | | |
|---|---|---|
| 1. కామేశ్వరి | 7. రౌద్రీ (శివదూతి) | 13. సర్వమంగళ |
| 2. భగమాలిని | 8. త్వరిత | 14. జ్వాలామాలిని |
| 3. నిత్యక్లిన్న | 9. కులసుందరి | 15. చిత్ర |
| 4. భేరుండ | 10. నిత్యా | 16. మహాత్రిపురసుందరి. |
| 5. వహ్నివాసిని | 11. నీలపతాక | |
| 6. మహావిద్యేశ్వరి | 12. విజయ | |

ఈ నిత్యలస్వరూపాలను ప్రక్క పేజీలలో చూపటం జరిగింది.

ఈ షోడశనిత్యలు శుక్లపక్షపాడ్యమి మొదలు పౌర్ణమి వరకు తిథుల రూపమున, కృష్ణపక్ష పాడ్యమి మొదలు అమావాస్య వరకు తిథుల రూపమున ఉన్నారు. వీరినే చంద్రకళలు అని అంటారు. చంద్రకళలే పాడ్యమి మొదలైన తిథులని జ్యోతిశ్శాస్త్రంలో చెప్పబడింది.

*'ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమా కలా ।*
*ద్వితీయాద్యా ద్వితీయాద్యాః పక్షయో శ్శుక్ల కృష్ణయోః॥'*

పాడ్యమి నుండి పౌర్ణమి వరకు పదిహేను తిథులు.

“దర్శాద్యాః పూర్ణిమాం తాశ్చ కలాః పంచ దశైవ తు
షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ”

అమావాస్య మొదలు పూర్ణిమ వరకు గల కళలు పదిహేను. పదహారవవ కళ షోడశి సచ్చిదానంద స్వరూపిణి అయి ఉన్నది. ఇదే సాదాఖ్యకళ. నాదబిందు కళాతీత మయినది. ఈ రకంగా పదహారు తిథులను, పదహారు కళలను.

1. ప్రకటయోగిని
2. గుప్తయోగిని
3. గుప్తతరయోగిని
4. సంప్రదాయయోగిని
5. కుళోత్తీర్ణయోగిని
6. నిగర్భయోగిని
7. రహస్యయోగిని
8. అతిరహస్య యోగిని
9. పరాపరరహస్య యోగిని

అనబడే తొమ్మిది మంది యోగినులను అందులో అంతర్భావం చేసి, ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క హ్రీంకారాన్ని ఏర్పాటు చేశాడు. హ్రీంకారము అనేది ప్రాణశక్తి. అది లేకపోయినట్లైతే మంత్రము నిర్వీర్యమవుతుంది.

1. దర్శ
2. దృష్ట
3. దర్శత
4. విశ్వరూప
5. సుదర్శన
6. ఆప్యాయమాన
7. ఆప్యాయమాన
8. ఆప్యాయ,
9. సూనృత
10. ఇర
11. అపూర్వమణా
12. అపూర్వమణా
13. పూరయంతి
14. పూర్ణ
15. పూర్ణమాసి

అనబడే చంద్రకళలు, త్రిపురసుందరి మొదలైన నిత్యలే అధిదేవతలు షోడశీకళ సాదాఖ్యకళ. తానే సర్వస్వమునకు అధిదేవత. ఈ కళలన్నీ మూడుఖండాలుగా చేయబడ్డాయి.

1) శివ, శక్తి, మాయ, శుద్ధవిద్య, జలము అనే ఐదుతత్త్వాలకు సంబంధించిన మొదటి ఐదు కళలు గల ప్రథమఖండాన్ని ఆగ్నేయఖండం అంటారు. దీనికి అధిదేవత అగ్ని.

2) తేజస్సు, వాయువు, మనస్సు, పృథివి,ఆకాశము అను ఐదు తత్త్వాలకు సంబంధించిన ఆరు నుంచి పది వరకు గల కళలు సౌరఖండము. దీనికి అధిదేవత సూర్యుడు.

3) విద్య, మహేశ్వరి, పర, ఆత్మ, సదాశివ అను ఐదు తత్త్వాలకు సంబంధించిన చివరి ఐదుకళలు సౌమ్యఖండము. దీనికి అధిదేవత సోముడు.



## 1. శ్రీ కామేశీ ధ్యానము

**పాశేక్షుచాపౌ మధుపూర్ణపాత్రం**
**మహాంకుశం పుష్పశరం వరం చ ।**
**కరై ర్దధానా మరుణాం త్రిణేత్రాం**
**కామేశ్వరీం నిత్య మహం భజామి ॥**

కుడివైపున క్రింది నుండి పైకి నిండైన మధుపాత్రమును 1) మహాంకుశమును 2) పుష్పశరమును 3) అట్లే ఎడమవైపున వరదమును 1) పాశమును 2) చెఱకు వింటిని 3) వరుసన ఆరుచేతులతో ధరించి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో, మూడునేత్రములతో, నున్న శ్రీకామేశ్వరిని నేను నిత్యము భజింతును. (రక్తవర్ణము)



## 2. శ్రీ భగమాలా ధ్యానము

*కల్హా రపంకజసపాశసృణీక్షుచాపం*

*పుష్పాయుధం చ దధతీం నిజబాహుషట్కైః ॥*

*బంధూకపుష్పరుచిరా మతిసుందరాంగీ*

*మంబాం భజామి హృదయే భగమాలినీం తామ్ ॥*

కుడివైపున క్రిందనుండి పైకి పుష్పబాణమును 1) పద్మమును 2) పాశమును 3) అట్లే ఎడమవైపున చెఱకువింటిని 1) ఎఱ్ఱకలువపూవును 2) అంకుశమును, 3) ఆరుచేతులతో ధరించి ప్రత్తిపువ్వవంటి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో సౌందర్యరాశియగు భగమాలినీ మాతృదేవిని నా హృదయమునందుభజింతును. (ప్రత్తిపువ్వవర్ణము)



## 3. శ్రీ నిత్యక్లిన్నా ధ్యానము

*ఉద్యత్సూర్యారుణ కిరణనిభాంత్రీక్షణా మిందుఖండా*
*పీడాం కాంచీవరమణివిలసద్భూషణాలంకృతాంగీమ్ ।*
*దోర్భిః పాశం సృణివర మభయం పానపాత్రం దధానాం*
*నిత్యక్లిన్నా మహ మనుదివసం మానసే భావయామి ॥*

శ్రీ నిత్యక్లిన్న ఉదయించుచున్న సూర్యుని ఎఱ్ఱని కిరణములవంటి శరీరకాంతులతో, మూడు కన్నులతో, చంద్రకళాలంకృతమైన కిరీటముతో, బంగరు మొలనూలునందు పొదగబడిన రత్నములకాంతులతో, వివిధ భూషణములతో నలంకరింపబడిన సర్వాంగములతో నుండును. తన నాల్గుచేతులయందు కుడి వైపున క్రింది నుండి పైకి వరుసన అభయమును 1) అంకుశమును 2) అట్లే ఎడమవైపున పానపాత్రమును 1) పాశమును 2) ధరించియున్న శ్రీ నిత్యక్లిన్నా దేవిని నేను దినదినమునందు మానసమున భావింతును.

(రక్తవర్ణము)



## 4. శ్రీ భేరుండా ధ్యానము

*ముక్తాకుందేందుగౌరాం మణిమయమకుటాం రత్నతాటంకయుక్తా*
*మక్షస్రక్పుష్పహస్తా మభయవరకరాం చంద్రచూడాం త్రిణేత్రామ్ !*
*గుంజామాలా విరాజత్కుచభరనమనో న్మధ్యమామబ్జసంస్థాం*
*నానాలంకారయుక్తాం సురమకుటమణి ద్యోతిత స్వర్ణపీఠామ్ ।*
*భక్తాభీష్టాధిదేవీం పరమసుఖకరీం స్వాకృతిం సుందరాస్యాం*
*భేరుండాం ముక్తకేశీం త్రిభువనజననీం చేతసా చింతయామి ॥*

శ్రీ భేరుండాదేవి ముత్యములవలె, మొల్లపువ్వులవలె, చంద్రునివలె తెల్లనై మణి మయము లైన కిరీటమును, కర్ణాభరణములను, ధరించి శిరమున నెలవంకతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను, 1) అక్షసూత్రమును 2) అట్లే ఎడమవైపున వరముద్రను 1) పుష్పమును 2) ధరించిన నాల్గుచేతులతో, మూడు కన్నులతో, గురువిందపేరుల చేత ప్రకాశించు స్తనభారమువలన కొలదిగ వంగిన నడుముతో, పద్మమునందు నివసించును. వివిధమణి మయభూషణములు ధరించి, దేవతలెల్లరు నమస్కరించుటవలన వారల మణిమయ కిరీటముల కాంతులచేత ప్రకాశించు బంగరుపాదపీఠముకలిగి, పరమ సౌందర్య రాశియై, భక్తుల కోరికలను తీర్చుచు, గొప్ప సుఖముల నిచ్చుచు ముజ్జగములకు తల్లియైన ముక్తకేశియుగు భేరుండాదేవిని నా మానసమునందు తలంతును. (శ్వేతవర్ణము)



## 5. శ్రీ వహ్ని వాసినీ ధ్యానము

*పద్మం శంఖేక్షుచాపం హిమకిరణ మథో వామహస్తై ర్దధానాం*
*కల్హారం హేమశృంగం కుసుమమయశరం మాతులింగం చ దక్షైః ।*
*తప్తోద్యత్కాంచనాభాం మణిమయమకుటా మష్టహస్తాం త్రిణేత్రాం*
*నిత్యాం చిత్తారవిందే ప్రతిదివస మహం వహ్ని వాసీం భజామి ॥*

శ్రీ వహ్ని వాసిని కుడివైపున క్రిందనుండి పైకి వరుసన హిమకిరణమును 1) చెఱకును 2) శంఖమును 3) పద్మమును 4) అట్లే ఎడమవైపున ఎఱ్ఱకలువపువ్వును 1) దానిమ్మపువ్వును 2) బంగారు కొమ్మును 3) పూలబాణమును 4) ధరించి యుండును.

పుటము పెట్టబడిన మేలిమి బంగరువంటి శరీరచ్ఛాయలతో, మణిమయ కిరీటముతో, ఎనిమిది చేతులతో, మూడుకన్నులతో ప్రకాశించు నిత్యరాలగు శ్రీవహ్ని వాసినీదేవిని దినదినమునందు నా మానసపద్మమున భజింతును. (కనకవర్ణము)




## 6. శ్రీ వజ్రేశ్వరీ ధ్యానము

*రక్తాంభోధిస్థపోతే నవమణివిలసత్పద్మ పీఠే నిషణ్ణాం*

*పాశం కోదండ మిక్షూద్భవ మపి చ సృణిం దాడిమీబీజం ఫలం చ ।*

*బిభ్రాణాం రక్తవర్ణాం త్రిభిరపి నయనైః సాదరం వీక్షతీం తాం*

*వజ్రేశీం భావయేఽహం సురగణమునిభిః స్తూయమానాం భవానీమ్ ॥*

శ్రీ వజ్రేశ్వరి రక్త సముద్రమండలి పడవయందు క్రొత్త మణికాంతులచే నొప్పారు పద్మపీఠమునందు నిషణ్ణురాలై (కూర్చున్నదై) యుండును.

తన నాల్గు చేతులతో కుడివైపున క్రిందినుండి పైకి దానిమ్మపండును 1) అంకుశమును 2) అట్లే ఎడమవైపున చెఱకువింటిని 1) పాశమును 2) ధరించినదై, ఎఱ్ఱని శరీరచ్ఛాయతో నుండి, మూడు కన్నులతో, సాదరముగ చూచుచు, దేవతాముని సమూహములచేత స్తుతింపబడుచున్న భవానియగు శ్రీ వజ్రేశిని నేను నా మనస్సు నందు భావించుచున్నాను. (రక్తవర్ణము)




## 7. శ్రీ శివదూతీ ధ్యానము

*వామాధో రత్నపాత్రం తదుపరి చ గదాం ఖేటపాశౌ దధానాం*

*దక్షైః పద్మం కుఠారం తదుపరి చ మహో ఖడ్గమప్యంకుశం చ ।*

*మధ్యాహ్నార్క ప్రభాభాం నవమణివిలస ద్భూషణా మష్టహస్తాం*

*దూతీం నిత్యాం త్రిణేత్రాం సురగణమునిభిః స్తూయమానాం భజేఽ ఽ హమ్॥*

శ్రీ శివ దూతి నాల్గు చేతులయందు వరుసన కుడివైపున క్రింద నుండి పైకి పద్మమును 1) గొడ్డలిని 2) కత్తిని 3) అంకుశమును 4) అట్లే ఎడమవైపున నాల్గుచేతలయందు క్రమమున క్రింది నుండి పైకి రత్నపాత్రమును 1) గదను, 2) ఖేటమును 3) పాశమును 4) ధరించి అష్టహస్తయగుచునుండును.

మధ్యాహ్న సూర్యుని కాంతివంటి కాంతిగలదగుచు, నవమణి విలసిత భూషణములను ధరించి మూడు కన్నులతో నొప్పారుచు, సురముని సమూహములచేత స్తుతింపబడుచున్న నిత్యురాలగు శ్రీశివదూతీ దేవిని నేను భజించుచున్నాను. (పాటలవర్ణము)




## 8. శ్రీ త్వరితా ధ్యానము

**నాగైః కల్పితభూషణాం త్రిణయనాం గుంజాగుణాలంకృతాం**
**శ్యామాం పాశవరాంకుశాభయవరాం దోర్భి ర్యుతాం బాలికామ్ ।**
**పీతాం పల్లవవాసినీం శిఖిశిఖా చూడావతంసోజ్జ్వలాం**
**ధ్యాయా మ్యన్వహ మృక్షసింహనివహైః పీఠస్థితాం సుందరీమ్ ॥**

శ్రీ త్వరితాదేవి సర్వభూషణములచేత నలంకృతయై మూడు కన్నులతో, గురువిందసరులతో నొప్పారుచు, తరుణవయస్కురాలై కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1) అంకుశమును 2) అట్లే ఎడమవైపున వరదముద్రను 1) పాశమును 2) చతుర్బాహువులతో ధరించి యుండును.

చిగురుటాకుల వస్త్రమును దాల్చి, నెమలి పింఛముల చూడాభూషణముతో ప్రకాశించుచు, భల్లూకసింహసమూహముతో గూడి పీఠమునందున్న పచ్చని బాలాసుందరియగు శ్రీ త్వరితాదేవిని ధ్యానింతును. (పీతవర్ణము)



## 9. శ్రీ కులసుందరీ ధ్యానము

*బాలాదిత్య నిభారుణాం త్రిణయనాం బాలేందుచూడాన్వితాం*
*హాలాగంధిసుకోమలాధరయుతాం లీలావతీం సుస్మితామ్ ।*
*మాలాం పుస్తక మప్యభీష్ట మభయం సంబిభ్రతీం బాహుభి*
*ర్బాలాం తా మఖిలాంగభూషణధరాం ధ్యాయామి సంసిద్ధిదామ్ ॥*

శ్రీ కులసుందరీ లేతసూర్యునివలె నెఱ్ఱనై, మూడు కన్నులతో, బాలచంద్రుని శిరోభూషణముతో, మదిరాగంధముగల దొండపండువంటి క్రిందిపెదవితో, లీలావతియై చిఱునవ్వులను జిమ్ముచు నుండును.

తన నాల్గుహస్తములయందు క్రమమున కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1) అక్షమాలను 2) అట్లే ఎడమవైపున వరదముద్రను 1) పుస్తకమును 2) ధరించి సర్వావయ భూషణములతో నున్న బాలామూర్తియగు శ్రీ కులసుందరీదేవిని సంసిద్ధిని గోరి ధ్యానింతును. (అరుణ వర్ణము)



## 10. శ్రీ నిత్యాధ్యానము

*ఉద్యద్భానుసమప్రభాం రసముఖాం పాశాక్షసూత్రం ధనుః*
*ఖేటం శూల మభీష్టదం చ దధతీం వామై శ్చ షడ్భిః కరైః ।*
*దక్షై రంకుశపుస్తకేషుకుసుమం ఖడ్గం కపాలాభయం*
*మాణిక్యాభరణోజ్జ్వలాం త్రిణయనీం నిత్యాం భవానీం భజే ॥*

శ్రీ నిత్యాదేవి ఉదయించు సూర్యునివలె నెఱ్ఱని శరీరచ్ఛాయలతో, ప్రేమరసమును వర్షించు వారు మొగములతో నుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1) కపాలయును 2) ఖడ్గమును 3) పూలబాణమును 4) పుస్తకమును 5) అంకుశమును 6) ఆరు చేతలతో ధరించి, అట్లే ఎడమవైపున క్రిందినుండి పైకి వరుసన వరదముద్రను 1) శూలమును 2) డాలును 3) వింటిని 4) అక్షసూత్రమును 5) పాశమును 6) ఆరు చేతులతో ధరించి యుండును

మణిమయభూషణములతో ప్రకాశించును, ప్రతి ముఖమునందు త్రిణేత్రియగు భవానీమూర్తియైన శ్రీనిత్యా దేవిని భజింతును. (రక్తవర్ణము)



## 11. శ్రీ నీలపతాకా ధ్యానము

**నీలాభా మరుణాంశుకాం త్రిణయనాం పంచాననాం సుస్మితాం**

**వామే పాశపతాకపద్మవిలస చ్ఛాపం వరం బిభ్రతీమ్**

**దక్షే చాంకుశఖడ్గశక్తిసుమహా బాణాభయాన్ బాహుభిః**

**పద్మస్థాం మణిమౌక్తికావృతకచాం నీలధ్వజా మాశ్రయే ॥**

శ్రీ నీలపతాక నల్లని శరీరచ్ఛాయలతో, ఎఱ్ఱని వస్త్రములతో, ఐదు మొగములతో, ప్రతిముఖమునందుమూడు కన్నులతో చిఱునవ్వులను ప్రసరింపజేయుచు కుడివైపున క్రింది నుండి పైకి వరుసన అభయముద్రను 1) వక్తిని 2) ఖడ్గమును 3) అంకుశమును 4) బాణమును 5) అట్లే ఎడమవైపున క్రిందినుండి పైకి వరదముద్రను 1) పద్మమును 2) పతాకను 3) పాశమును 4) వింటిని 5) పది చేతులతో ధరించి యుండును.

పద్మమునందుండి మణిమౌక్తికహారములు పయోదరములయందు ప్రకాశించు చుండ మాతీమూర్తియగు నీలధ్వజాదేవిని నేను ఆశ్రయించుచున్నాను. (నీలవర్ణము)



## 12. శ్రీ విజయా ధ్యానము

*శంఖం చక్రం చ పాశం సృణి మపి సుమహా ఖేటఖడ్గౌ చ చాపం*
*బాణం కల్హారపుష్పం తదను కరగతం మాతులింగం దధానామ్ ।*
*ఉద్యద్బాలార్క వర్ణాం త్రిభువనవిజయాం పంచవక్త్రాం త్రిణేత్రాం*
*దేవీం పీతాంబరాఢ్యాం కుచభరనమితాం సంతతం భావయామి ॥*

శ్రీ విజయాదేవి పది చేతులయందు కుడివైపున క్రిందినుండి పైకి వరుసన ఎఱ్ఱని కలువపూవును 1) బాణమును 2) ఖడ్గమును 3) అంకుశమును 4) చక్రమును 5) అట్లే ఎడమవైపున దానిమ్మపండును 1) వింటిని 2) గొప్పఖేటమును 3) పాశమును 4) శంఖమును 5) ధరించి యుండును.

ఉదయించుచున్న సూర్యునిం బోలిన ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, పంచవక్త్రయై ప్రతి ముఖమునందు మూడుమూడు కన్నులతో త్రిభువనములను (మూడు లోకములను) జయించి, పదారువన్నె మేలిమిబంగారు రంగులను చిందు వస్త్రములను ధరించి, వక్షభారముచేత కొలదిగవంగిన శరీరముకల జగన్మాతయగు శ్రీవిజయాదేవిని మానసమున భావించుచున్నాను. (రక్తవర్ణము)



## 13. శ్రీ సర్వమంగళా ధ్యానము

*హేమాభాం కరుణాభిపూర్ణనయనాం మాణిక్యభూషోజ్జ్వలాం*
*ద్వాత్రింశద్దల షోడశాష్టదలయుక్పద్మస్థితాం సుస్మితామ్ ।*
*భక్తానాం ధనదం వరం చ దధతీం వామేన హస్తేన త*
*(భక్తానాం చ వరం దనం చ దధతీం)*
*ద్దక్షేణాభయమాతులింగసుఫలం శ్రీమంగళాం భావయే ॥*

శ్రీ సర్వమంగళ బంగారుకాంతుల నెగజిమ్ము శరీరద్యుతులతో. దయాపూర్ణములగు కన్నులతో, మణిమయములగు సువర్ణాభరణములతో ప్రకాశించుచు క్రమముగ పై నుండి లోనికి ముప్పదిరెండు, పదునారు, ఎనిమిది దళములుగల బంగరు పద్మమునందు నిషణ్ణురాలై చిఱునవ్వులతో నుండును. భక్తుల కొఱకు కుడివైపున క్రింది నుండి పైకి వరుసన అభయముద్రను 1) దానిమ్మపండును 2) అట్లే ఎడమవైపున వరదముద్రను 1) ధనమును 2) ధరించిన శ్రీ మంగళాంబను భావింతును. (కనకవర్ణము)




## 14. శ్రీ జ్వాలామాలినీ ధ్యానము

**కల్పాంతాగ్ని సమప్రభాం స్మితముఖైః షడ్భి ర్భుజైర్ద్వాదశై**
**ర్యుక్తాం పాశకఖేటకంజసుశరం శూలం వరం వామతః ।**
**దక్షే త్వంకుశఖడ్గశక్తి సుశరాం శ్చాపాభయే బిభ్రతీం**
**జ్వాలామాలిని సంజ్ఞాతాం మణిమయీాం భూషాన్వితా మాశ్రయే ॥**

శ్రీ జ్వాలామాలిని ప్రళయకాలము నందలి అగ్నితో సమములగు శరీరకాంతులతో చిఱునవ్వుల గ్రుమ్మరించు నారు మొగములతో, పండ్రెండు చేతులతో నుండును.

కుడివైపున క్రింది నుండి పైకి అభయముద్రను 1) అంకుశమును 2) దర్భలను 3) ఖడ్గమును 4) శక్తిని 5) వింటిని 6) అట్లే ఎడమవైపున వరదముద్రను 1) పాశమును 2) శూలమును 3) ఖేటమును 4) పద్మమును 5) బాణమును 6) ధరించినదై మణులతో, విభూషణములతో ప్రకాశించు శ్రీ జ్వాలామాలినీ దేవిని ఆశ్రయింతును. (రక్తవర్ణము)



## 15. శ్రీ చిత్రా ధ్యానము

*బాలర్క కాంతిశశలాంఛితవక్త్రశోభాం*
*పాశాంకుశౌ చ వర మప్యభయం దధానామ్ ।*
*చిత్రాంశుకాం చ నవరత్న విభూషితాంగీం*
*చిత్రాంబికాం త్రిణయనాం హృది భావయామి ॥*

శ్రీ చిత్రాదేవి బాలసూర్యునివంటి శరీరచ్ఛాయతో, చంద్రునివంటి ముఖశోభతో కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1) అంకుశమును 2) ఎడమవైపున వరదముద్రను 1) పాశమును 2) ధరించును.

వివిధ వర్ణములు గల వస్త్రములనుగట్టి నవరత్నమయములగు బంగారు భూషణములతో సర్వాంగముల నలంకరించి, మూడు కన్నులతో ప్రకాశించు శ్రీ చిత్రాంబికా దేవిని నా హృదయమునందు భావించుచున్నాను. (రక్తవర్ణము)




## 16. శ్రీమహాత్రిపురసుందరి

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరికాం**
**సమంద హసితేక్షణాం సశరచాప పాశాంకుశామ్,**
**అశేష జనమోహినీ మరుణ మాల్య భూషాంబరామ్,**
**జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరేదంబికామ్ ॥**

అన్ని కళలకూ, ఖండాలకు అధిదేవత కామేశ్వరుడు. అధిష్ఠాత్రి కామేశ్వరి. ఈ రకంగా సోమసూర్య అనలాత్మకములైన మూడు ఖండాలుగా ఈ మంత్రం విభజింపబడింది. ఈ మూడుఖండాలను మూడుకూటములు అంటారు.

1. క ఏ ఈ ల హ్రీం – ఇది వాగ్భవకూటము. విద్యాప్రదము బుద్ధిప్రదము.
2. హ స క హ ల హ్రీం – ఇది కామరాజకూటమి. అభీష్టసిద్ధి కలిగిస్తుంది. భోగప్రదము.
3. స క ల హ్రీం – ఇది శక్తి కూటమి. మోక్షప్రదము.

**లలితాత్రిశతి ఫలశృతిలో** ఈ విధంగా చెప్పబడింది.

***ఏతద్విజ్ఞానమాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదా భవేత్***
***కత్త్రయం హద్వయం చైవ శైవోభాగః ప్రకీర్తితః ॥***
***శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ఉభయాత్మకః ।***
***ఏవం చ విభాగ మజ్ఞాత్వా యే విద్యాజపశాలినః ॥***

పంచదశీ మహామంత్రంలోని మూడు క కారములు, రెండు హ కారములు శివాత్మకములు. మూడు హ్రీంకారములు శివ శక్త్యాత్మకములు. మిగిలిన అక్షరములు శక్త్యాత్మకములు. ఈ విషయము తెలియకుండా ఎంతకాలము జపం చేసినా మంత్రం సిద్ధించదు.

**హాది కాది విద్యలు :** అకారాది క్షకారాంతము అక్షరసముదాయానికి మాతృకలని పేరు. వీటిలో కకరాదిగ హల్లులున్న అక్షరాలను కాది మాతృకలని, హకారాదిగహల్లులున్న అక్షరాలతో మొదలైతే హాదిమాతృకలని అంటారు. పంచదశీ మహామంత్రము క కారముతో మెదలైతే కాదివిద్య అని, హ కారంతో మొదలైతే హాదివిద్య అని చెప్పబడింది. కాదివిద్యలో యమనియమాలుండవు. ధర్మాచరణ విషయంలో స్వేచ్ఛ ఇవ్వబడిందని **శక్తిసంగమతంత్రం**లో చెప్పబడింది. ఈ రెండు విద్యలలోను కాది విద్య శ్రేష్ఠమైనది.

***కామో (క) యోనిః (ఏ) కమలా (ఈ) వజ్రపాణిః (ల)***
***గుహా (హ్రీం) హసా (హస,) మాతరిశ్వా (క) భ్ర (హ) మింద్రః (ల)***
***పునర్గుహా (హ్రీం) సకలా (సకల) మాయయా (హ్రీం) చ***
***పురూచ్యేషా విశ్వమాతాది విద్యా ॥***

**మంత్రము :** క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।

కాది మతానికి దక్షిణామూర్తి ఋషికాగా హాదిమతానికి హయగ్రీవుడు ఋషి. కాని వాడుకలో రెండు మతాలకూ దక్షిణామూర్తినే ఋషిగా చెబుతున్నారు. కాదిమతంలో మంత్రంలో చెప్పబడిన మొదటి మూడు అక్షరాలను హ, స, క అని మార్చుచేసినట్లైతే అది హాదిమతం అవుతుంది.

***శివేన (హ) శక్త్యా (స) కామేన (క) శక్రే (ల) ణైవతు మాయయా (హ్రీం)***
***హం సేన (హ) భృగుణా (స) చైవ కామేన (క) శశిమౌళినా (హ)***
***శక్రేణ (ల) భువనేశేన (హ్రీం) చంద్రేణ (స) చ మనోభువా (క)***
***క్షిత్యా (ల) హృల్లేఖయా (హ్రీం) చైవ ప్రోక్తో హసాది మంత్రరాట్ ॥***

**మంత్రం :** హ స క ల హ్రీం। హ స క హ ల హ్రీం। స క ల హ్రీం॥

ఈ రకంగా హాది, కాది మతాలలో పంచదశీమహామంత్రం ఉపాసింపబడింది. పూర్వకాలంలో ఈ మంత్రాన్ని చాలా మంది చాలా రకాలుగా ఉపాసించారు.

**మను శ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః।**
**అగస్తి ర్నంది సూర్యైచ ఇంద్రో విష్ణు శ్శివ స్తథా।**
**క్రోధభట్టారకో దేవ్యా ఏ తేముఖ్యాఉపాసకాః।**
**ఏవం ద్వాదశదా భిన్నా శ్రీమత్పంచ దశాక్షరీ॥**

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మధుడు, అగస్త్యుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, విష్ణువు, శివుడు, దూర్వాసుడు అను పన్నెండు మంది ఈ మంత్రాన్ని వివిధ రకాలుగా ఉపాసించారు. కాని

**తేషు ద్వామనురాజౌ తు వరిష్ఠౌ వింధ్యమర్దన**
**లోపాముద్రా కామరాజావితి ఖ్యాతి ముపాగతౌ।**
**హాదిస్తు లోపాముద్రా స్యాత్కామరాజస్తు కాదికః**
**తయోస్తు కామరాజోఽయం సిద్ధిదో భక్తి శాలినాం।**

ఈ పన్నెండు మంత్రాలలోను హాదిమతంలో లోపాముద్రము, కాదిమతంలో కామరాజము అనే రెండు మంత్రాలే శ్రేష్ఠములు. మళ్ళీ ఈ రెండింటిలోనూ కాది విద్య అయిన కామరాజవిద్య ప్రశస్తము.

ఈ పన్నెండు రకాల మంత్రాల వివరణ నాచే వ్రాయబడిన **శ్రీవిద్యాపంచదశి** అనే గ్రంథంలో ఇవ్వబడింది.

ఈ రకంగా భిన్న సంప్రదాయాలతో పంచదశీమహామంత్రం చెప్పబడుతోంది. ఈ మంత్రాన్ని వివిధమంత్రాలతో సంపుటం చేయటం కూడా జరుగుతుంది. పంచదశీ మహామంత్రాన్ని.

1. బాలా మంత్రంతో సంపుటం చేస్తే **సౌభాగ్య విద్య** అంటారు.
2. గణపతి మంత్రంతో సంపుటం చేస్తే **విద్యాగణపతి** అంటారు.
3. గోపాల మంత్రంతో సంపుటం చేస్తే **గోపాల సుందరి** అంటారు.

**షోడశాక్షరీ మహామంత్రం :**

శ్రీవిద్య పూర్ణదీక్షలో ప్రధానమైనది షోడశాక్షరీ మహామంత్రం. దీనినే శుద్ధవిద్య అని కూడా అంటారు. అయితే శుద్ధవిద్య అనే విద్య ఇంకొకటి కూడా ఉంది. దీనికి సదాశివుడు ఋషి. గాయత్రి ఛందస్సు. దీనిలో మూడు బీజాక్షరాలు మాత్రమే ఉంటాయి.

దీని మంత్రం : ఐం ఈం ఔః ॥

***కామరాజాంత మంత్రాంతే శ్రీబీజేన సమన్వితా ।***
***షోడశాక్షరీ విద్యేయం శ్రీవిద్యేతి ప్రకీర్తితా ॥***

మన్మథుడుపాసించిన పంచదశీమహామంత్రానికి చివర 'శ్రీం' బీజాన్ని చేర్చినట్లైతే షోడశాక్షరి అవుతుంది. అనగా షోడశాక్షరీ మంత్రం.

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । శ్రీం॥**

లక్ష్మీధరులు, భాస్కరాచార్యులు కూడా దీనిని సమర్ధించారు. కాని పంచదశీ మహామంత్రానికి చివర 'ఈం' బీజం చేర్చినట్లైతే షోడశి అవుతుంది అని కొందరి వాదన. దీని ప్రకారం షోడశాక్షరీమంత్రం –

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । ఈం॥**

కావ్యకంఠగణపతి మునివర్యులు తమ మహావిద్య సూత్రగ్రంథంలో

***బ్రహ్మ (క) యోని (ఏ) శాంతి (ఈ) ఇంద్ర (ల) మాయా (హ్రీం) భిః***
***ఖ (హ) భృగు (స) బ్రహ్మ (క) ఖ (హ) ఇంద్ర (ల) మాయాహ్రీం భిః***
***భృగు (స) బ్రహ్మ (క) ఇంద్ర (ల) మాయా (హ్రీం) భిశ్చ***
***పంచదశీ ॥ రయో (శ్రీం) త్తరీయం షోడశీ ॥***

**మంత్రం :** క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । శ్రీం ॥

అయితే ఇది కేవలం పదహారు అక్షరాల మంత్రం. అంతే కాని బ్రహ్మవిద్య మాత్రం కాదు. బ్రహ్మవిద్య అయిన షోడశాక్షరికి ఇరవై ఎనిమిది అక్షరాలుంటాయి.

***అష్టౌ బీజాక్షరాణ్యాదౌ పశ్చాత్పంచదశీ తతః***
***పంచ బీజాక్షరా ప్యేషా శ్రీమహాషోడశీ మతా***

పంచదశీమహామంత్రానికి ముందు ఎనిమిది బీజాక్షరాలు, తరువాత ఐదుబీజాక్షరాలు కలిపినట్లైతే దాన్ని మహాషోడశి అంటారు. అది బ్రహ్మవిద్య.

**శ్రీబీజ మాయా స్మర యోని శక్తి స్వరం చ మాయా కమలాత్మ విద్యా**
**శక్త్యాది బీజాని విలోమితాని శ్రీషోడశార్ణా ః పరదేవతాయాః**

దీనిని బట్టి మహాషోడశికి పదహారు అక్షరాలే ఉంటాయి. పంచదశీ మహామంత్రం లోని మూడుఖండాలను మూడు బీజాలుగా లెక్క పెడితే మొత్తం పదహారు అక్షరాలే అవుతాయి. ఇది **శ్రీవిద్యారహస్యము. త్రిపురాసిద్ధాంతంలో**

***కమలా (శ్రీం) భువనేశానీ (హ్రీం) కామో (క్లీం) వాగేశ్వరీ (ఐం) తతః***
***పరా (సౌః) చ ప్రణవః (ఓం) పశ్చాత్ భువనానామధీశ్వరీ (హ్రీం)***
***కమలా (శ్రీం) చాపి పూర్వోక్తా త్రికూటా పరమేశ్వరీ***
***పరా (సౌః) వాణీ (ఐం) రతీశ (క్లీం) శ్చలోకేశీ (హ్రీం) విష్ణువల్లభా (శీం)***

దీనిని బట్టి పంచదశీ మహామంత్రానికి శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం అనబడే ఎనిమిది బీజాక్షరాలు ముందు, సౌః ఐం క్లీం హ్రీం శ్రీం అనబడే ఐదు బీజాక్షరాలు తరువాత చెప్పినట్లైతే మహాషోడశి అవుతుంది. పంచదశీమహామంత్రాన్ని మూడు బీజాలుగా లెక్కపెట్టినట్లైతే మహాషోడశి పదహారు అక్షరాలు కల బ్రహ్మవిద్య అవుతుంది.

**మంత్రం :** శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం । క ఏ ఈ ల హ్రీం ।
హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥

షోడశాక్షరీ మహామంత్రాన్ని దూర్వాస మహర్షి వ్రాసి **దేవీ మహిమ్నస్తోత్రము** అనే గ్రంథంలో కూడా నిరూపించటం జరిగింది.

***శ్రీమాత స్త్రిపురే ! పరాత్పరతరే ! దేవి ! త్రిలోకిమహా ।***
***సౌన్దర్యార్ణవమన్థనోద్భవసుధా-ప్రాచుర్యవర్ణోజ్జ్వలం ।***
***ఉద్యద్భానుసహస్రనూతనజపా-పుష్పప్రభం తే వపుః ।***
***స్వాన్తే మే స్ఫురతు త్రిలోకనిలయం - జ్యోతిర్మయం వాఙ్మయమ్.***

***శ్రీం (శ్రీం) మా (హ్రీం) త్రిపురే (క్లీం ఐం సౌః) ఈ (ఓం)***
***పరాత్పరే (హ్రీం శ్రీం), (దేవీ, త్రిలోకీ (పంచదశీ) మహాసౌందర్యా***
***(సౌం ఐం క్లీం) ర్ణవ మథనోద్భవ సుధా ప్రాచుర్య వర్ణోజ్వలం***
***ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్ప ప్రభంతే వపుః (హ్రీం)***
***స్వాన్తే మా (శ్రీం) ఈ స్ఫురతు త్రిలోకనిలయం జ్యోతిర్మయం వాఙ్మయమ్॥***

**మంత్రం :** శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం । క ఏ ఈ ల హ్రీం ।

హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం॥

**మహాషోడశి – ప్రణవము :**

***వైదికా ప్రణవైర్యుతా ప్రణవేన విహీనస్తు తాంత్రికా ఏవ ప్రకీర్తితా ॥***

అని చెప్పబడింది. అంటే ఓంకారము బీజముగాగల మంత్రాలే వైదికమంత్రాలు. అదే బ్రహ్మవిద్య. మరి షోడశీ మహామంత్రములో ఓంకారము లేదుకదా. అది వైదిక మంత్రము అందులోను బ్రహ్మవిద్య ఏ రకంగా ఔతుంది. ?

దేవీ పంచాసనాసీన అనగా ఐదు రకాల ఆసనములధిష్ఠించింది. అవి 1) పంచదిగాసనము 2) పంచకలాసనము 3) పంచభూతాసనము 4) పంచముఖాసనము 5) పంచప్రణవాసనము.

వీటిలో పంచప్రణవాలు అంటే శ్రీం హ్రీం క్లీం ఐం సౌః

ఈ పంచప్రణవాలు షోడశిమహామంత్రంలో అనులోమ విలోమాలుగా ఉంటాయి. మంత్రంలో ఒక ప్రణవం ఉంటేనే అది మనకు ముక్తిని ప్రసాదించే మహామంత్రం అయినప్పుడు ఐదు ప్రణవాలు, అనులోమ, విలోమంగా ఉంటే ఆ మంత్రం యొక్క శక్తిని ఏవిధంగా వర్ణించగలుగుతాము ? మహాషోడశిలో పంచప్రణవాలు అనులోమ విలోమంగా ఉన్నాయనేది శ్రీవిద్యారహస్యము.

**వరివస్యారహస్యము** : అనే గ్రంథంలో భాస్కరరాయులవారు పంచదశీ మహామంత్రమునుంచే శ్రీచక్రం పుట్టింది అన్నారు.

***కత్రి తయాదీ కారాద్బిందుర్జాత స్తదగ్రిమేచక్రే,***
***హృల్లేఖాభిస్తత్పర చక్రత్రితయం హకారాభ్యామ్***
***ఏకారేణచ తత్పర చక్రేజాతే సకారాభ్యామ్,***
***చతురశ్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్రజనిః.***

పంచదశి మహామంత్రము నందలి

1. మూడవ క కారము వలన, ఈ కారము వలన – బిందువు పుట్టింది.
2. మూడు హ్రీం కారముల వలన – త్రికోణము, వసుకోణము పుట్టినాయి.
3. రెండు హ కారములు, ఏ కారముల వలన – దశారయుగ్మము, చతుర్దశారము పుట్టినాయి.

4. రెండు స కారములవలన - అష్టదళము, షోడశదళము పుట్టాయి.

5. ల కారము వలన - భూపురం పుట్టింది.

ఈ రకంగా పంచదశీ మహామంత్రం నుంచే శ్రీచక్రం పుట్టింది.

భాస్కరరాయలవారు పంచదశీమహామంత్రానికి గణేశత్వము, యోగినీ రూపము, నవగ్రహస్వరూపము, రాశిస్వరూపము, నక్షత్రరూపము కూడా చెప్పారు.

**1. గణేశరూపము :**

***"అకథాదికషోఢశాక్షరా త్మకతార్తీయక కామవాగభివైః ।***

***ఘటితాచ పరాదివాగ్గణై రితివిద్యాపి గణేశ రూపిణీ ॥***

1. అకారాది పదహారు అక్షరములు - శక్తికూట స్వరూపము
2. క నుంచి త వరకు పదహారు అక్షరములు - కామరాజకూటమి
3. థ నుంచి స వరకు పదహారు అక్షరములు - వాగ్భవకూటమి.
4. వ్యష్టి, సమిష్టి భేదముచే - విద్యా స్వరూపము.

ఈ రకంగా వర్ణగణ స్వరూపం కలది కాబట్టి పంచదశీ మహామంత్రానికి గణేశత్వం లభించింది.

**2. యెగినీ రూపము :**

***హృల్లేఖాభి స్తిసృభి స్తదన్యకూటైశ్చ యోగినీయోగాత్ ।***

శ్రీవిద్యలో హ్రీంకారాలు మూడు, అవిలేని కూటములు మూడు. మొత్తం ఆరు ఢాకిని రాకిని, లాకిని, కాకిని, సాకిని, హాకిని అనే యోగినులు ఆరుగురు. కాబట్టి ఈ మంత్రానికి యోగినీ స్వరూపము వచ్చింది.

**3. నవ గ్రహరూపము :**

**బిందుత్రయనాదత్రయ తదస్యకూటత్రయైర్గ్రహత్వమిహ ।**

1. **బిందుత్రయము :** మూడు కూటముల చివరనున్న బిందువులు
2. **నాదత్రయము :** బిందువు తరువాత ఉండు అర్ధచంద్రార్ధాష్టకము
3. బిందు, నాదత్రయములు లేని కూటములు మూడు.

మొత్తం గ్రహాలు తొమ్మిది. కాబట్టి మూలమంత్రానికి నవగ్రహత్వం చెప్పబడింది.

**4. రాశి స్వరూపము :**

***రాశిభూతా ప్యేష్టా త్రిస్రుణాంపూర్వాక్షరై రైక్యాత్ ॥***

హ్రీం కారాలు వదలి వేసినట్లైతే పంచదశీమహామంత్రంలో ఉండే బీజాక్షరాలు పన్నెండు. రాశులు పన్నెండు. కాబట్టి మూలమంత్రానికి రాశిస్వరూపం వచ్చింది.

**5. నక్షత్ర రూపం :**

***ఇన్ద్రియ దశకే నాస్తః కరణ చతుష్కోణ విషయ దశకేశ***
***ప్రకృతి, పురుష, గుణతత్త్వైర్జాతా నక్షత్ర రూపిణీ మాతా !***

పరమేశ్వరి శరీరంలో ఉన్న

| | | |
|---|---|---|
| జ్ఞానేంద్రియాలు | – | 5 |
| కర్మేంద్రియాలు | – | 5 |
| తన్మాత్రలు | – | 5 |
| వచనాదులు | – | 5 |
| (వచన, దామ, గమన, విసర్గ, అనందములు) | | |
| అంతఃకరణ | – | 4 |
| (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) | | |
| ప్రకృతి, పురుషుడు, గుణ | – | 3 |
| మొత్తం | – | 27 |

నక్షత్రములు 27 కాబట్టి దేవి నక్షత్ర రూపిణి

ఈ రకంగా పంచదశీ మహామంత్రానికి గణేశత్వము, యోగినీరూపము, నక్షత్రరూపము చెప్పబడి అన్ని అవస్థలతో కూడబడినదిగా, సకల వేదసారమైనదిగా, సమస్త దేవతామయంగా, సర్వవర్ణ శోభితంగా సర్వశక్తి సమన్వితంగా శివశక్తుల సంపుటం కలదిగా పంచదశీమహామంత్రం ఒప్పారుచున్నది.

పంచదశీ మహామంత్రం మీద మరిన్ని వివరాలకు నాచే వ్రాయబడిన శ్రీవిద్యా పంచదశి చూడండి.

## కళా మంత్రముల ఐక్యము

***త్రిఖండే త్వన్మంత్రే శశి సవితృవహ్న్యాత్మకతయా***
***స్వరాశ్చంద్రే లీనాః సవితరి కళాః కాదయ ఇహ***
***యకారాద్యా వహ్నౌ పథకషయుగం బైందవగృహే***
***విలీనం సాదాఖ్యే శివ యువతి నిత్యైందవ కళే॥*** ***20***

పంచదశీ మహామంత్రము మూడు ఖండములుగా ఉన్నది. 1.అగ్నిఖండము 2. సూర్యఖండము 3. చంద్రఖండము.

అగ్నికి కళలు పది, సూర్యునికి కళలు ఇరవైనాలుగు, చంద్రునికి కళలు పదహారు. మొత్తం కళలు యాభై. అక్షరాలు యాభై.

ఈ యాభై అక్షరాలు శ్రీచక్రంతోనూ, మూలమంత్రంతోనూ ఐక్యము పొందుతున్నాయి.అది ఏ విధంగా అంటే

1. అ నుంచి అః వరకు (స్వరములు) చంద్రఖండంతోనూ
2. క నుంచి మ వరకు సూర్య ఖండంతోనూ
3. అంతస్థములు, ఊష్మములు (య ర ల వ శ స ష హ) అగ్ని ఖండంతోనూ
4. ళ కారము బైందవ స్థానంతోను, క్ష కారము సర్వత్ర ఐక్యము పొందుతున్నాయి.

భగవతి మాతృకావర్ణరూపిణి అని చెప్పబడింది. అంటే అక్షరస్వరూపిణి అని అర్థం. అక్షరాలను అ క చ ట త ప య శ అని ఎనిమిది వర్గులుగా విభజించినారు. ఈ వర్గులలో వశిని, కామేశ్వరి, మోదిని, విమల, అరుణ, జయిని, సర్వేశ్వరి, కౌళిని అను ఎనిమిది మంది శక్తులు కలసి ఉన్నారు.

చంద్ర స్వరూపమైన అచ్చులు షోడశదళంలోనూ, క చ ట త ప అనబడే ఐదు వర్గులు దశారయుగ్మంలోనూ, అంతస్థములు, ఊష్మములు (య ర ల వ శ ష స హ) అష్టదళ పద్మంలోనూ, ళ కారము బిందువు నందు, కలసిపోతాయి. ఈ రకంగా మంత్ర చక్రాలు - మాతృకలు, కళలు - మంత్రము, కళలు -- చక్రము ఒకదానిలో ఒకటి లీనమవుతున్నాయి.

## వర్ణమంత్రముల యోజన

*కకారాకారాభ్యాం స్వరగణ మవష్టభ్య నిఖిలం*
*కలాప్రత్యాహారాత్సకల మభవ ద్వ్యంజన గణః*
*త్రిఖండే స్యాత్ప్రత్యాహరణ మిద మన్వక్షయుగం*
*క్షకారాశ్చక్రాఽ సరోక్షర తనుతయా చాక్షరమితి ॥* **21**

భాషకుగల అక్షరాలలో అ నుంచి అః వరకు అచ్చులు అనీ, క నుంచి క్ష వరకు హల్లులనీ అంటారు. సనకాది సిద్ధుల నుద్ధరింప గోరినవాడై శివుడు తన ఢక్కను పధ్నాల్గు సార్లు వాయించగా, పధ్నాల్గు రకాల శబ్దాలు వచ్చినాయి. వాటిని మహేశ్వర సూత్రాలు అంటారు. వీటిలో మొదటి నాలుగు సూత్రములు అచ్చులు. మొదటి సూత్రము 'అ' తో

మొదలు కాగా, నాలుగవ సూత్రము 'చ్' తో పూర్తి అయింది. అందుకని ఈ మధ్యలో ఉన్న అక్షరాలను అ+చ్ = అచ్చులు అన్నారు. అలాగే ఐదవ సూత్రం 'హ'తో మొదలు కాగా పధ్నాల్గవ సూత్రము 'ల్' తో పూర్తయింది. ఈ మధ్యలో ఉన్న అక్షరాలను (హ+ల్) = హల్లులు అన్నారు. వర్ణసమామ్నాయంలో అ నుంచి క్ష వరకు ఉండే వర్ణసముదాయాన్ని 'అక్షరాలు' అన్నారు. అక్షరము అంటే క్షరము లేనిది. నాశనము లేనిది అని అర్థము.

అచ్చులు అంటే స్వరములు. ఇవి ప్రాణములు. శక్తి స్వరూపాలు, హల్లులు శివస్వరూపాలు. ఈ విషయం మాతృకాహృదయంలో వివరించబడింది.

*కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః।*
*సమస్త వ్యస్తరూపేణ షట్ త్రింశత్ తత్త్వ విగ్రహాః॥*
*అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః।*
*నిత్యాషోడశ కాత్మనః పరస్పర మమీయుతాః॥*
*శివశక్తి మయావర్ణా శబ్దార్థ ప్రతిపాదకాః।*
*శివః స్వర పరాధీనో న స్వతంత్రః పదావ్యసౌః॥*
*స్వరాః స్వతంత్రా జాయంతే న శివస్తు కదాచన॥"*

ఈ రకంగా ఉన్న అక్షరాలను మూడు భాగాలుగా చేయటం జరిగింది. అ నుంచి అః వరకు పదహారు అక్షరములు. మొదటిభాగము క నుంచి త వరకు రెండోభాగము, థ నుంచి స వరకు మూడోభాగము. వీటిని షోడశత్రికము అంటారు. అనగా పదహారు అక్షరములు చొప్పున ఉన్న మూడు ఖండాలు. వీటిలో సత్వరజస్ తమోగుణాలు, త్రిమూర్తుల, చంద్రసూర్యాగ్నుల, జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థల తత్త్వాలు చేర్చబడ్డాయి. వీటిలో నిత్యలను కూడా చేర్చటం జరిగింది. నిత్యలు పదహారు వీటిని గురించి వసిష్ఠసంహితలో చెప్పటం జరిగింది.

ఇప్పటి వరకు 16×3=48 అక్షరాలు విలీనమయినాయి. హ కారము ఆకాశబీజం. బైందవాకాశంలో విలీన మవుతున్నది. ళ కారము బిందువులో విలీనమవుతుంది.

శబరవర్మచే వ్రాయబడిన అక్షరములలో హల్లులు కాది మాతృకలు. అంటే క కారముతో మొదలవుతాయి. ఆఖరి అక్షరం ళ. క కారాది ళ కారాంతము గల వర్ణములను కళ అంటారు. ఇది గౌణార్థము. పంచదశీ మహామంత్రము క అనే అక్షరంతో మొదలై మూడవఖండంలో 'ల' అనే అక్షరముతో పూర్తవుతుంది. ఈ రకంగా క కార ల కారముల కలయిక వల్ల మంత్రంలో అక్షరాలన్నీ గ్రహించబడినాయి అని అర్థం. క, ల అనే అక్షరాలు ప్రతిఖండంలలోనూ ఉన్నాయి. కాబట్టి ప్రతి ఖండంలోనూ అన్ని అక్షరాలు మూడు ఆవృత్తులుగా ఉన్నాయి. ఇది శ్రీవిద్యారహస్యము.

ఈ విషయాన్ని శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోని ముప్పైరెండవ శ్లోకంలో వివరించారు.

## ఋషి వర్ణనము

*విదేహేంద్రాపత్యం శ్రుత ఇహ ఋషిర్యస్య చ మనో*
*రయంచార్థః సమ్యక్శ్రుతి శిరసి తైత్తిర్యక ఋచి*
*ఋషిం హిత్వాచాస్యా హృదయ కమలే నైతమృషిమి*
*తృచాభ్యుక్తః పూజావిధిరిహ భవత్యాః సమయినామ్॥* **22**

ఈ శ్లోకంలో శ్రీవిద్యకు ఋషి అయిన మన్మథుణ్ణి గురించి చెప్పటం జరిగింది.

పూర్వకాలంలో పంచదశీమహామంత్రాన్ని ఎంతో మంది మహానుభావులు జపించి తరించారు అని చెప్పబడుతోంది.

**మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తిర్నంది సూర్యౌ చ ఇంద్రో విష్ణు శ్శివస్తథా**
**క్రోధ భట్టారకో దేవ్యా ఏతే ముఖ్యా ఉపాసకాః**

ఈ రకంగా మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మధుడు మొదలైన పన్నెండు మంది ఈ మంత్రాన్ని ఉపాసన చేశారు.

అయితే పంచదశీమహామంత్రాన్ని ఈ లోకానికి తెచ్చినవాడు మన్మధుడు. అతడే ఈ మంత్రానికి ఋషికాగా దక్షిణామూర్తి ఋషి అని కొందరంటారు.

'జనకోవైదేహః' అనే వాక్యాన్ని బట్టి ఈ మంత్రానికి జనకుడు వైదేహుడు. అనగా దేహము లేనివాడు, మన్మధుడు అని తెలుస్తోంది.

సంస్కృతి భాషకుగల యాభై అక్షరాలను మూడు ఖండాలుగాచేసి వాటిలో సత్వరజస్తమో గుణాలు, త్రిమూర్తుల, చంద్రసూర్యాగ్నుల, జాగ్రత్స్వప్న సుషుప్తి అనే అవస్థల, తత్త్వాలు చేర్చ బడినాయి. ఆ మూడుఖండాలు సోమ సూర్య అనలాత్మకములు. మహాత్రిపురసుందరి మొదలైన పదహారు నిత్యలను కూడా ఈ ఖండములో చేర్చటం జరిగింది. షోడశ నిత్యలు శుక్ల పక్ష పాడ్యమి మొదలు పౌర్ణమి వరకు తిథుల రూపమున ఉన్నారు. వీటికి చంద్రకళలు అని పేరు. చంద్రకళలే పాడ్యమి మొదలైన తిథులు అని జ్యోతిశ్శాస్త్రంలో చెప్పబడింది.

*'ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమా కలా*
*ద్వితీయాద్యా ద్వితీయాద్యాః పక్షయో శ్శుక్ల కృష్ణయోః॥'*

పాడ్యమి నుండి పౌర్ణమి వరకు పదిహేను, అమావాస్య మొత్తం పదహారు తిథులే పదహారు కళలు.

**"దర్శాద్యాః పూర్ణిమాం తాశ్చ కలాః పంచ దశైవ తు**
**షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ"**

అమావాస్య మొదలు పూర్ణిమ వరకు గల కళలు పదిహేను, పదహారవ కళ షోడశి. సచ్చిదానంద స్వరూపిణి అయి ఉన్నది. ఈ తిథుల పేర్లు వరుసగా 1. దర్శ 2. దృష్ట 3. దర్శత 4. విశ్వరూప 5. సుదర్శన 6. ఆప్యాయమాన 7. ఆప్యాయమాన 8. ఆప్యాయ 9. సూనృత 10. ఇర 11. అపూర్వమాణా 12. అపూర్వమాణా 13. పూరయంతి 14. పూర్ణ 15. పూర్ణమాసి.

ఈ పదిహేను చంద్రకళలకు పదిహేను నిత్యలే అధిదేవతలు. పదహారవ కళ సాదాఖ్యకళ, తానే సర్వస్వానికి అధిదేవత. అన్నింటికీ అధి దేవత కామేశ్వరుడు. అధిష్ఠాత్రి కామేశ్వరి. వీటిలో మొదటి ఐదు కళలు ఆగ్నేయఖండము ఆరునుంచి పది వరకు గల కళలు సౌరఖండము, మిగిలిన ఐదు కళలు సోమఖండం. అందుకే ఈ మంత్రము సోమ సూర్య అనలాత్మకము అని చెప్పబడింది.

కుండలినీ ప్రబోధము రాత్రులందే జరుగుతుంది. పగటిపూట మాత్రం కాదు. రాత్రులందే మధువు సిద్ధిస్తుంది. అందుచేత శుక్లపక్షంలోని పగళ్ళు, రాత్రులు పేరు తెలుసుకుని కుండలినీ ప్రబోధము చేసిన వారికి మాత్రమే బైందవ స్థానంలో సుధాసింధువు సిద్ధిస్తుంది. అతని కోరికలు నెరవేరుతాయి. ఈ విషయం తెలియని వారికి సుధాసింధువు సిద్ధించదు. కోరికలు ఈడేరవు.

ఈ రకంగా చాలామంది ఈ మంత్రాన్ని ఉపాసన చేసినప్పటికి

**"ఏవం ద్వాదశాధాభిన్నా శ్రీమత్పంచదశాక్షరీ"**

అనే వాక్యాన్ని బట్టి గతంలో చెప్పిన పన్నెండు మందీ, వివిధ రకాలుగా ఈ మంత్రోపాసన చేయటం జరిగింది. అయినప్పటికీ మన్మథుడు ఉపాసించిన మంత్రము, లోపాముద్ర ఉపాసించిన మంత్రాలే వీటన్నింటిలోనూ ప్రసిద్ధి చెందాయి. కామరాజయిన మన్మథుడు ఉపాసించినది కాది విద్య. లోపాముద్ర ఉపాసించినది హాది విద్య. పంచదశీ మహామంత్రం క కారంతో మొదలైతే కాది విద్య అనీ, హ కారంతో మొదలైతే హాదివిద్య

అని చెప్పబడింది. హాదివిద్యలో యమనియము లుంటాయి. కాదివిద్యలో అవి ఉండవు. ధర్మాచరణ విషయంలో స్వేచ్ఛ ఇవ్వబడింది. ఈ రెండు విద్యలలోనూ కాదివిద్య శ్రేష్ఠమైనది. ఈ మంత్రంలోని మూడు భాగాలను మూడు కూటాలు అంటారు.

1. మొదటి ఖండము వాగ్భవకూటము 2. రెండవ ఖండము కామరాజకూటము 3. మూడవ ఖండము శక్తి కూటము.

అరుణోపనిషత్తులో ఈ విధంగా చెప్పబడింది.

*పుత్రో నిర్వత్యా వైదేహః అచేతాయశ్చ చేతనః*
*సతం మణివిందత్ సోనం గులి రావయత్*
*సోగ్రీవః ప్రత్యముంచత్ ! సోజిహ్వా అసశ్చత్*
*నైత మృషింవిదిత్వా నగరం ప్రవిశేత్ ! యది ప్రవిశేత్॥*

నిర్వృతి అనబడు లక్ష్మీదేవి యొక్క పుత్రుడు వైదేహుడు. ఇతడే మన్మధుడు. ఇతను శరీరము లేనివాడు. కాబట్టి చలనము లేదు. కదలలేడు. కాని సర్వాంతర్యామి కావటంచేత చలనము కలిగి ఉన్నాడు. ఇటువంటి మన్మధుడు ప్రసిద్ధమగు శ్రీవిద్యారత్నమను మణిని సంపాదించి మెడన ధరించాడు. వేళ్ళులేని వాడైనప్పటికీ ఈ మంత్రాన్ని బయటకు చెప్పి మెడన ధరించాడు. అంతేకాదు నాలుక లేకపోయినప్పటికీ దీని ఫలాన్ని ఆస్వాదించాడు. మన్మధుడు శ్రీవిద్యామణిని మెడన ధరించి చిరకాలము పూజించి తరించాడని చెప్పబడుతోంది.

అయితే శ్రీచక్రనగరంలోకి ప్రవేశించాలంటే ఋషి అవసరంలేదు. ఎందుకంటే శ్రీవిద్యలో ఋషి ఛందస్సు నిషేధింప బడ్డాయి. అనగా శ్రీవిద్యలో బాహ్యపూజలేదు. అంతర్పూజ మాత్రమే చెయ్యాలి. ఋషి, ఛందస్సు చెప్పి చేసే బాహ్యపూజ మూడు వర్ణాల వారికి నిషేధింప బడింది. 'సనత్కుమారసంహిత'లో

*బాహ్య పూజా న కర్తవ్యా బాహ్య జాతిభిః ।*
*సా క్షుద్రఫలదా (క్షుద్రధర్మదా) నృణాం ఐహికార్థైక సాధనాత్॥*
*బాహ్య పూజారతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః ।*
*దిగంబరాశ్చేతిహాసాః (వీతవాసాః) వామకా స్తంత్రవాదినః॥*
*ఆంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః ।*
*జీవన్ముక్తా శ్చరం త్యేతే త్రిషు లోకేషు సర్వదా॥*

మొదటి మూడు వర్ణముల వారికి బాహ్య పూజ పనికిరాదు. నాల్గవ వర్ణము వారే బాహ్యపూజ చెయ్యాలి. ఐహిక ఫలాన్ని ఇచ్చినప్పటికీ బాహ్యపూజ క్షుద్ర ఫలాన్ని ఇస్తుంది. కౌళులు, కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు, వామాచారులు, తాంత్రికులు మాత్రమే బాహ్యపూజ చేస్తారు. వైదికులు, బ్రహ్మజ్ఞానులు అంతఃపూజ మాత్రమే చేస్తారు. వీరు మూడు లోకాల్లోనూ జీవన్ముక్తులై సంచరిస్తూ ఉంటారు. బ్రహ్మజ్ఞానులనే సమయాచారులు అని కూడా అంటారు. వీరికి శుభాగమ పంచకము ప్రమాణము. ఈ మంత్రము యొక్క అనుష్ఠానము అతిగోప్యము.

ఈ విషయాన్ని శంకర భగవత్పాదుల వారు సౌందర్యలహరిలోని ముప్పైరెండవ శ్లోకంలో వివరించారు.

## చక్ర, కళా మంత్ర కోణముల ఐక్యత

*'త్రిఖండ స్త్వన్మంత్ర స్తవచ సరఘాయాం నివిశతే*
*శ్రియోదేవ్యాః శేషో యుత ఇహసమస్తాః శశికళాః!*
*త్రిఖండే త్రైఖండ్యం నివసతి సమంత్రే చ సుభగే*
*షడబ్జారణ్యానీ, త్రితయయుత ఖండే నివసతి॥* **23**

పంచదశీమహామంత్రం మూడు ఖండాలుగా ఉన్నది. బైందవస్థానము అనబడే సుధాసింధువులో ఆ పరాశక్తి ఉన్నది. ఈ విషయాన్ని భైరవయామళం, వామకేశ్వర తంత్రం, బహురూపాష్టకాలలో కూడా చెప్పటం జరిగింది.

*'బిందుస్థానం సుధా సింధుః పంచయోన్య స్సుర ద్రుమాః!*
*తత్రైవ నీపశ్రేణీచ, తన్మధ్యే మణిమంటపమ్॥*
*తత్ర చింతామణి కృతం దేవ్యా మందిర ముత్తమమ్।*
*శివాత్మకే మహామంచే మహేశా నోపబర్హణే॥*

బిందుస్థానమే సుధాసింధువు. పంచయోనులే కల్పవృక్షాలు. అక్కడ కదంబవనం మధ్యన, మణిమంటపంలో, చింతామణులతో నిర్మించిన మందిరంలో శివాకారమైన మంచంమీద పరమశివునితో కలిసి ఆ దేవి సుఖిస్తున్నది. ఇదే విషయాన్ని

*'సుధాబ్ధౌ నందనోద్యానే, రత్నమంటప మధ్యమాం*
*బాలార్కమండలాభాసాం, చతుర్బాహూం త్రిలోచనామ్॥*

అని కూడా చెప్పటం జరిగింది. వీటిని బట్టి ఆ భగవతి సుధాసింధువులో ఉన్నది. అక్కడే పదహారు చంద్రకళలు ఉన్నాయి. షట్చక్రాలలో సంచరించే దేవి మూడు భాగాలు ఉన్న పంచదశీమహామంత్రంలో ఉన్నది. అంతేకాని షట్చక్రవనంలో పదహారవ కళ లేదు.

ఈ మంత్రంలో ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తుల, త్రిమూర్తులు తత్త్వాలు, సత్వ రజస్ తమో గుణాలు, విశ్వతైజస ప్రాజ్ఞ అనే వృత్తత్రయాలు, జాగ్ర స్వప్న సుషుప్తి అనే అవస్థలు కలిసి ఉన్నాయి. అని చెప్పటానికే 'త్రిఖండము" అనే పదం వాడటం జరిగింది.

నాద బిందుకళాత్మకమగు శ్రీచక్రము త్రిఖండము. సాదాఖ్యకళ నాదబిందుకళాతీతము. షోడశ నిత్యలు, షోడశకళలు విశుద్ధి చక్రంలోనూ, షోడశారంలోనూ తూర్పు నుంచి సవ్య మార్గంలో తిరుగుతుంటాయి. గతంలో పదిహేడవ శ్లోకంలో చెప్పినట్లుగా త్రికోణాది చక్రాలు షట్చక్రాలతో ఐక్యము పొందుతున్నాయి. వీటిలో భగవతి సంచరిస్తూ ఉంటుంది.

## మాతృకా నిలయ నిరూపణము

*(కళా మంత్ర యంత్రాలకు ఐక్యము)*

***త్రయం చైతత్స్వాంతే పరమశివ పర్యంక నిలయే***
***పరే సాదాఖ్యేఽస్మిన్ని వసతి చతుర్ధైక్య కలనాత్ !***
***స్వరాస్తే లీనాస్తే భగవతి కళాశ్రే చ సకలాః***
***కకారాద్యావృత్తే తదను చతురశ్రే చ యముఖాః 24***

భగవతి సుధాసింధులోని మణిద్వీపంలో చింతామణి గృహంలో త్రికోణాకార మంచం మీద పరమశివునితో కూడి ఉన్నదని చెప్పబడింది. శ్లోకంలోని మొదటి పాదంలో పరమశివ పర్యంకనిలయే అని సంబోధించారు గౌడపాదులవారు. శంకర భగవత్పాదులు కూడా సౌందర్యలహరిలోని ఎనిమిదవ శ్లోకం అయిన 'సుధాసింధోర్మధ్యే' అని చెబుతూ మూడవ పాదంలో ఇదే మాట శివాకారే మంచే 'పరమ శివ పర్యంక నిలయామ్ అన్నారు. అంటే ఆదేవి పరమశివుని పర్యంకమున అన్నదని అర్థం. శ్రీచక్ర నిరూపణంలో మొత్తం తత్త్వాలు ఇరవైఅయిదు అని చెప్పబడింది. అవి

| | | | |
|---|---|---|---|
| 1. | పంచభూతాలు | - | 5 |
| 2. | తన్మాత్రలు | - | 5 |
| 3. | జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 4. | కర్మేంద్రియాలు | - | 5 |
| 5. | మనస్సు | - | 1 |
| 6. | మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| | | మొత్తం | 25 |

వీటిలో ఇరవై ఐదవ తత్త్వమయిన సదాశివునితో దేవి కలసి ఉన్నది. ఇది ఇరవై ఆరవ తత్త్వము. ఈ తత్త్వాన్నే 'సాదాఖ్య' అంటారు.

*త్రికోణే బైందవం శ్లిష్టం, అష్టారేఽ ష్టదళాంబుజమ్*
*దశారయోష్షోడశారం భూగృహం భువనాశ్రకే ॥*

| | | | |
|---|---|---|---|
| 1. | బిందువుకు | - | త్రికోణంతో ఐక్యములు |
| 2. | అష్టకోణానికి | - | అష్టదళపద్మంతో ఐక్యము |
| 3. | దశకోణాలకు | - | షోడశదళ పద్మంతో ఐక్యము |
| 4. | చతుర్దశ కోణాలకు | - | భూగృహంతో ఐక్యము |

అదే విధంగా స్వరాలు అంటే అచ్చులు పదహారు. కళలు పదహారు. నిత్యలు పదహారు. ఇవన్నీ కూడా షోడశదళంలోని పదహారు దళాలతోనూ కలిసిపోతున్నాయి.

మూలవిద్య కకారంతో మొదలవుతుంది. క నుంచి మ వరకు గల అక్షరాలు వృత్తాలలో ఉన్నాయి. య ర ల వ, శ ష స హ అనే ఎనిమిది అక్షరాలు చతురస్రంలో ఉన్నాయి.

ఆజ్ఞాచక్రంలో రెండు దళాలున్నాయి. వీటిలోని ఒక దళంలో అష్టదళము, రెండవ దళంలో షోడశదళము ఉన్నాయి. అజ్ఞాచక్రానికి పైన బైందవగృహం ఉంది. షోడశదళంలో స్వరాలు (అచ్చులు) ఉంటాయి. అంతస్థములు, ఊష్మములు (య ర ల వ శ ష స హ) చతురస్రంలో ఉంటాయి. చంద్రసూర్యాగ్నులు అనబడే తేజస్త్రిత్రయము సాదాఖ్యలో లీనమవుతుంది. అనుస్వారాలు బిందువులో ఉంటాయి.

దీన్నే చక్ర మంత్రములకు ఐక్యము అంటారు. అసలు శ్రీచక్రమే పంచదశీ మహా మంత్రం నుంచి పుట్టింది. అని భాస్కరరాయలవారు తమ **'వరివస్యారహస్యం'** లో అన్నారు.

**కత్రి తయాదీ కారాద్బిందుర్జాత స్తదగ్రిమేచక్రే**

**హృల్లేఖాభి స్తత్పర చక్ర త్రితయం హకారాభ్యామ్.**

**ఏకారేణచ తత్పర చక్రేజాతే సకారాభ్యామ్**

**చతురశ్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్రజనిః**

1. శ్రీవిద్య యందలి మూడవ క కారము వల్ల, ఈ కారము వల్ల – బిందువు పుట్టింది.

2. మూడు హ్రీంకారాల వల్ల – త్రికోణము, అష్టకోణము పుట్టాయి.

3. రెండు ల కారములు, ఏ కారము వల్ల – అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము పుట్టాయి.

4. రెండు సకారముల వల్ల – అష్టదళము, షోడశదళము పుట్టాయి.

5. ల కారము వల్ల – భూపురత్రయము పుట్టింది. చంద్రకళ అనేది పదహారవ కళ అయిన సాదాఖ్యకళ. చంద్రకళానుష్ఠానము అంటే మాతృకామంత్రముల ఐక్యము.

మూల మంత్రము, శ్రీచక్రము రెండూ ఒకటే. శ్రీచక్రంలో షోడశ నిత్యలు ఉన్నాయి. ఈ నిత్యలు ప్రతిపత్తు మొదలైన కళలే. ఈ రకంగా చక్రానికి, కళలకు ఐక్యము కలుగుతుంది. ఇది సమయమత సిద్ధాంతము. అలాగే

| | | |
|---|---|---|
| 1. షోడశ నిత్యలు | – | మంత్రంలో గల పదహారు అక్షరాలతోనూ |
| 2. అక్షరాలు | – | పదిహేను అక్షరాల మంత్రంతోనూ |
| 3. చంద్రుని కళలు | – | 16 |
| సూర్యుని కళలు | – | 24 |
| అగ్ని కళలు | – | 10 |
| ఈ మొత్తం | – | 50 కళలు. అక్షరాలతోను |
| 4. చంద్ర, సూర్య అగ్నులు | – | త్రిఖండములలోను. |

ఐక్యము పొందుతున్నారు. ఈ రకంగా కళా, యంత్ర, మంత్రాలకు ఐక్యము ఉన్నది.

ఈ విషయాన్ని శంకరభగవత్పాదులు సౌందర్యలహరిలోని 9, 32 శ్లోకాలలో వివరించారు.

## తిథుల స్వరూపాలు

***ఆలో బిందు ర్వర్గాష్టక మిభదళం శాంభవవపుః***
***చతుశ్చక్రం శక్రస్థిత మనుభయం శక్తి శివయోః***
***నిశాద్యా దర్శాద్యాః శ్రుతినిగదితాః పంచ దశధా***
***భవేయుర్నిత్యాస్తా స్తవజనని మంత్రాక్షరగణాః ॥ 25***

మహేశ్వర సూత్రాల ప్రకారం పాణిని వ్యాకరణం చెప్పాడు. సంస్కృత భాషకు అక్షరాలు యాభై. ఇవి మొత్తం ఎనిమిది వర్గులుగా ఉన్నాయి. ఇవి అ, క, చ, ట, త, ప య, శ వర్గులు. వీటిలో స్పర్శలు అంటే క చ ట త ప వర్గులు పాశాంకుశ బీజములతో కలసి అష్టకోణము, దశారయుగ్మములలో ఉంటాయి. మిగిలిన తొమ్మిది అక్షరాలు య ర ల వ శ ష స హ ళ రెండు ఆవృతులు కాగా 9 × 2 = 18 అవుతాయి. అప్పుడు పధ్నాల్గు అక్షరాలు చతుర్దశ కోణంలోను మిగిలిన నాలుగు అక్షరాలు శివ చక్రాలలోను ఉంటాయి. క్ష కారము అని శక్తులకు సమానము. అది సర్వత్ర ఉంటుంది. బిందువు, విసర్గ, త్రికోణంలో ఉంటాయి. శివచక్రాలలో కనుక చూసినట్లయితే అష్టదళంలో అష్టవర్గులు ఉంటాయి. షోడశదళంలో స్వరాలు, మూడు వృత్తాలలోనూ స్పర్శలు (క చ ట త ప వర్గులు), చతురస్రంలో అంతస్థములు, ఊష్మాణములు ఉంటాయి.

***"దర్శాద్యాః పూర్ణిమాం తాశ్చ కలాః పంచ దశైవతు***
***షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ"***

దర్శ మొదలు పూర్ణిమ వరకు కళలు పదిహేను, పదహారవ కళ చిద్రూప. సచ్చిదానందరూపిణి అయి ఉన్నది. తిథులు ఆరోజున ఉండే చంద్రకళలు వాటి తత్వములు, నిత్యలు, మంత్రబీజములు ఈ క్రిందివిధంగా ఉంటాయి.

| వరుస నెం. | తిథులు చంద్రకళలు | తత్త్వము | నిత్య | మూలమంత్రములోని బీజము |
|---|---|---|---|---|
| 1. | దర్శ | శివ | కామేశ్వరి | క |
| 2. | దృష్ట | శక్తి | భగమాలిని | ఏ |
| 3. | దర్శత | మాయ | నిత్యక్లిన్న | ఈ |
| 4. | విశ్వరూప | శుద్ధవిద్య | భేరుండ | ల |
| 5. | సుదర్శన | జలము | వహ్నివాసిని | హ్రీం |

| వరుస నెం. | తిథులు చంద్రకళలు | తత్త్వము | నిత్య | మూలమంత్రములోని బీజము |
|---|---|---|---|---|
| 6. | ఆప్యాయమాన | తేజస్సు | మహావజ్రేశ్వరి | హ |
| 7. | ఆప్యాయమాన | వాయువు | రౌద్రి (శివదూతీ) | స |
| 8. | ఆప్యాయ | మనస్సు | త్వరిత | క |
| 9. | సూనృత | పృథివి | కులసుందరి | హ |
| 10. | ఇర | ఆకాశం | నిత్య | ల |
| 11. | అపూర్వమాణ | విద్య | నీలపతాక | హ్రీం |
| 12. | అపూర్వమాణ | మహేశ్వర | విజయ | స |
| 13. | పూరయంతి | పరతత్త్వ | సర్వమంగళ | క |
| 14. | పూర్ణ | ఆత్మతత్త్వ | జ్వాలామాలిని | ల |
| 15. | పౌర్ణమాసి | సదాశివ | చిత్ర | హ్రీం |

దీని ప్రకారం ఆయా తిథుల యందు ఆయా దేవతలను ఉపాసన చేస్తారు. పదహారవ కళ చిద్రూప. ఈమే మహాత్రిపురసుందరి. ఈమెను మాత్రం అన్ని తిథులందు ఉపాసించాలి. ఈ కళలన్నీ సూర్యునిలో ఉంటాయి.

శుక్లపక్ష పాడ్యమి నుండి పౌర్ణమి వరకు ప్రతిరోజూ ఒక్కొక్కకళ చొప్పున సూర్యుణ్ణి వదలి చంద్రునిలో చేరుతుంది. ఆ విధంగా పదిహేను కళలు చంద్రునిలో చేరినప్పుడే పౌర్ణమి. మళ్ళీ కృష్ణపాడ్యమి నుంచి ఒక్కొక్క కళ చంద్రుని నుండి విడిపోయి సూర్యునిలో చేరుతుంది. ఈ విధంగా పదిహేను కళలూ చంద్రుని విడిచి వెళ్ళినప్పుడే అమావాస్య.

ఈ నిత్యలు తిథినిత్యలుగా పిలవ బడతాయి. శుద్ధ పాడ్యమిన చంద్రుని చేరిన కామేశ్వరీనిత్య, మళ్ళీ అమావాస్యనాడు చంద్రుని వదలి వెళ్ళిపోతుంది. అంటే ఈ నిత్యలు శుక్ల పక్షంలో కామేశ్వరినుంచి, కృష్ణపక్షంలో చిత్రనుంచి తిరుగుతూ ఉంటాయి. ఎటునుంచి చూసినా తిథిమారనినిత్య త్వరితానిత్య. ఇది అష్టమి తిథిన ఉంటుంది. అందుకనే దేవినెత్తిన ఉన్న చంద్రకళ అష్టమి నాటి కళ అయింది. ఈ విషయం లలితా సహస్రంలోని 'అష్టమీచంద్ర విభ్రాజదళికస్థల శోభితా' అనబడే పదిహేనవ నామంలో వివరించబడింది.

శ్రీవిద్యా ఉపాసన రాత్రిపూటే ఫలిస్తుంది. దీనికి కారణము చంద్రకిరణాల నుండి అమృత ధారలు వర్షించేది రాత్రులందే కాని పగలు కాదు. కృష్ణపక్ష రాత్రులలో చంద్రుడు

దినదినము క్షీణిస్తూ ఉంటాడు. అంటే ఆధారచక్రంలోకి పోతాడు. సమయాచారులకు ఆధారచక్రంలో పూజలేదు. శుక్లపక్ష రాత్రులందే చంద్రకళాసంచారముంటుంది. కాబట్టి ఆ సమయంలోనే కుండలినీ ప్రబోధము కలుగుతుంది. శుక్లపక్ష రాత్రులలో చంద్ర కళలున్నప్పుడే చతుర్విధైక్య సంధానము జరుగుతుంది. అందుకనే పగటిపూట, అమావాస్య నాడు దేవీ ఉపాసన నిషిద్ధము. ఇది సమయమత రహస్యము.

## సాదాఖ్యకళ

***ఇమాస్తాః షోడశ్యాస్తవచ సరఘూయాం శశికళా***
***స్వరూపాయాం లీనా నివసతి తవశ్రీ శశికళా***
***అయం ప్రత్యాహరః శ్రుత ఇహ కళా వ్యంజనగణః***
***కకారేణాకారః స్వరగణ మశేషం కథయతి ॥ 26***

నిత్యలు మొత్తం పదహారు వీటిని గతంలో వివరించటం జరిగింది. వీటిలో పదిహేను నిత్యలు చంద్రకళలలో లీనమవుతున్నాయి. పదహారవ కళ సాదాఖకళ. ఇది నాదబవిందు కళాతీతమైనది.

భగవతి యాభై అక్షరముల స్వరూపము. అక్షరములు అ క చ ట త ప య శ అను ఎనిమిది వర్గులుగా ఉన్నాయి. ఈ వర్గులు వరుసగా వశిన్యాది శక్తులతో కలిసి శివచక్ర చతుష్టయము, శక్తిచక్ర పంచకముతో ఐక్యము పొందుతున్నాయి.

పంచదశీ మహామంత్రంలో మొదట క కారము చెప్పటం వల్ల, క కారము తర్వాత ఉన్న అక్షరములన్నీ తీసుకోబడుతున్నాయి. అలాగే ఏకారము వలన ఆ వర్గులోని మొత్తము అక్షరాలన్నీ తీసుకొనబడుతున్నాయని సిద్ధాంతము. మంత్రంలో మొదటి అక్షరము క చివరి అక్షరము ల కాబట్టి ఈ రెండింటి మధ్యన ఉన్న అక్షరాలన్నీ గ్రహించబడినాయి. హల్లులకు స్వతంత్ర ప్రతిపత్తి లేదు. అచ్చులతో కలిస్తేనే వాటికి మనుగడ. కాబట్టే హల్లులు స్వరాలకు అంగాలుగా చెప్పబడుతున్నాయి. అందుకే క కారము నుంచి ల కారము వరకు గల అక్షరములను కళ అనటం గౌణ ప్రయోగంగా చెప్పబడుతోంది.

గతంలో చెప్పినట్లుగా అక్షరములు అ నుంచి అః వరకు క నుంచి త వరకు, థ నుంచి స వరకు ఒక్కొక్క ఖండానికి పదహారు చొప్పున మూడుఖండాలుగా ఉన్నాయి. ఇవి అన్నీ షోడశ నిత్యలలో అంతర్ధాన మవుతున్నాయి. హ కారము బైందవాకాశమున,

ళ కారము బిందువునందు. క్ష కారము క ష లయొక్క సంయుక్తాక్షరమవటం చేత సర్వత్ర చెప్పబడుతోంది. ఈ రకంగా సంస్కృత భాషలోని అక్షరాలన్నీ మూలమంత్రంలో చేరి ఉన్నాయి. అగ్నిఖండంలో పది, సూర్యఖండంలో ఇరవైనాలుగు, సౌమ్య ఖండంలో పదహారు మొత్తం యాభై కళలు యాభై అక్షరాలతో ఐక్యము చెందుతున్నాయి. బైందవ స్థానానికి శ్రీచక్రము అనీ, సరఘ అనీ పేర్లున్నాయి. సహస్రారంలో ఉన్న చంద్రమండలమే సరఘ అని పిలవబడుతోంది. ఇదే పదహారవ కళ సాదాఖ్య కళ. చిద్రూప అయి ఉన్నది.

శ్రీచక్రరూపమైన చంద్రబింబంలో ఒకే కళ ఉన్నది. అది పరమాకళ. ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రునికి పదిహేను కళలున్నాయి. పదహారవది పరమాకళ. ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రుని భిన్నమైన చంద్రుడు సహస్రారంలో ఉన్నాడు. ఇదే బైందస్థానము, సుధాసింధువు, సరఘ అని పిలవబడుతోంది. ఇక్కడ ఉన్నది ఇరవైఐదు తత్త్వములకు అతీతమైన ఇరవైఆరవ తత్త్వము, శివశక్తుల సమ్మేళనము అయిన సాధాఖ్యకళ. పరబ్రహ్మమహిషి.

## మణిపూరం

***క్షకారః పంచాశత్కల ఇతి హాలో బైందవగృహం***
***క్షకారా దూర్ధ్వం స్యాజ్జనని తవ నామాక్షరమితి***
***భవేత్పూజాకాలే మణిఖచిత భూషాభిరభితః***
***ప్రభాభిర్వ్యాలీఢం భవతి మణిపూరం సరసిజమ్ ॥ 27***

వర్ణసమామ్నాయంలో క్ష కారము యాభైవది. ఇది సర్వవర్ణాత్మకమై సర్వత్ర వ్యాపించినది. హ కార ళ కారములు బైందవస్థానంలో ఉన్నాయి. మంత్రములో మొదటి అక్షరము 'క' చివరి అక్షరము 'ళ' తో కలియుట వల్ల కళ అవుతోంది. ఇది దేవి యొక్క నామము అని గ్రహించాలి. దీన్నే బ్రహ్మవిద్య, శ్రీవిద్య, చిత్కళ, చంద్రకళ, సాదాఖ్య, సమయ, పరా, చిద్రూప అని వేరు వేరు పేర్లతో పిలుస్తారు.

మణిపూరం షట్చక్రాలలో మూడవది. జలతత్త్వాత్మకమైనది. మణులు పొదిగిన ఆభరణములతో ఉన్నది కాబట్టి మణిపూరము అంటారు. ఇది సూర్యఖండము. సూర్యుని కిరణాలు ఇక్కడ ఉన్న జలం మీద పడి ఇంద్రధనుస్సు కనిపిస్తుంది. స్వతహాగా కూడా అంధకార బంధురమే. కాని ఇక్కడ స్థిరసౌదామినీత్వము స్ఫురణకు వస్తుంది. ఇక్కడకనిపించే ఇంద్రధనుస్సుకు అల్లెత్రాడు ఉండదు. సిద్ధఘటికలో చెప్పినట్లుగా

*మణిపూరైక వసతిః ప్రావృషేణ్య స్సదాశివః ।*
*అంబుదాత్మతయా భాతి స్థిరసౌదామినీ శివా ॥*

సూర్యకిరణాలు మేఘత్వం పొంది జలరూపంలో ఆధార స్వాధిష్ఠానాల మధ్య ఉన్నాయి. అంటే మణిపూరంలో జలరూపంలో ఉన్నాయి. మణిపూరంలో భగవతికి స్థిరసౌదామినీత్వము సూచించబడింది. ఇక్కడ ఉండే జలము స్వాధిష్ఠానంలో అగ్నిని, అనాహతంలో సూర్యుని, ఆజ్ఞాచక్రంలో చంద్రుని ఉత్పన్నము చేస్తుంది. దీన్నే శంకర భగవత్పాదులు 'మణిపూరైకశరణమ్' అని సౌందర్యలహరిలో అన్నారు.

*తటిద్వంతం శక్త్యా తిమిరపరిపంథిస్ఫురణయా*
*స్ఫురన్నానారత్నాభరణపరిణద్ధేంద్రధనుషమ్*
*తవ శ్యామం మేఘం కమపి మణిపూరైక శరణం*
*నిషేవే వర్షన్తం హరమిహిరతప్తం త్రిభువనమ్ ॥*

సాధకుడు షడ్విధైక్యసంధానము చేసినట్లయితే ఆధార స్వాధిష్ఠానాలను భేదించుకుని భగవతి మణిపూరంలో ప్రవేశిస్తుంది. అక్కడ ఆమె దశభుజ. సాధకుడు చతుర్విధైక్యసంధానము చేస్తే భగవతి చతుర్భుజగా దర్శనమిస్తుంది. సాధకుడు భగవతిని ఇక్కడే సాన్నిధ్యము కావించుకోవాలి. అందుకే సమయమతస్థులు మణిపూరంలో దేవిని ఉపాసన చేస్తారు. ఇది సమయమతసిద్ధాంతము. ఇక్కడ దేవికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి షోడశోపచార పూజ చేయ్యాలి.

## అనాహతం

*వదంత్యేకే వృద్ధా మణిరితి జలం తేన నిబిడం*
*పరేతు త్వద్రూపం మణిధనురితీదం సమయినః!*
*అనాహత్యా నాదః ప్రభవతి సుషుమ్నా ధ్వజనిత*
*స్తదా వాయో స్తత్ర ప్రభవ ఇద మాహుః సమయినః ॥* **28**

షట్చక్రాలలో మూడవ చక్రాన్ని మణిపూరం అంటారని గతంలోనే చెప్పటం జరిగింది. ఇది మణులుండే ప్రదేశం కాబట్టి మణిపూరము అంటారు. మణులు పొదిగిన ఆభరణములతో ఉన్నది కాబట్టి మణిపూరము అని మరికొందరంటారు. ఇది జలతత్త్వాత్మకమనీ, ఇచ్చట సూర్యకిరణాలు నీటిమీద పడి ఇంద్రధనుస్సు ఏర్పడుతుందని చెప్పాము. ఆ ఇంద్రధనుస్సుకు అల్లెత్రాడు ఉండదు. సమయాచారులకు మణిపూరంలో

భగవతిరూపమే ఇంద్రధనుస్సు. ఇదే మణి ధనుస్సు షట్చక్రాలలో నాల్గవది అయిన అనాహతం నుండి నాదం బయలు దేరుతుంది. అనాహతము వాయుతత్త్వాత్మకమైనది. సుషుమ్నా మార్గంలో జన్మించిన నాదము అనాహతంలో బయటకు వస్తుంది. అంటే అనాహతం లోకి వాయువు రాగానే నాదము వినిపిస్తుంది.

అనాహతంలో శివశక్తులు రాజహంసల రూపంలో ఉంటారు. ఉపాసకలు అ హంస మిధునాన్నే ఆరాధిస్తారు. యోగ శాస్త్ర ప్రక్రియలో ప్రాణులందరికీ హృదయ కమలంలో విహరించే రాజహంసల జంట శివశక్తుల రూపమని 'యోగానుశాసనము' అను గ్రంథంలో చెప్పబడింది.

***అనుపమ మను భృతి స్వాత్మ సంవేద్య మాద్యం***
***వితత సకల విద్యాలాప మనోన్య ముఖ్యమ్***
***సకల నిగమ సారం సోహ మోంకార గమ్యమ్***
***హృదయ కమల మధ్యే హంస యుగ్మం నమామి॥***

ఇది సమయ మతంలో ఒక శాఖవారి అభిప్రాయం అయితే ఇంకొందరి అభిప్రాయం ప్రకారం అనాహతంలో పరమేశ్వరుడు అగ్నిజ్వాలా రూపుడై జ్వాలా రూపిణి అయిన శక్తితో దీపాంకురములాగా ప్రకాశిస్తుంటాడు. ఈ అభిప్రాయాన్ని సుభగోదయ వ్యాఖ్యలో శంకర భగవత్పాదుల వారు ఈ విధంగా వ్రాశారు.

***"శిఖి జ్వాలారూపః సమయ ఇహ సై వాత్ర సమయా ।***
***తయో సంభేదో మే దిశతు హృదయాబ్జైక నిలయః॥"***

అనాహత చక్రంలో అగ్నిజ్వాలా రూపుడైన పరమేశ్వరుడు సమయుడు. జ్వాలారూపిణి అయిన పరమేశ్వరి సమయ. ఈ సమ్మేళనము నాహృదయ పద్మమందు నిలచి సదానన్ను అనుగ్రహించు గాక. ఈ అభిప్రాయాన్నే లక్ష్మీధరులు కూడా నిర్ధారించారు. అనాహత చక్రాన్నే సంవిత్కమలం అంటారు. ఈ విషయాన్ని శంకరులు సౌందర్యలహరిలోని 38వ శ్లోకంలో వివరించటం జరిగింది.

***సమున్మీలత్సంవిత్కమల మకరందైకరసికం***
***భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరం***
***యదాలాపాదష్టాదశగుణితవిద్యా పరిణతి***
***ర్యదాదత్తే దోషాద్గుణమఖిలమద్భ్యః పయ ఇవ ॥***

## విశుద్ధిచక్రం

*తదేతత్తే సంవిత్కమలమితి సంజ్ఞాంతరముమే*
*భవేత్సంవిత్పూజా భవతి కమలేఽస్మిన్ సమయినామ్!*
*విశుద్ధాఖ్యే చక్రే వియదుదితమాహుః సమయినః*
*సదాపూర్వోదేవః శివ ఇతి హిమానీ సమతనుః* **29**

అనాహత చక్రాన్నే సంవిత్కమలం అంటారు. ఇక్కడ దేవికి సంవిత్పూజ జరుగుతుంది.

విశుద్ధిచక్రం ఆకాశ తత్త్వాత్మకమైనది. ఇది పదహారు దళాలు గల పద్మము. శివుడు తెల్లని శరీరచ్ఛాయ కలిగిన ఆకాశ తత్త్వాత్మకుడు. ఇక్కడ శుద్ధ స్ఫటికము వలె స్వచ్ఛమైనవాడు, ఆకాశ తత్త్వాత్మకుడు అయిన శివుడు, అతనితో సమానమైన దేవి ఉంటారు. అంటే ఇక్కడ శివాశివులు శుద్ధస్ఫటికాలవలె ప్రకాశిస్తూ ఉంటారు. విశుద్ధిచక్ర పూజలో ప్రాణాయామం చెయ్యటం వల్ల కాంతులు కోల్పోయిన షోడశ కళలకు శివాశివుల శరీరము నుండి బయటకు వచ్చిన కాంతిచేత మళ్ళీ ప్రకాశము కలుగుతుంది. అంటే సాధకుడికి అజ్ఞానము పోగొట్ట బడుతుంది. ఈ విషయాన్ని శంకర భగత్పాదులవారు తమ సౌందర్యలహరిలోని 37వ శ్లోకంలో వివరించారు.

*విశుద్ధౌ తే శుద్ధస్ఫటికవిశదం వ్యోమజనకం*
*శివం సేవే దేవీమపి శివసమానవ్యవసితాం*
*యయోః కాంత్యా యాంత్యా శశికిరణసారూప్యసరణిం*
*విధూతాంతర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతీ ॥*

పురశ్చరణ క్రియలో అనాహతంలో త్రికోణం ఆరోపించి, సహస్రారము నుంచి బైందవ స్థానమున కల కామేశ్వరిని ఆరోపించి పురశ్చరణ చెయ్యాలి. ఇది సమయమత రహస్యము.

## సపర్య

*త్వదీయై రుద్ద్యోతైర్భవతిచ విశుద్ధాఖ్య సదనం*
*భవేత్పూజాదేవ్యా హిమకరకళాభిః సమయినామ్ !*
*సహస్రారే చక్రే నివసతి కళా పంచదశకం*
*తదేతన్నిత్యాఖ్యం భ్రమతి సితపక్షే సమయినామ్ ॥* **30**

విశుద్ధిచక్రంలో శివాశివుల శరీరం నుంచి వచ్చిన కాంతి కిరణాలు ఈ లోకాలన్నింటినీ ఆవరించి ఉన్నాయి. ఇవి మూడువందల అరవై కిరణాలు. ఇవే కాలాన్ని నిర్ణయిస్తున్నాయి. విశుద్ధి చక్రంలో చంద్ర కిరణాలు డెబ్బైరెండు ఉన్నాయి. ఇవి దేవి చరణాబ్జాల నుంచి పుట్టాయి అనాహతం నుండి దేవి విశుద్ధి చక్రం చేరి చెలులతో ముచ్చటిస్తూ ఉంటుంది. అప్పుడు ఆమెను శుద్ధ స్ఫటికాలతో పూజించాలి. శుద్ధ స్ఫటికాలు అంటే విశుద్ధి చక్రంలోని పదహారు దళాలే అని గుర్తించాలి. పదిహేను కళలు విశుద్ధి చక్రాన్ని ఆశ్రయించి తిరుగుతుండగా పదహారవ కళ సహస్రారంలో ఉంటుంది. ఇదే చంద్రకళ. దీన్ని సాదాఖ్యకళ, చిత్కళ, ఆనందరూపా, ఆత్మా అని వివిధములైన పేర్లతో పిలుస్తారు.

పదిహేను కళలు పదిహేను నిత్యలు. వీటిని శుక్లపక్ష రాత్రులందు మాత్రమే అర్చించాలని గతంలో చెప్పటం జరిగింది. పదిహేను నిత్యలు విశుద్ధిచక్రంలోనే ఉంటాయి.

విశుద్ధి చక్రంలో శుద్ధ స్ఫటికాలతో దేవిని అర్చించగానే, భగవతి ఆజ్ఞాచక్రం చేరుతుంది. ఆజ్ఞాచక్రంలో శివాశివులు కోట్లకొలది సూర్యచంద్ర కాంతులతో ప్రకాశిస్తూ ఉంటారు. లక్ష్మీధరులు **కర్ణావతంసస్తుతిలో**

***ఆజ్ఞాత్మక ద్విదళ పద్మగతే తదానీం***
***విద్యున్నిభే రవి శశి ప్రయుతోత్కటాభే***
***గండస్థలప్రతిఫల త్కరదీపజాల***
***కర్ణావతంసకలికే కమలాయతాక్షి ॥***

అన్నారు. ఆజ్ఞాచక్రం అనే ద్విదళ పద్మంలో దేవి మెరుపుతీగలాగా పదిలక్షల సూర్యచంద్రుల కాంతితో తామర పూలవలె విశాలమైన కనులు కలిగి ప్రకాశిస్తూ ఉంటుంది. సౌందర్యలహరిలోని ముప్పైఆరవ శ్లోకంలో శంకరభగవత్పాదులవారు ఆజ్ఞాచక్రంలో దేవిని ఈ విధంగా స్తుతించారు.

***తవాజ్ఞాచక్రస్థం తపనశశికోటిద్యుతిధరం***
***పరం శంభుం వందే పరిమిలితపార్శ్వం పరచితా***
***యమారాధ్యన్భక్త్యా రవిశశిశుచీనామవిషయం***
***నిరాతఙ్కే లోకో నివసతి హిభాలోకభవనే ॥***

ఆ విధంగా ఉన్న దేవి సౌదామిని వలె సహస్ర కమలం లోకి ప్రవేశించి

**సుధాబ్ధౌ నందనోద్యానే, రత్న మంటప మధ్యమాం**
**బాలార్క మండలాభాసాం, చతుర్బాహాం త్రిలోచనామ్ ॥**
**పాశాంకుశ శరాం శ్చాపం ధారయంతీం, శివాం శ్రియం**
**ధ్యాత్వాచ హృద్గతం చక్రం వ్రతస్థః పరమేశ్వరమ్ ॥**

సుధాబ్ధిలో, మణిద్వీపం మధ్యలో, చింతామణి గృహంలో త్రికోణాకార శక్తి మంచం మీద పరమ శివునితో కలసి దేవి సుఖిస్తూ ఉంటుంది.

**సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే**
**మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే**
**శివాకారే మఞ్చేపరమశివపర్యంకనిలయాం**

## శుక్లపక్షపూజ

**అతః శుక్లేపక్షే ప్రతిదిన మిహ త్వాం భగవతీం**
**నిశాయాం సేవంతే నిశి చరమభాగే సమయినః**
**శుచిః స్వాధిష్ఠానే రవిరుపరి సంవిత్సరసిజే**
**శశీ చాజ్ఞా చక్రే హరహరి విధి గ్రంథయ ఇమే॥** **31**

భగవతీ ! సమయమతస్థులు శుక్లపక్షపు తిథుల రాత్రులందు చివరి భాగములో అనగా తెల్లవవారు ఝాముననే ఉపాసన చేస్తారు. సమయమతం ప్రకారము స్వాధిష్ఠానంలో అగ్ని, ఆపైన రుద్రగ్రంథి, అనాహతంలో సూర్యుడు, ఆపైన విష్ణుగ్రంథి, ఆజ్ఞాచక్రంలో చంద్రుడు, ఆపైన బ్రహ్మగ్రంథి ఉన్నాయి.

శుక్లపక్షంలో రాత్రులందే కుండలినీ ప్రబోధము జరుగుతుంది. శరీరంలో ఇడ, పింగళ అని రెండు రకాల నాడీ మండలాలు ఉన్నాయి. దేవయానాత్మకమైన ఇడానాడీ మార్గంలో సూర్యుడు, పింగళా నాడీ మార్గంలో చంద్రుడు, సంచరిస్తూ ఉంటారు. నాడీ మార్గంలో చంద్రుడు సంచరిస్తున్నప్పుడు తన అమృతపు ధారలతో చంద్రుడు నాడీ మండలాన్ని తడుపుతూ ఉంటాడు. చంద్రునిచే స్రవింపచేయబడిన అమృతాన్ని సూర్యుడు హరించి వేస్తుంటాడు. సూర్యచంద్రులు ఆ రకంగా తిరుగుతూ నెలకు ఒకసారి ఆధార చక్రంలో కలుస్తారు. అప్పుడు సూర్యకిరణాలు చంద్రకాంతుల్ని కప్పివేస్తాయి. ఆరోజే

ఆమావాస్య. ఆ రోజున చంద్రకళలన్నీ చంద్రుని విడిచి సూర్యునిలోనికి ప్రవేశిస్తాయి. ఆధార చక్రంలో అమావాస్య రోజున కుండలినీశక్తి నిద్రావస్థలో ఉంటుంది. ఆ రోజున సమయాచారులకు పూజ నిషేధము. కౌళులు మాత్రం అమావాస్య రోజున ఉపాసన చేస్తారు. యోగి పద్మాసనంలో కూచుని కాలిమడమతో గుదస్థానాన్ని సంధించి వాయువును కుంభించి నట్లయితే అతని శరీరంలోని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు స్థంభించిపోతాయి. శరీరం అచేతనం అవుతుంది. అప్పుడు నాడీ మండలంలో సూర్యచంద్రుల గమనం ఆగిపోతుంది. ఎప్పుడైతే చంద్రుని గమనం ఆగిపోయిందో అప్పుడు అతడు అమృతధారలు స్రవించలేడు. అప్పుడు వాయువుచే ప్రేరేపించబడిన స్వాధిష్ఠానాగ్నిచేత అమృతకుండము ఎండిపోగా కుండలినీ శక్తి నిరాహార అవుతుంది. అప్పుడు ఆ శక్తి నిద్ర మేల్కొని రుద్ర, విషు బ్రహ్మగ్రంథులు మూడింటినీ దాటి సహస్రారం చేరి అక్కడ చంద్రమండలంలో గల సహస్రదళ పదాన్ని నోటితో కరచిపట్టుకోగా అకకడనుంచి అమృతధారలు స్రవించి మరల శరీరము లోని నాడీమండలం మొత్తాన్ని తడుపుతాయి. ఈ విధంగా కుండలినీ ప్రబోధము శుక్లపక్ష రాత్రులందే జరుగుతుంది.

ఈ శ్లోకంలోని రెండవ పాదంలో గౌడపాదా చార్యులు 'నిశిచరమభాగే' అని పద ప్రయోగం చెయ్యగా అదే విషయాన్ని శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలోని 87వ శ్లోకంలో 'నిశి చరమ భాగేచవిశదౌ' అని ప్రయోగించారు.

*హిమానీహంతవ్యం హిమగిరినివాసై కచతురౌ*
*నిశాయాం నిద్రాణం నిశి చ పరభాగే చ విశదౌ*
*పరం లక్ష్మీపాత్రం శ్రియమతి సృజంతౌ సమయినాం*
*సరోజం త్వత్పాదౌ జనని జయతశ్చిత్రమిహ కిమ్॥*

అంటే భగవతీ పూజ రాత్రిపూట చివరి భాగంలో అనగా తెల్లవారు ఝామున మాత్రమే చెయ్యాలి. ఇది సమయమత సిద్ధాంతము.

## అమావాస్య పూజా నిషేధము

*కళాయాః షోడశ్యాః ప్రతిఫలితబింబేన సహితం*
*తదీయైః పీయూషైః పునరధికమాప్లావిత తనుః!*
*సితేపక్షే సర్వా స్తిథయ ఇహకృష్ణేఽపిచసమా*
*యదా చామావాస్యా భవతి నహి పూజ సమయినామ్॥* **32**

ఆజ్ఞా చక్రమందలి చంద్రునికి పదిహేను కళలున్నాయి. పదహారవ కళ షోడశీ కళ. ఇది బైందవ స్థానమైన సహస్రకారంలో ఉంటుంది.

**దర్శాద్యాః పూర్ణిమాంతాశ్చ కళాఃపంచదశైవతు ।**
**షోడశీతు కళాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ॥**

పాడ్యమి దగ్గరనుండి పౌర్ణమి వరకు గల కళలు పదిహేను. పదహారవ కళ షోడశీకళ సచ్చిదానంద రూపిణియై ఉన్నది. సహస్రదళపద్మము జ్యోత్స్నామయలోకము. అది చంద్రమండలము. అక్కడ చంద్రుడు నిత్య కళాయుక్తుడు చంద్రబింబమే శ్రీచక్రము. ఇక్కడ కళ అంటే సాదఖ్య కళ.

శుక్లపక్షపాడ్యమి నుంచి ఒక్కొక్క రోజు నిత్యను (దేవత) ఉపాసించాలి. అంటే ప్రతిరోజు ఒక నిత్య, సాదాఖ్య కళలను ఉపాసన చెయ్యాలి. అమావాస్య రోజున చంద్రుని కళలన్నీ సూర్యునిలో చేరిపోతాయి. ఆ రోజున చంద్రుడు కళారహితుడు. కాబట్టి అమావాస్య రోజున పూజ నిషేధము. మిగిలిన తిథులలో రాత్రులందు మాత్రమే ఉపాసన చెయ్యాలి. ఇది సమయమతసిద్ధాంతము. ఈ విషయాన్ని శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోని పదో శ్లోకంలో వివరించారు.

**సుధాధారాసారై శ్చరణయుగలాంతర్విగలితైః**
**ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః**
**అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్టవలయం**
**స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి॥**

## ఆజ్ఞాచక్రము

**ఇడాయాం పింగళ్యాం చరత ఇహ తౌ సూర్యశశినౌ**
**తమ స్యాధారే తౌ, యదితు మిళితౌసా తిథి రమా**
**తదాఽజ్ఞా చక్రస్థం శశిరకర బింబే రవి నిభం**
**ధృఢవ్యాలీఢం సద్విగలిత సుధాసార విసరమ్॥ 33**

దేహంలో ఇడ, పింగళ అనే రెండు రకాల నాడీమండలాలుంటాయని, వాటిలో సూర్యచంద్రులు తిరుగుతుంటారని, వారిద్దరూ ఆధార చక్రంలో కలిసిన రోజే అమావాస్య

అని ముందే వివరించటం జరిగింది. అమావాస్య రోజున ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రునికి సూర్యకిరణ సంపర్కం ఉంటుంది. అందుచేత ఆ రోజున చంద్రకిరణములు కాని, అమృతపుధారలు కాని ఉండవు. పౌర్ణమినాడు చంద్రకిరణములు పూర్తిగా ప్రసరిస్తాయి. అందుచేత కుండలినీశక్తి నిద్రలేచి రుద్రగ్రంథిని భేదించేటప్పుడు అసంఖ్యామైన అగ్నికిరణాలు ప్రకాశిస్తాయి. అలాగే విష్ణుగ్రంథిని భేదించేటప్పుడు లెక్కలేనన్ని సూర్యకిరణాలు ప్రకాశిస్తాయి. బ్రహ్మగ్రంథిని భేదించేటప్పుడు అనంతమైన విద్యుత్కాంతులతో భగవతి ప్రకాశిస్తూ ఉంటుంది. అప్పుడు చంద్రమండలము నుండి సుధాధారలు విపరీతంగా స్రవిస్తాయి.

***ఆజ్ఞాత్మక ద్విదళ పద్మగతే తదానీం***
***విద్యున్నిభే రవి శశి ప్రయుతోత్కటాభే***
***గండస్థల ప్రతిఫల త్మరదీపజాల***
***కర్ణావతంసకలికే కమలాయతాక్షి ॥***

ఆజ్ఞాచక్రంలో భగవతి కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులకు మించిన కాంతితో ప్రకాశిస్తూ ఉంటుంది.

సౌందర్యలహరిలోని 36వ శ్లోకంలో ఈ విషయం వివరించటం జరిగింది.

***తవాజ్ఞాచక్రస్థం తపనశశికోటిద్యుతిధరం***
***పరం శంభుం వందే పరిమిళితపార్శ్వం పరచితా***
***యమారాధ్యన్భక్త్యా రవిశశిశుచీనామవిషయం***
***నిరాతఙ్కే"లోకో నివసతి హి భాలోకభవనే॥***

## జ్యోతిఃకారణ నిరూపణము

***మహావ్యోమ స్థేందోరమృత లహరీ ప్లావిత తనుః***
***ప్రశుష్యద్వై నాడీ ప్రకరమనిశం ప్లావయతి తత్ !***
***యదాజ్ఞాయాం విద్యున్ని యుతనియుతా భాక్షరమయీ***
***స్థితా విద్యుల్లేఖా భగవతి విధిగ్రంథి మభినత్॥*** ***34***

మహావ్యోమము అంటే సహస్రదళ పద్మము. ఇది దేవి ఉండే ప్రదేశము. అక్కడ ఉండే చంద్రకళ పదహారవది అయిన షోడశీకళ. కుండలినీశక్తి నిద్రలేచి ఊర్ధ్వముఖంగా పయనించి సహస్రారం చేరి సహస్రదళపద్మాన్ని నోటితో కరచి పట్టుకోగా, అక్కడ

నుండి అమృతపుధారలు కురిసి శరీరంలోని 72000 నాడీ మండలాన్ని తడుపుతాయి. బ్రహ్మగ్రంథిని భేదించిన కుండలిని విద్యుల్లతలాగా కోట్లకొలది సూర్యచంద్రుల ప్రకాశంతో సుధాసింధువులో పరమశివునితో కూడి విహరిస్తుంది. షట్చక్రాలలో, రెండుచక్రాలకు పైభాగాన ఒక గ్రంథి ఉంటుందని ముందే చెప్పటం జరిగింది.

సమయమతం ప్రకారం విశుద్ధి ఆజ్ఞాచక్రాల పైన బ్రహ్మగ్రంథి ఉంటుంది. ఈ రెండు చక్రాలు చంద్రమండలానికిచెందినవి. అక్షరాలను మూడు ఖండాలుగా చేసినప్పుడు స్వరములు అంటే అచ్చులు పదహారు ఒక ఖండము. ఈ ఖండాన్నే సోమఖండము అంటారు. ఆజ్ఞాచక్రంలో ధారణ గనక చేసినట్లయితే ఫలితము ప్రతిభాధారణ.

## శివశక్తి మేళనము

***తతోగత్వా జ్యోత్స్నామయ సమయలోకం సమయినాం***
***పరాఖ్యా సాదాఖ్యా జయతి శివతత్త్వేన మిళితా***
***సహస్రారే పద్మే శిశిర మహసాం బింబ మపరం***
***తదేవ శ్రీచక్రం సరఘమితి తద్బైందవమితి॥*** ***35***

కుండలినీ శక్తి ఆజ్ఞాచక్రం దాటి బ్రహ్మగ్రంథిని భేదించి సహస్రకమలములో ప్రవేశిస్తుంది. సమయ అంటే సహస్రారంలో ఉన్న చంద్రకళ. ఇక్కడ ఉండే చంద్రుడు నిత్యకళాయుక్తుడు. శివశక్తుల సామ్యము తెలియచేసేదే సమయ. ఈ షోడశీ కళను పరా, సాదాఖ్య, పరమా అని అంటారు. ఇది ఇరవై ఆరవతత్త్వము. ఆజ్ఞాచక్రము సోమఖండము సహస్రారంలో ఇంకొక చంద్రుడున్నాడు. అంటే ఆజ్ఞాచక్రము చంద్రకళలు ఉండేస్థానము సహస్రారము చంద్రమండలము. అదే శ్రీచక్రము. దీనినే సరఘ అని, బైందవ స్థానమనీ అంటారు. నాలుగు ద్వారాలు మూడు భూపురాలు గల శ్రీచక్రము బ్రహ్మగ్రంథి పైన ఉంది. శ్రీచక్రము యొక్క నాలుగు ద్వారాల యందు మాయ, శుద్ధ విద్య, మహేశ్వరుడు, సదాశివుడు అనే నాలుగుతత్త్వాలుంటాయి. వీటినే భగవతి విశ్రమించే మంచానికి నాలుగు పాదాలు అంటారు. దీని వివరణ సౌందర్యలహరిలోని 'గతాస్తే మంచత్వం' అన్న తొంభైరెండవ శ్లోకంలో ఇవ్వబడింది. నాలుగు ద్వారాలు కలిగి కర్ణికా రూపంలో ఉన్న శ్రీచక్రంలోని చతుష్కోణము మధ్య గల బిందువునే సరఘ అంటారు. అదే సుధాసింధువు. శివశక్తుల సంగమస్థానము.

సాధకుడు గనక కండలినీశక్తిని సహస్రారం చేర్చకలిగినట్లయితే, నాలుగుద్వారాలు కలిగిన శ్రీచక్రంలోకి ప్రవేశించినట్లే. అప్పుడు దేవి సాక్షాత్కారం అవుతుంది. శ్రీచక్రం యొక్క నాలుగు ద్వారాలు నాలుగువేదాలకు ప్రతీకలు. ఆ ద్వారాలలో గనక ప్రవేశించినట్లయితే పరదేవత సాక్షత్కారం కలుగుతుంది.

***శ్రీచక్రస్య చత్వారిద్వారాణి చతుర్వేదరూపాణి***
***ద్వార ప్రవేశనే వ భవతి పరదేవతా సాక్షాత్కారః***

## భగకోణైక్యము

***వదంత్యేకే సంతః పరశివపదే తత్త్వమిళితే***
***తతస్త్వం షడ్వంశా భవతి శివయో ర్మేళనవపుః***
***త్రిఖండేఽ స్మిన్ స్వాంతే పరమపద పర్యంకసదనే***
***పరే సాదాఖ్యేఽ స్మిన్ని వసతి చతుర్ధైక్య కలనాత్‌॥*** ***36***

సహస్రారంలో ఉన్న షోడశీకళయే సాదాఖ్యకళ అని, దీనినే పరా, పరమా అనికూడా అంటారని ముందే చెప్పటం జరిగింది. పరమశివ పదమున శక్తితత్త్వము కలిస్తే ఇరవైఆరవ తత్త్వము అవుతుంది. అదే భగవతి అని చెప్పబడుతోంది. ఇక్కడ త్రిఖండాత్మిక అయిన భగవతి నాలుగువిధముల ఐక్యమవుతుంది. శివాశివుల మేళనము వలన వచ్చిన ఇరవైఆరవ తత్త్వము సర్వతత్త్వాతీకము, నాదబిందు కళాతీతము.

ఇంకా వివరంగా చెప్పాలి అంటే శుద్ధవిద్య, సదాశివుడు కలిస్తే సాదాఖ్యకళ అవుతుంది. ఇది ఇరవైఐదవ తత్త్వము అయిన సదాశివునితో కలిస్తే ఇరవైఆరవ తత్త్వము అవుతుంది. అయితే సమయ అని పిలవబడే సాదాఖ్యకు సపర్య సహస్రారమందే జరుగుతుందని గుర్తించాలి.

భగవతికి నాలుగు విధాలుగా ఐక్యత ఉన్నదని చెప్పటం జరిగింది. అవి

1. మాతృకలకు -- మూలమంత్రానికి ఐక్యము
2. మంత్రానికి -- చక్రానికి ఐక్యము
3. చక్రానికి -- షోడశనిత్యలకు ఐక్యము
4. నిత్యలకు -- కళలకు ఐక్యము

ఈ ఐక్యములను ఇదివరకే నిరూపించటం జరిగింది. అలాగే

1. ఆధారాది షట్చక్రాలకు -- శ్రీచక్రంలోని త్రికోణాది షట్చక్రాలకు
2. బిందువుకు -- శివునకు
3. శివశక్తులకు -- మంత్రచక్రాలకు తాదాత్మ్యమున్నది.

శ్రీవిద్య అని పిలవబడే బ్రహ్మవిద్య నాద బిందువు కళాతీతమైనది.

ఈ శ్లోకంలో రెండవ పాదంలో 'షడ్వింశీ' అనటానికి బదులుగా కొన్ని ముద్రణలలో 'షట్త్రింశా' అని ఉన్నది. పాఠాంతరాన్ని తీసుకున్నట్లయితే కాశ్మీరీశక్తుల సిద్ధాంతము ప్రకటిత మవుతుంది.

## త్రివిధైక్య నిరూపణము

*క్షితౌ వహ్నిర్వహ్నౌ వసురథజలే దిఙ్మరుతి ది*
*క్కలాశ్రే మన్వశ్రం దృశివసురథోరాజకమలే !*
*ప్రతిద్వైత గ్రంథి స్తదుపరి చతుర్ద్వార సహితం*
*మహీచక్రం చైకం భవతి భగ కోణైక్య కలనాత్॥* **37**

ఇక్కడ నాదబిందు ఐక్యము చెప్పబడుతున్నది. నాదము అంటే శ్రీచక్రము బిందువు అంటే షట్కమలముల వనం. ఈ రెండింటికి ఐక్యము అంటే

1. ఆధార చక్రానికి -- త్రికోణంతో
2. స్వాధిష్ఠానానికి -- అష్టకోణంతో
3. మణిపూరానికి -- అంతర్దశారంతో
4. అనాహతానికి -- బహిర్దశారంతో
5. విశుద్ధిచక్రానికి -- చతుర్దశారంతో
6. ఆజ్ఞాచక్రములోని -- ఒక దళం అష్టదళంతోను రెండవ దళం షోడశ దళంతోను ఐక్యము పొందుతున్నాయి.

షట్చక్రాల్లో ప్రతి రెండు చక్రాలకు ఒక గ్రంథి ఉన్నది. శ్రీచక్రంలోని మూడు వృత్తాలు మూడు గ్రంథులు. అంటే షట్చక్రాలలోని మూడు గ్రంథులు శ్రీచక్రంలోని మూడు వృత్తాలు. ఈ రకంగా నాదబింద్వైక్యము ప్రాసాదన్యాయంలో చెప్పబడింది. ప్రాసాదన్యాయము అంటే గోడలు, స్తంభాలు, దూలాలు మొదలైన వాటితో మేడ ఉన్నట్లుగానే షట్చక్రాలను ఆధారం చేసుకుని శ్రీచక్రం ఏర్పడింది. ఇది అతి రహస్యము.

భగ కోణైక్యము అంటే బిందునాదముల ఐక్యము. పృథివి మొదలుగా గల పంచభూతాల తత్త్వాలు మనస్సుతో కలిసి ఆరు. ఇంద్రియాలు + మనస్సు = ఆరు. వీటికి షట్చక్రాలు అధిష్ఠానాలు. గతంలో చెప్పినట్లుగా మొత్తం తత్త్వాలు ఇరవై ఐదు అందులో

| | | |
|---|---|---|
| జ్ఞానేంద్రియాలు | -- | 5 |
| కర్మేంద్రియాలు | -- | 5 |
| పంచభూతాలు | -- | 5 |
| తన్మాత్రలు | -- | 5 |
| మనస్సు | -- | 1 |
| మొత్తం తత్త్వాలు | | 21 |

ఇవి ఆజ్ఞాచక్రం వరకు ఉంటాయి. ఆ పైన నాలుగు తత్త్వాలు మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, ఆజ్ఞాచక్రంపై భాగాన ఉంటాయి. బ్రహ్మగ్రంథికి పైభాగాన నాలుగు ద్వారాలతో, మూడురేఖలు గల భూపురంతో శ్రీచక్రం ఉంటుంది. శ్రీచక్రం మధ్యన బిందువు ఉంటుంది. ఆ బిందువులో శివాశివులుంటారు. అందుకే

> ***శ్రీచక్రస్య చత్వారిద్వారాణి చతుర్వేదరూపాణి***
> ***ద్వార ప్రవేశనైవ భవతి పరదేవతా సాక్షాత్కారః***

అని చెప్పబడింది. అక్కడికి చేరాలి అంటే ఆధార స్వాధిష్ఠానాలను దాటి రుద్రగ్రంథిని, మణిపూర అనాహతాలు దాటి విష్ణుగ్రంథిని, విశుద్ధి ఆజ్ఞాచక్రాలు దాటి బ్రహ్మగ్రంథిని భేదించాలి. అప్పుడు శ్రీచక్ర నగర ప్రవేశం కలుగుతుంది. ఇక్కడ చతుర్విధైక్యసంధానము చెయ్యాలి. అవి వరుసగా

1. పిండాండ బ్రహ్మాండముల – అనుసంధానము
2. షట్చక్రముల – అను సంధానము
3. పంచవిధసామ్యముల – అను సంధానము
4. షడ్విధైక్య – అను సంధానము

భగము అంటే సూర్యుడు అని అర్థం. భూపురానికి మూడు ప్రాకారాలున్నాయి. ఒక్కొక్క ప్రాకారానికి నాలుగు కోణాలున్నాయి. మొత్తం మూడు ప్రాకారాలకి 4×3=12 కోణాలున్నాయి. పన్నెండు అనే సంఖ్య సూర్యుణ్ణి సూచిస్తుంది. ద్వాదశాదిత్యులు. దేవిని

సూర్యమండలంలోను, చంద్రమండలంలోను కూడా ఆరాధిస్తారు. లలితా సహస్రంలో భానుమండలమధ్యస్థా అని, చంద్రమండల మధ్యగా అని చెప్పటమే దీనికి నిదర్శనం. దేవి సూర్యమండలంలో ఉన్నదని చెప్పటానికే కొన్ని శ్రీచక్రాలలో అష్టదళము తరువాత ద్వాదశదళము, ఆ తరువాత షోడశదళము ఇవ్వబడ్డాయి. ఈ ద్వాదశదళము ద్వాదశాదిత్యులకు ప్రతీక. అందుచేతనే భగకోణ ఐక్యము చెప్పబడింది. ఈ రకంగా ఈ శ్లోకంలో

1. నాదబిందు ఐక్యము
2. చతుర్విధైక్యము
3. భగకోణ ఐక్యము చెప్పబడ్డాయి.

సపర్య అంటే అనుసంధానమే కాని వేరుకాదని లక్ష్మీధరుని అభిప్రాయము.

## ఐక్య నిరూపణ

***షడబ్జారణ్యే తాం సమయిన ఇమే పంచకసమాం***
***యదా సంవిద్రూపాం విదధతి చ షోఢైక్య కలితామ్***
***మనో జిత్వా చాజ్ఞాసరసిజ ఇహ ప్రాదురభవ***
***త్తటిల్లేఖానిత్యా భగవతి తవాధార సదనాత్॥*** ***38***

మూలాధారచక్రం మొదలు ఆజ్ఞాచక్రం వరకు గల ఆరుచక్రాలను షట్కమలములు అంటారు. ఈ కమలాలలో షోడశీకళలేదు. దాని యొక్క ప్రతిరూపం మాత్రమే ఉంది. వీటన్నింటికీ అతీతమై, నాదబిందు కళాతీతమైనది ఇరవైఆరవ తత్త్వము. అందుకే బిందువు అంటే షట్చక్రాలవనం అని చెప్పబడింది. షట్చక్రాల్లోనూ ఆధారచక్రం అంధకారబంధురం, తామిస్రకం. స్వాధిష్ఠాన మణిపూరాలు మిశ్రమలోకాలు. అనాహతం జ్యోతిర్లోకమే అయినా మిశ్రమంగానే చెప్పాలి. విశుద్ధి చక్రం చంద్రలోకం, ఆజ్ఞాచక్రం సుధాలోకం. సహస్రదళ పద్మమే సుధామయము. షట్చక్రాల్లోని ప్రతి చక్రంలోనూ శివశక్తులకు సామ్యము ఉన్నది. ఆరు విధములు ఐక్యమును అను సంధానం చేస్తేనే భగవతి సాక్షాత్కారం కలుగుతుంది.

చంద్రకళలలో పదిహేను కళలు షోడశారంలోనే ఉంటాయి. కాని పదహారవ కళ సహస్రారంలో ఉంటుంది. సహస్రకమలమే దేవి నివాసస్థానము. సమయాచారం ప్రకారం ఐక్యానుసంధానము చెయ్యాలి. అవి

1. పిండ బ్రహ్మాండాలకు ఐక్యానుసంధానము
2. షడ్విధైక్య సంధానము
3. షట్కమలాను సంధానము
4. పంచ సామ్యాను సంధానము

| | | | |
|---|---|---|---|
| 1. | పిండాండ బ్రహ్మాండాలకు ఐక్యము | – | పదమూడవ శ్లోకంలో చెప్పబడింది |
| 2. | షడ్విధైక్య సంధానము | – | పదమూడవ శ్లోకంలో చెప్పబడింది |
| 3. | షట్కమలానుసంధానము | – | యాభై రెండవ శ్లోకంలో చెప్పబడింది |
| 4. | పంచసామ్యము | – | ఇప్పుడు వివరింపబడుతోంది |

సమయాచారులు శివశక్తులను సమయుడు, సమయ అంటారు. సమయ అంటే శివునితో శక్తి ఐదు రకాలుగా సామ్యము ఉన్నదని అర్థము. ఈ రకంగా శివశక్తులకు సామ్యమున్నది కాబట్టే దీన్ని సమయాచారము అంటారు. సామ్యము అంటే పోలిక. శివశక్తులు ఐదు రకాలుగా ఒకే పోలిక కలిగి ఉంటారు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. | అధిష్ఠాన సామ్యము | : | శివశక్తులిద్దరూ ఒకే స్థానం అధిష్ఠించి ఉండటము. |
| 2. | అనుష్ఠాన సామ్యము | : | ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నమై ఉండటము. |
| 3. | అవస్థా సామ్యము | : | ఇద్దరూ ఒకే అవస్థలో నిమగ్నమై ఉండటము |
| 4. | రూపసామ్యము | : | ఇద్దరూ ఒకే రూపంలో ఉండటము |
| 5. | నామ సామ్యము | : | ఇద్దరి పేర్లు ఒకే రకంగా ఉండటము |

షట్చక్రాల్లోని ప్రతిచక్రంలోనూ ఈ రకంగా పోలిక చెప్పబడింది.

**1. ఆధార చక్రంలో**

1. శివాశివులిద్దరూ ఆధారచక్రంలో ఉంటారు. కాబట్టి అధిష్ఠాన సామ్యము.
2. ఇద్దరూ జగత్తును సృష్టించే కార్యక్రమంలో ఉంటారు కాబట్టి అనుష్ఠాన సామ్యము.
3. లాస్య తాండవం చేస్తుంటారు కాబట్టి అవస్థా సామ్యము.
4. ఇద్దరూ అరుణచ్ఛాయలో ఉంటారు కాబట్టి రూపసామ్యము.
5. ఇద్దరికీ భైరవీ, భైరవులని లేదా నవాత్మ, నవాత్మకుడు అని పేర్లు కాబట్టి నామ సామ్యము చెప్పబడ్డాయి.

**2. స్వాధిష్ఠానంలో**

1. శివాశివులిద్దరూ స్వాధిష్ఠానంలో ఉంటారు కాబట్టి అధిష్ఠాన సామ్యము.

2. లోకాలు దహించి వేస్తుంటారు కాబట్టి అనుష్ఠానసామ్యము.

3. మహా సంవర్తాగ్ని, జ్వాలాశక్తి రూపంలో ఉన్నారనటం చేత అవస్థా సామ్యము.

4,5. మహాసంవర్తాగ్నులు అనటంచేత రూప, నామ సామ్యాలు చెప్పబడ్డాయి.

**3. మణిపూరంలో**

1. శివాశివులిద్దరూ మణిపూరంలో ఉండటంచేత అధిష్ఠాన సామ్యము.

2. స్ఫురన్నానారత్నాభరణ పరిణద్ధేంద్ర ధనుషమ్ అనటం చేత అనుష్ఠాన సామ్యము.

3. కారుమేఘాల వలె ఉన్నారనటం చేత అనుష్ఠాన సామ్యము.

4. మేఘము, మెరుపు అనటం చేత రూపసామ్యము.

5. తటిత్వంతుడు, తటిత్వతి వీరి పేర్లు కావటంచేత నామసామ్యము చెప్పబడ్డాయి.

**4. అనాహతంలో**

1. శివాశివులిద్దరికీ అనాహతము అధిష్ఠాన మందిరము.

2. వాయుతత్త్వమునుత్పాదించచున్నారనటం చేత అనుష్ఠాన సామ్యము.

3. గాలి లేని దీపముగా చెప్పటంచేత అనుష్ఠాన సామ్యము.

4,5. అగ్నికణిక అని చెప్పటం వల్ల రూప, నామసామ్యాలు చెప్పబడ్డాయి.

**5. విశుద్ధి చక్రంలో**

1. శివాశివులిద్దరికీ అధిష్ఠానము విశుద్ధి మందిరము.

2. ఇద్దరూ ఆకాశ తత్త్వమునుత్పాదించుచున్నారు. వ్యోమజనకం అనటం చేత అనుష్ఠాన సామ్యము.

3. చంద్ర కిరణములతో సమానమైన కాంతి కలవారు అనటం చేత అవస్థా సామ్యము.

4. శుద్ధస్ఫటికము వలె అనటం చేత రూపసామ్యము.

5. శివం శివే అనటం చేత నామసామ్యము చెప్పబడ్డాయి.

**6. ఆజ్ఞాచక్రంలో**

1. శివాశివులిద్దరికి అధిష్ఠానము ఆజ్ఞాచక్రము.

2. ముక్తి ప్రదత్వము అనుష్ఠానసామ్యము.

3. పర అనుచిచ్ఛక్తితో కూడిన సదాశివుడు అనటం చేత అవస్థాసామ్యము.

4. కోట్లకొలది సూర్యచంద్రుల కాంతితో ప్రకాశిస్తున్నారు అనటం చేత రూపసామ్యము.

5. 'పరంశంభుం' పరుడనే పేరుగల శివుడు పరా అనే పేరుగల దేవి అనటం చేత నామసామ్యము చెప్పబడ్డాయి.

ఈ పంచసామ్యాలు షట్చక్రాలతోనే ఉన్నాయని తెలిసిన వాడే ఋషి.

ఈ రకంగా ఈ శ్లోకంలో గౌడపాదాచార్యులవారు ఐక్య నిరూపణ చేశారు.

## త్రివిధైక్యము

***భవత్సామ్యం కేచిత్త్రితయమితి కౌంభప్రభృతయ***
***పరంతత్త్వాఖ్యం చే త్యపర మిదమాహుః సమయినః !***
***క్రియావస్థారూపం ప్రకృతిరభిధా పంచకసమం***
***తదేషాం సామ్యం స్యాదవనిషుచయో వేత్తి స మునిః॥ 39***

కౌంభుడు అంటే అగస్త్యుడు కౌళమతస్థుడు. ఈయన భార్య లోపాముద్ర. వీరుహాది విద్యను ఉపాసించారు. అగస్త్యుడు శివశక్తులకు

1. సృష్టి, స్థితి, లయాలకు
2. జాగ్రత్స్వప్నసుషుప్తులకు
3. ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులకు

సామ్యమున్నదని త్రివిధ సామ్యము చెప్పాడు. కాని సమయమతస్థులు దీన్ని అంగీకరించరు. ఇరవైఐదవ తత్త్వము సదాశివుడు. సదాశివునితో కలిసిన సాదాఖ్యకళ ఇరవైఆరవ తత్త్వము 'చిద్రూప' అని చెప్పబడింది. శివశక్తులకు పంచవిధ సామ్యమున్నదని అది షట్చక్రాలయందే కలదని సమయమతసిద్ధాంతము. ఇది తెలిసిన వాడు, ఋషితుల్యుడు. సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము, అనుగ్రహములను అభిధాపంచకము అంటారు.

శివశక్తులు సచ్చిదానందస్వరూపులు కావటం చేత వారికి మూడు రకాల సామ్యము చెప్పబడింది. కొంతమంది వారికి ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తుల సామ్యము కూడా చెబుతున్నారు. అయితే ఈ మూడు శక్తులకు త్రిశూలంతో సంబంధమున్నదని వారి వాదన. ఇంకొంతమంది శివాశివులకు

1. విద్యాత్వము
2. విద్యేశానత్వము
3. మంత్ర మంత్రేశ్వరాత్మత

అనే మూడు సామ్యాలు చెబుతున్నారు. మహాభైరవుడు, నవవ్యూహాత్మకుడు, మహాభైరవి చిద్రూప. నవవ్యూహాలకు భోక్త, భోగ్య, భోగములను మూడురూపాలతో తాదాత్మ్యమున్నదని మరికొందరి వాదన. కాని గౌడపాదులవారు ఈవాదాలన్నింటినీ త్రోసిపుచ్చి శివాశివులకు పంచవిధ సామ్యమున్నదని, అది షట్చక్రాలయందే ఉన్నదని, సమయమత సిద్ధాంత నిర్ధారణ గావించారు.

## ప్రస్తార నిరూపణము

***వశిన్యాద్యానిత్యా అకచటతపాద్యాః ప్రకృతయః***
***స్వవర్గస్థాః స్వస్వాయుధకలితహస్తాః స్వవిషయాః !***
***యథావర్గం వర్ణప్రచురతనవో యాభిరభవం***
***స్తవప్రస్తారా స్త్రేత్రయ ఇతి జగుస్తే సమయినః॥*** **40**

***ఇమా నిత్యా వర్ణా స్తవచరణ సంమేళనవశా***
***న్మహామేరుస్థాః స్యుర్మను మిలనకైలాసవపుషః !***
***వశిన్వాద్యాఏతా అపితవ సబింద్వాత్మకతయా***
***మహీప్రస్తారోఽయం క్రమ ఇతి రహస్యం సమయినామ్॥*** **41**

గౌడపాదాచార్యులవారు ఈ రెండు శ్లోకములలోనూ శ్రీచక్రమును ఎన్ని విధములుగా నిర్మించవచ్చునో చెబుతున్నారు. శ్రీచక్ర నిర్మాణ విధమునే ప్రస్తారము అంటారు. సమయ మతాన్ననుసరించి చూసినట్లైతే, శ్రీచక్రాన్ని మూడు రకాలుగా తయారుచేయవచ్చును. ఇవి వరుసగా

1. భూప్రస్తారము 2. మేరు ప్రస్తారము 3. కైలాస ప్రస్తారము

**1. భూప్రస్తారము :**

శ్రీచక్రాన్ని బంగారము, వెండి, రాగిరేకుల మీదగాని, పట్టువస్త్రము, భూర్జరీపత్రము మీదగాని వ్రాసినట్లైతే దానిని భూప్రస్తారము అంటారు. 'సనత్కుమారసంహిత'లో దీనిని వివరించటం జరిగింది. దీనిలో వశిన్యాదిశక్తుల తాదాత్మ్యమున్నది. అంటే వశిని, కామేశ్వరి మొదలగు ఎనిమిది శక్తులు యోగినులు పన్నెండుమంది, మొత్తం ఇరవై మందిని దశార యుగ్మంలో చూపటమే భూప్రస్తారంలోని విశేషము.

ఇక్కడ షోడశనిత్యలు పదహారు, వశిన్యాదిశక్తులు ఎనిమిది, మొత్తం ఇరవైనాలుగు మంది. వీరిలో ఇద్దరు నిత్యలు, వశిని మొదలైన శక్తులలో ఒకటి, మొత్తం ముగ్గురు చొప్పున అష్టకోణములో అంతర్భావం అవుతాయి. వశిన్యాది శక్తులు ఎనిమిది, నిత్యలు పదహారు, యోగినులు పన్నెండు మంది, వర్గులు ఎనిమిది (అ కచటతపయశ) మొత్తం నలభైనాలుగు. వీటిలో ఒక శక్తిని (మహాత్రిపురసుందరి) వదిలిపెట్టి మిగిలిన వాటిని శ్రీచక్రంలోని నలభైమూడు కోణాలలోనూ అంతర్భావం చెయ్యాలి. వదలిపెట్టిన శక్తి 'మహాత్రిపురసుందరి'ని బిందువునందు ఉంచాలి. గంధాకర్షిణి, రసాకర్షిణి, రూపాకర్షిణి, స్పర్శాకర్షిణి అను నలుగురు ఆకర్షణ దేవతలు, నాలుగుద్వారాలలో ఉంటారు.

వశిన్యాదిశక్తులు ఎనిమిదిమంది వారు వరుసగా

| | | | |
|---|---|---|---|
| 1. వశిని | 2. కామేశ్వరి | 3. మోదిని | 4. విమల |
| 5. అరుణ | 6. జయిని | 7. సర్వేశ్వరి | 8. కౌళిని |

నిత్యలు పదహారుమంది వారు వరుసగా

| | |
|---|---|
| 1. మహాత్రిపుర సుందరి | 9. త్వరిత |
| 2. కామేశ్వరి | 10. కులసుందరి |
| 3. భగమాలిని | 11. నిత్య |
| 4. నిత్యక్లిన్న | 12. నీలపతాక |
| 5. భేరుండ | 13. విజయ |
| 6. వహ్నివాసిని | 14. సర్వమంగళ |
| 7. మహావజ్రేశ్వరి | 15. జ్వాలామాలిని |
| 8. రౌద్రి (శివదూతి) | 16. చిత్ర |

యోగినులు పన్నెండుమంది వారు వరుసగా :

| | |
|---|---|
| 1. విద్యాయోగిని | 7. ఆప్యాయనీయోగిని |
| 2. రేచికాయోగిని | 8. వ్యాపినీ యోగిని |
| 3. మోచికా యోగిని | 9. మేధాయోగిని |
| 4. అమృతాయోగిని | 10. వ్యోమరూపాయోగిని |
| 5. దీపికాయోగిని | 11. సిద్ధరూపాయోగిని |
| 6. జ్ఞానయోగిని | 12. లక్ష్మీయోగిని. |

ఈ రకంగా స్వస్వాయుధకలితహస్తులై తాదాత్మ్యమున్న శ్రీచక్రాన్ని భూప్రస్తారము అంటారు.

**2. మేరు ప్రస్తారము :**

ఇది శంఖం ఆకారంలో ఉంటుంది. అంటే నేలమీద భూపురము దాని మీద కొంచెం ఎత్తుగా షోడశదళము ఆ పైన కొంచెం ఎత్తుగా అష్టదళము ఈ రకంగా ఒక దానిపైన ఒకటి ఉంచబడటంవల్ల శంఖం ఆకారంలో కనిపిస్తుంది. అన్ని చక్రములకు పై భాగాన బిందువు ఉంటుంది. దీనిలో నిత్యాషోడశతాదాత్మ్యము చెప్పబడింది. ఇక్కడ షోడశనిత్యలు అష్టవర్గస్వరూపలై, అష్టదళపద్మంలోని దళాలలో ఉంటాయి. అష్టకోణంలో తూర్పు నుండి ఒక్కొక్క కోణమునకు ఇద్దరు చొప్పున అంతర్భావం పొందుతున్నారు. ఈ రకంగా ఎనిమిది జంటలూ, ఎనిమిది కోణాలలోనూ అంతర్భూతమౌతున్నాయి. ఈ నిత్యలే షోడశదళంలో, దశారయుగ్మంలోనూ కూడా, ఉన్నాయి. వీటిలో మొదటి రెండు నిత్యలూ త్రికోణబిందు రూపంలో మధ్యన ఉన్నాయి. మిగిలిన పధ్నాల్గు నిత్యలూ చతుర్దశకోణంలో అంతర్భూతం పొందుతున్నాయి. ఈ రకంగా చక్రవిద్యకు నిత్యలు అంగములై ఉంటున్నాయి. ఈ విధంగా స్వస్వవిషయ కలితులైన నిత్యలతో తాదాత్మ్యము ఉన్న శ్రీచక్రాన్ని మేరు ప్రస్తారము అంటారు. మేరు ప్రస్తారం గురించి జ్ఞానార్ణవతంత్రంలో ఈ రకంగా చెప్పటం జరిగింది.

*భూమి శ్చంద్రః శివో మాయా శక్తిః కృష్ణాధ్వమాదనౌ ।*
*అర్ధచంద్రశ్చ బిందుశ్చ నవార్ణో మేరు రుచ్యతే ।*
*శ్రీచక్రమపి దేవేశి మేరురూపం న సంశయః ।*
*లకారః పృథివీబీజం తేన భూబింబ ముచ్యతే॥*

*సకార శ్చంద్రమాభద్రే కలాషోడశ కాత్మకం ।*
*తస్మా త్షోడశపత్రం తు హ కారః శివ ఉచ్యతే॥*

*అష్టమూర్తి ః సదాభద్రే తస్మా ద్వసుదళం భవేత్ ।*
*ఈకారస్తు మహామాయా భువనాని చతుర్దశ॥*

*పాలయంతీ పరా తస్మా చ్ఛక్రకోణం భవే త్ప్రియే ।*
*శక్తి రేకాదశస్థానే స్థిత్వా సూతే జగత్త్రయమ్॥*

*విశ్వయోని రితి ఖ్యాతా సా విష్ణు ర్దశరూపకం ।*
*రకారా త్పురమేశాని చక్రం వ్యాప్య విజృంభతే॥*

*దశకోణకరీ యస్మా ద్రకారో జ్యోతి రవ్యయః ।*
*కళాదశా న్వితో వహ్ని ర్దశకోణ ప్రవర్తకః॥*

క కారో మదనో దేవి శివశ్చాష్ట స్వరూపకః ।
యోనీవశ్యం తదా చక్రే వసుయో న్యంకితం భవేత్॥

అర్థసూత్రా గుణాన్ సూతే నాదరూపా యత స్తతః ।
త్రికోణరూపా యోనిస్తు బిందునా బైందవం భవేత్॥

కామేశ్వరస్వరూపంతు విశ్వాకార స్వరూపకం ।
శ్రీచక్రంతు వరారోహే శ్రీవిద్యా వర్ణసంభవమ్॥

**3. కైలాస ప్రస్తారము :**

దీనిలో మాతృకాతాదాత్మ్యం అంటే వర్ణాలతో తాదాత్మ్యం చెప్పబడింది. శ్రీవిద్యలో గల పదహారు అక్షరాలు షోడశనిత్యాత్మకాలు. పదహారవకళ పరాకళ, చిదేకరస. **సనందన సంహిత**లో ఈ విషయము వివరించబడింది. షోడశనిత్యలు చంద్రకళ అయిన చక్ర విద్యకు అంగ భూతములు. ఈ షోడశనిత్యలు స్వరాత్మకములు. ఇవి అక్షరాల రూపంలో పంచదశీ మహామంత్రంలో అకారాది విసర్గాంతము, సకారము ఈ రెండింటి చేత సం గృహీతులై, జీవకళా రూపంలో బైందవస్థానంలో ఉంచబడుతున్నవి. క కారము నుండి మ కారము వరకు గల ఐదు వర్గులు అంటే ఇరవైఐదు అక్షరములు, ఈ వర్గులలో చివరి ఐదు అక్షరములు వదిలివేయగా మిగిలిన ఇరవై అక్షరములు. పాశాంకుశ బీజములతో కూడినవై అష్టారంలోనూ, దశారద్వయంలోను ఉంటాయి. మిగిలిన వాటిలో యరలవశషసహళ అనే తొమ్మిది అక్షరాలు రెండు ఆవృత్తులుగా చతుర్దశకోణమునందు ఉంటాయి. అంటే ఇక్కడ 9×2=18 అక్షరాలలోనూ పధ్నాల్గు చతుర్దశారంలో ఉంటాయి. మిగిలిన నాలుగు అక్షరాలు శివచక్రాలు నాలిగింటియందు ఉంటాయి. ఎనిమిది వర్గులు అష్టకోణంలో ఉంటాయి. ఈ రకంగా అక్షరాలు అంతర్భావం చెందటమే కైలాసప్రస్తార విశేషము. చక్రవిద్యలో ఈ విధంగా నిత్యలకు అవయవత్వం ప్రతిపాదింపబడుతున్నది. ఇంకా విపులంగా చెప్పాలంటే సంస్కృత భాషకు అక్షరాలు యాభై. అక్షరములు అంటే 'అ' నుంచి 'క్ష' వరకు ఉండే వర్ణసమామ్నాయము. ఈ యాభై అక్షరాలు పంచదశీ మహామంత్రంలో అంతర్భూతములు అని పందొమ్మిదవ శ్లోకం (పంచదశీ మహామం త్రం)లో వివరించటం జరిగింది. ఈ అక్షరాలను మూడు భాగాలుగా చేశారు. అవి

1. అ నుంచి అః వరకు (అచ్చులు పదహారు)
2. క నుంచి త వరకు (పదహారు అక్షరాలు)
3. థ నుంచి స వరకు (పదహారు అక్షరాలు)

ఈ అక్షరాలన్నీ మూడు ఆవృత్తులుగా షోడశనిత్యలలో అంతర్భావం పొందుతున్నాయి. 'హ' కారము బైందవమున, 'ల, ళ' యో ర 'భేదః' అను సూత్రముననుసరించి ళ కారము ల కారమున అంతర్భావం పొందుతున్నది. ఈ రకంగా అక్షరాలన్నీ పంచదశీమహామంత్రంలో చేరి ఉన్నాయి.

*"మాతృకాం వశినీయుక్తాం యోగినీభి స్సమన్వితామ్*
*గంధాద్యాకర్షిణీయుక్తాం సంస్మరేత్త్రిపురాంబికామ్"*

వశిన్యాది శక్తి యుక్తము, యోగినీ గణసమన్వితము, గంధాకర్షిణీ సహితము, మాతృకారూపము అయిన త్రిపురాంబికను పూజించాలి.

వశిని మొదలైనవి ఎనిమిది శక్తులు అని ముందే చెప్పబడింది. అందులో మొదటిదైన వశిని స్వరాత్మిక, స్వరములు అంటే అ నుంచి అః వరకు గల అచ్చులు. సనత్కుమార సంహితలో వీటిని గురించి వివరించటం జరిగింది.

1. **స్వరాత్మిక శక్తులు :** ఎనిమిది భుజములు కలిగి పాశము, అంకుశము, అభయ, వరదముద్రలు, పుస్తకము, అక్షమాల, కమండలము, వ్యాఖ్యాముద్రలను ధరించి ఉంటుంది.

2. వ్యంజనశక్తుల చేతులలో పాశ, అంకుశ, అక్షమాల కమండలము ఉంటాయి.

3. య ర ల వ శక్తుల చేతులలో పాశాంకుశ అభయ వరదముద్రలుంటాయి.

4. శ ష స హ చేతులలో పాశాంకుశ అక్షమాల, వరదముద్రలుంటాయి.

5. ళ కార, క్ష కార శక్తి చేతులలో పాశము, అంకుశము, చెరకుగడ, పుష్పబాణము ఉంటాయి. ఇవి పంచాశద్వర్ణాత్మికలగు శక్తులు – వాటి వివరాలు

| | |
|---|---|
| 'అ' కారాది శక్తులు | – ధూమ్ర వర్ణములు |
| 'క' నుంచి 'ఠ' వరకు గలవి | – సింధూర వర్ణములు |
| 'డ' నుంచి 'ఫ' వరకు గలవి | – గౌర వర్ణములు |
| 'బ' నుంచి 'ల' వరకు గలవి | – అరుణ వర్ణములు |
| 'వ' నుంచి 'స' వరకు గలవి | – కనకవర్ణములు |
| 'హ' కార 'క్ష' కారములు | – విద్యుద్వర్ణములు |

'ళ' కారము 'ల' కారముతో కలసి ఉన్నది. అవి ఇదివరకే చెప్పినాము. ఇది గౌడపాదుల అభిప్రాయము. ఈ శక్తులకు పరిధులు కూడా చెప్పబడినాయి.

అ కార శక్తిమండల విస్తీర్ణము ఎనభైలక్షల యోజనాలు

ఆ కార శక్తిమండల విస్తీర్ణము నూటఅరవైలక్షల యోజనాలు

ఇ కార శక్తిమండల విస్తీర్ణము తొంభైలక్షల యోజనాలు

ఈ కార శక్తిమండల విస్తీర్ణము నూట ఎనభైలక్షల యోజనాలు

ఉ కార శక్తిమండల విస్తీర్ణము కోటి యోజనాలు

ఊ కార శక్తిమండల విస్తీర్ణము రెండుకోట్ల యోజనాలు

ఋ కార శక్తిమండల విస్తీర్ణము యాభైలక్షల యోజనాలు

ౠ కార శక్తిమండల విస్తీర్ణము కోటియోజనాలు

&& కార శక్తిమండల విస్తీర్ణము అనంతము

ఏ ఐ కార శక్తిమండల విస్తీర్ణము నూటయాభైలక్షల యోజనాలు

ఓ, ఔ కార శక్తిమండల విస్తీర్ణము నూటయాభైలక్షల యోజనాలు

అం, అః కార శక్తిమండల విస్తీర్ణము మూడువందల ఇరవైలక్షల యోజనాలు

వ్యంజన శక్తుల శక్తిమండల విస్తీర్ణము నలభైలక్షల యోజనాలు.

(హల్లులు)

వశిన్యాదులు, అష్టవర్గులు తమ తమ ఆయుధములతో తమ తమ ప్రమేయములో ఉన్నట్లు భావన చెయ్యటం వల్లనే శ్రీచక్రానికి ఈ మూడు ప్రస్తారాలు వచ్చినాయి. నిత్యలు, వర్ణములు కలసి మంత్రాక్షరములతో యోజింపబడినట్లైతే మేరు, కైలాస ప్రస్తారములు వస్తాయి. బింద్వాత్మకముగా వశినాద్యులను యోజించినట్లైతే భూప్రస్తారము వస్తుంది.

శ్రీచక్రప్రస్తారాల గురించి శంకరభగవత్పాదులవారు తమ సౌందర్యలహరిలోని పదిహేడు, ముప్పైఒకటి శ్లోకాలను వివరించారు.

***సవిత్రీభిర్వాచాం శశిమణిశిలాభంగరుచిభి***
***ర్వశిన్యాద్యాభిస్త్వాం సహ  జనని సంచింతయతి యః***
***స కర్తా కావ్యానాం భవతి మహతాం భంగిసుభగై***
***ర్వచోభిర్వాగ్దేవీవదనకమలా మోదమధురైః***

***చతుష్షష్ట్యా తంత్రైః సకలమతిసంధాయ భువనం***
***స్థితస్తత్తత్సిద్ధిప్రసవపరతంత్రైః పశుపతిః***
***పునస్త్వన్నిర్బంధాదఖిలపురుషార్థైకఘటనా***
***స్వతంత్రం తే తంత్రం క్షితితలమవాతీతరదిదమ్ ॥***

స్వామి ప్రణవానందులవారు తమ శ్రీచక్రము అనే పుస్తకంలో ప్రస్తారాలను ఐదు రకాలుగా వర్గీకరించారు.

**1. భూప్రస్తారము :** ఒక చతురస్రపు రేకు లేదా కాగితం మీద శ్రీచక్రంలో గల తొమ్మిది చక్రాలను రాసేది.

**2. కూర్మప్రస్తారము :** ఇది తొమ్మిది అంతస్థులుగా ఉంటుంది. భూపురము వృత్త త్రయాలు ఒక రేకు మీద రాసి దానిపైన మిగిలిన ఎనిమిది చక్రాలు కొద్ది కొద్ది తేడాతో పైపైకి తాబేలు వలె పెంచుకుంటూ పోతారు. చూడటానికి ఇది తాబేలు లాగా అనిపిస్తుంది.

**3. అర్థమేరు ప్రస్తారము :** ఇది నాలుగు అంతస్థులుగా ఉంటుంది. ఒక రేకు మీద భూపురము, వృత్తాలు రాస్తారు. వాటికి కొంచెం ఎత్తులో షోడశదళము,అష్టదళము ఒక దానిపై ఒకటి వ్రాస్తారు. దానిమీద సమతలం పైన నలభైమూడు కోణాలు గీస్తారు.

**4. కైలాస ప్రస్తారము :** ఇది మూడు అంతస్థులుగా ఉంటుంది. అవి వరుసగా

1. భూపురము, షోడశదళము, అష్టదళములు. వృత్తాలు ఒకే సమతలం మీదగీస్తారు.
2. చతుర్దశకోణము, దశార యుగ్మము
3. అష్టకోణము, త్రికోణము, బిందువు

**5. మేరు ప్రస్తారము :** ఇది మొత్తం తొమ్మిది అంతస్థులుగా ఉంటుంది. దీనిలో భూపురము, వృత్తాలు ఒకే సమతలం మీద గీస్తారు. మిగిలిన ఎనిమిది చక్రాలు ఎనిమిది అంతస్థులుగా ఉంటాయి. చూడటానికి శంఖం ఆకారంలో ఉంటుంది.

మేరు ప్రస్తారంలో కొన్ని చోట్ల వృత్తాలు ఒకేచోట అనగా షోడశ దళానికి, భూపురానికీ మధ్య ఉండగా, మరికొన్నింటిలో చతుర్దశదళం తరువాత ఒకటి అష్టదళము తరువాత ఒకటి, షోడశ దళము తరువాత ఒకటి వృత్తాలు ఉన్నాయి. ఇది సంప్రదాయ భేదము.

శ్రీచక్రంలో భూపురానికి నాలుగువైపులా నాలుగు ద్వారాలుంటాయి. కాని (స్వామి ప్రణవానందుల మతానుసారము శ్రీచక్రంలో భూపురానికి ద్వారాలు లేవు. గురుమండలం కూడా లేదు. గురుపూజను బిందువు మీదనే చెయ్యాలి. శక్తి సంగమ తంత్రంలో ఈ విధంగా ఉంది.

*శుద్ధచక్రమిదం ప్రోక్తమిదమేవ త్రిధాభవేత్ ।*
*భూః కైలాసస్తథామేరుః । ప్రస్తారత్వేన పార్వతి ॥*

***భూప్రస్తారో ద్విధాదేవీ । పాతాళోర్ధ్వ క్రమేణతు ।***
***కైలాసాఖ్యస్తు ప్రస్తారో । ద్వివిధః పరికీర్తితః ।***
***అర్ధ కైలాస సంజ్ఞస్తు । పూర్ణకైలాసక స్తథా ।***
***తదైవ మేరు ప్రస్తారః । కీర్తి తస్తు మయాతవ ।***

శ్రీచక్రాన్ని శుద్ధచక్రం అని కూడా అంటారు. ఇది మూడు రకాలుగా ఉంటుంది.

1. భూప్రస్తారము 2) మేరు ప్రస్తారము 3) కైలాస ప్రస్తారము

భూప్రస్తారము రెండు రకాలు. అవి : 1) పాతాళ భూప్రాస్తరము 2) ఊర్ధ్వభూప్రస్తారము.

మేరు ప్రస్తారము రెండు రకాలు అవి : 1) అర్ధమేరువు 2) పూర్ణమేరువు.

కైలాస ప్రస్తారము రెండు రకాలు అవి : 1) అర్ధ కైలాసప్రస్తారము 2) పూర్ణ కైలాస ప్రస్తారము.

శ్రీవిద్యార్ణవ తంత్రంలో ఈ విధంగా చెప్పబడింది.

***ప్రస్తారోత్రి థాప్రోక్తః శ్రీచక్రస్య తధేశ్వరీ ।***
***మేరు కైలాస భూ సంజ్ఞా భేదాస్యస్వత్రిధా భవేత్ ॥***

***మేరుప్రస్తారకం యంత్రం నిత్యాతాదాత్మ్యకం స్మృతం ।***
***మాతృకాయాస్తు కైలాస ప్రస్తారాఖ్యాం సురేశ్వరీ ॥***

***భూప్రస్తారం మహా దేవి వశిన్యాత్మకముత్తమమ్ ।***
***సృష్టిక్రమం మేరు చక్రం కైలాసంచార్ధ మేరుకమ్ ।***
***సంహారాఖ్యం మహేశాని భూప్రస్థారం స్థితిక్రమమ్ ॥***

***ఏకైకస్యతు చక్రస్య త్రిభేదాస్తు భవన్తిహి ।***
***సృష్ట్యాది భేదైర్దేవేశి సంహారం కౌలికం మతమ్ ॥***
***సృష్టిక్రమంతు సమయమతం స్యాత్ స్థితి సంజ్ఞకమ్ ॥***
***శుద్ధంతుకథితం దేవి రహస్యాతి రహస్యకమ్ ।***
***మేరుచక్రేతు సంహారక్రమ పూజ న విద్యతే ॥***

**సృష్టిక్రమేణ దేవేశి పూజనీయం ప్రయత్నతః ।**
**సంహార పూజాకైలాస ప్రస్తారేఽ త్ర విధీయతే ॥**

**భూప్రస్తార మహేశాని స్థితి పూజా మహోత్తమా!**
**స్థితిక్రమోగృహస్థస్య సంహారో వనినో యతేః ॥**

శ్రీచక్రము యొక్క ప్రస్తారాలు మూడు రకాలుగా చెప్పబడ్డాయి.

1) భూప్రస్తారము 2) మేరుప్రస్తారము 3) కైలాసప్రస్తారము.

1) భూప్రస్తారములో వశిన్యాది తాదాత్మ్యము.

2) మేరుప్రస్తారంలో షోడశనిత్యలకు తాదాత్మ్యము

3) కైలాసప్రస్తారంలో మాతృకా తాదాత్మ్యము చెప్పబడ్డాయి. వీటిలో

| | | |
|---|---|---|
| భూప్రస్తారము | - | స్థితి క్రమము |
| మేరు ప్రస్తారమ | - | సృష్టి క్రమము |
| కైలాస ప్రస్తారము | - | సంహార క్రమము. |

ఒక్కొక్క ప్రస్తారంలో సృష్టి, స్థితి, సంహార భేదాలున్నాయి. సృష్టి క్రమము - సమయమతము. సంహార క్రమము కౌళమతము. మేరు చక్రంలో సంహార పూజలేదు. సృష్టిపూజ మాత్రమే చెయ్యాలి. భూప్రస్తారంలో స్థితిక్రమంలో పూజ చాలా ఉత్తమమైనది. గృహస్థులు స్థితిక్రమంలోను, వానప్రస్థులు సంహారక్రమంలోను శ్రీచక్రాన్ని పూజించాలి.

తంత్రాలలో చెప్పినవి ఈ మూడు రకాలే అయినప్పటికీ వాడుకలో చాలా రకాలయిన శ్రీచక్రాలు కన్పిస్తున్నాయి.

మద్రాసు దగ్గర మూకాంబా దేవాలయంలో అర్ధ మేరువున్నది. పుష్పగిరి వైద్యనాథ స్వామివారి ఆలయంలో అమ్మవారి దగ్గర శిలా నిర్మితమైన కైలాస ప్రస్తారమున్నది. కాని దీనిలో షోడశదళాలు లేవు. దళాలు ఊర్ధ్వముఖంగా ఉన్నది పుష్పగిరి పీఠంలో ఉన్నది. ఇటువంటివి దేశంలో నాలుగు, ఐదు మాత్రమే ఉన్నాయని కంచి పరమాచార్యుల వారు సెలవిచ్చారు. శ్రీశైలం, కాంచీపురం, కామాక్షీ ఆలయాల్లో శిల మీద భూప్రస్తారం ఉన్నది. ఈ రకంగా భిన్న రీతులలో శ్రీచక్ర నిర్మాణం జరిగిందని పుష్పగిరి పీఠ ఆస్థాన విద్వాంసులు శ్రీ విశ్వనాథంగారన్నారు.

ఒక స్వామివారి పీఠంలో శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలు విడివిడిగా తయారు చేయబడి ఉన్నాయి. వాటిని ఒకదానిపై ఒకటి పేర్చినట్లైతే మేరువు వస్తుంది. అటువంటిదే చెక్కతో చేసిన శ్రీచక్రం కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠానికి భవిష్యత్యధిపతి అయిన శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద స్వామి (శ్రీ యాబలూరి లోకనాథశర్మ) వారి వద్ద ఉన్నది. ఇంకొక చోట శివచక్రాలన్నీ సమతలంలో ఉండి. శక్తి చక్రాలన్నీ మేరువు ఆకారంలో ఉన్న శ్రీచక్రం చూచాను. నాకు దొరికినంత వరకు విభిన్న శ్రీచక్రాలను ప్రక్క పటాలలో చూపటం జరిగింది. ఇన్ని రకాల చక్రాలున్నప్పటికీ ప్రస్తుతం భూ, మేరుప్రస్తారాలు మాత్రమే వాడుకలో ఉన్నాయి. ఇంతవరకు నేను చూసిన శ్రీచక్రాలలో పదిహేను అంగుళముల మేరువే పెద్దది. కాని కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ చిదానంద భారతీస్వామి వారి ఆధ్వర్యంలో తొంభై ఆరు సెంటీమీటర్లు ఎత్తుగల మేరువును గ్రానైట్ రాయితో తయారు చేస్తున్నారు. అది గనక పూర్తయితే దేశంలో కెల్ల బహుశ ఇదే పెద్ద సైజు మేరువు కావచ్చు.

బజారులో అమ్మే పటాలలో భూప్రస్తారము మైసూరు వారి ప్రతి 14×20 సైజులో లభ్యమవుతున్నది. దానిమీద కర్ణాటక సింహాసన స్థాపనాచార్యులైన విద్యారణ్యులు, రెండవ వేంకటపతి మహారాజు గారి పట్టాభిషేక దీక్షా గురువులైన తాతాచార్యులవారిచే సిద్ధాంతీ కరించబడినదని వ్రాయబడి ఉంది. దీనిలో షోడశ, అష్టదళాలుండవు. ఆ స్థానంలోవివిధ దేవతల పేర్లతో పది ఆవరణలున్నాయి. శక్తి కోణాల స్థానంలో ఐదు ఆవరణలు లేవు. నాలుగు మాత్రమే ఉన్నాయి. మధ్యన త్రికోణం ఉంది. మొత్తం కోణాల సంఖ్య నలభై రెండు. ఈ చక్రం పైన భూపురానికి లోపల ఐదు శిఖరాలతో పాటుగా నాలుగు మూలల బాల, భువనేశ్వరి, సుబ్రహ్మణ్య, గణపతి యంత్రాలున్నాయి. ఇందులో త్రిశూలము, చక్రము చూపబడ్డాయి. కాబట్టి వైష్ణవంతో కలిసిన శాక్తేయంగా దీన్ని భావించవచ్చు.

తొమ్మిది ఆవరణలతోను, ఆయాస్థానాలలో ఉండే దేవతల పేర్లతో సహా శ్రీచక్రము 14″×20″ సైజులలో దొరకుతోంది. ఇది సంప్రదాయబద్ధమైన చక్రము. దీని కాపీలు "రాఘవేంద్ర పబ్లిషర్స్" విజయవాడ వారి దగ్గర లభ్యం అవుతాయి.

**ప్రస్తారభేదాలతో వివిధ రకాల శ్రీచక్రాలు :**

**భూప్రస్తారము :** బంగారము, వెండి, రాగి, రేకుల మీదగాని, భూర్జరీపత్రం, పట్టువస్త్రం మీదగాని వ్రాయబడి ఉంటుంది. దీనిలో రెండురకాల చక్రాలున్నాయి.

**1. కౌళమతానుసారము :** శక్తికోణాలు నాలుగుక్రిందికీ, ఐదుపైకి ఉంటాయి. బిందువు త్రికోణంలో ఉంటుంది. ఇందులో అనేక రకాల చక్రాలున్నాయి.

**2. సమయమతాను సారము :** శక్తికోణాలు ఐదు క్రిందకీ, నాలుగు పైకీ ఉంటాయి. బిందువు త్రికోణంలో ఉంటుంది. ఇందులో అనేక రకాల చక్రాలున్నాయి.

1. త్రికోణంలో బిందువు

2. లక్ష్మీధరుల ప్రకారం చతుష్కోణంలో బిందువు

3. వృత్తంలో బిందువు

4. స్వామిప్రణవానంద ప్రకారం భూపురానికి ద్వారాలు లేవు.

5. మద్రాసు వారి పద్ధతి. ముద్దలు ముద్దలుగా ఉంటుంది. ఎక్కువగా వీటి స్టిక్కర్లు దొరుకుతాయి.

6. రాఘవేంద్ర పబ్లిషర్స్ వారమ్మే సంప్రదాయక చక్రం.

7. మైసూరులో వారి ప్రతి

8. శ్రీశైలంలో శిలానిర్మితం. అష్ట, షోడశదళాలతోబాటుగా ఇందులో ద్వాదశ దళం కూడా వుంది.

9. శ్రీచక్రంలో అష్టదళము, షోడశదళముతో పాటుగా ముప్పై రెండు దళాలు కూడా ఉన్నాయి.

10. వారణాశిలోని చౌకాంబా పబ్లిషర్స్ వారు ముద్రించిన సబీజచక్రం. ఇందులో ద్వారాలలోపలి గోడలు దళాలని తాకుతుంటాయి.

11. సబీజచక్రం

12. దీనిలో అష్టదళానికీ, షోడశదళానికీ మధ్య ద్వాదశదళం ఉంది. దేవి భాను మండల మధ్యస్థ అని చెప్పబడుతోంది. కాబట్టి ద్వాదశాదిత్యులకు ప్రతీకలుగా ద్వాదశదళాలున్నాయి.

**మేరు ప్రస్తారము :** ఇది శంఖం ఆకారంలో ఉంటుంది. ఇది ఆరురకాలుగా కనిపిస్తోంది.

**1) అర్థ మేరువు :** నాలుగు అంతస్థులుగా ఉంటుంది.

1. భూపురం, వృత్తాలు సమతలంలో ఉంటాయి, 2. షోడశదళం, 3. అష్టదళం, 4. నలభైమూడు కోణాలు. బిందువు.

**2) పూర్ణమేరువు :** తొమ్మిది ఆవరణలు విడివిడిగా ఉంటాయి. దీనిలో వృత్తాలు చతుర్దశకోణము తరువాత, అష్టదళం తరువాత షోడశదళం తరువాత ఉంటాయి.

**3) అధోదళము :** దళాలు బాగా క్రిందివైపుకు వంగి ఉంటాయి.

**4) ఊర్ధ్వదళం :** దళాలు పైకి చూస్తూ ఉంటాయి.

5) తొమ్మిది ఆవరణలు విడివిడిగా ఉంటాయి.

6) భూపురము, అష్ట, షోడశదళాలు ఒకే తలంలో ఉండి శక్తి చక్రాలు ఐదు అంతస్థులుగా ఉంటాయి.

**3) కూర్మప్రస్తారం :** భూపురము, వృత్తాలు సమతలంలోను, మిగిలిన ఎనిమిది ఆవరణలు కొంచెం కొంచెం ఎత్తుగాను ఉంటాయి.

**4) కైలాస ప్రస్తారం :** ఇది మూడు అంతస్థులుగా ఉంటుంది.

మొదటి అంతస్థులో – భూపురము, దళాలు.

రెండవ అంతస్థులో – చతుర్దశకోణము, దశకోణ యుగ్మము.

మూడవ అంతస్థులో – అష్టకోణము, త్రికోణము, బిందువు ఉంటాయి.

5) అర్థకైలాస ప్రస్తారం పటం దొరటకం లేదు.

## శ్రీచక్రానికి - పిరమిడ్‌లకు సారూప్యత

హైందవ సంప్రదాయంలో విశ్వవిజ్ఞానాన్ని చాటిచెప్పే శ్రీచక్రంలోని కోణాలకు, ఈజిప్టులోని పిరమిడ్‌ల కోణాలకు సామీప్యత ఉన్నదని మద్రాసుకు చెందిన. ఆర్.కె.యస్. ముత్తుకృష్ణన్ అనే శాస్త్రజ్ఞుడు నిరూపించాడు. ఈ విషయం 27–10–97 సోమవారం నాటి **వార్త** దిన పత్రికలో ప్రచురింపబడినది.

# సమయమత సిద్ధాంత ప్రకరణము

**భవేన్మూలాధారం తదుపరితనం చక్రమపి త**
**ద్వయం తౌమిస్రాఖ్యం శిఖికిరణ సంమేళనవశాత్ !**
**తదేతత్ కౌలానాం ప్రతిదిన మనుష్ఠేయముదితం**
**భవత్యా వామాఖ్యం మతమపి పరిత్యాజ్య ముభయమ్॥ 42**

కౌళాచారులు షట్చక్రాలలోని ఆధారచక్రాన్ని పూజిస్తారు. కుః అంటే పృథివీ తత్త్వము. అది షట్చక్రాల్లోనూ ఏ చక్రమందు ఉంటుందో దానిని కులము అంటారు. ఇది ఆధారచక్రంలో ఉంటుంది. శ్రీచక్ర ఉపాసన చేసే వాళ్ళను రెండురకాలుగా విభజిస్తారు. అర్ధకామాలకోసం దీనిని అర్చించే వారిని కౌళాచారులనీ, మోక్షప్రాప్తికోసం అర్చించే వారిని సమయాచారులనీ అంటారు. శ్రీచక్రానికి బాహ్యపూజ చేసేవారు కేవలం కామ్యసిద్ధికోసమే చేస్తారు. అందుకే వీరు పృథివీతత్త్వాత్మకమైన ఆధార చక్రాన్ని పూజిస్తారు. వీరి పూజను 'కౌళము' అనీ వీరి ఆచారాన్ని 'కౌళాచారము' అనీ అంటారు. వీరు శ్రీచక్రానికి బాహ్యపూజ చేస్తారు. అంటే శ్రీచక్రాన్ని భూర్జీరీపత్రము, పట్టు వస్త్రము, బంగారము లేదా వెండి రేకుల మీద వ్రాసి దాన్ని ఆరాధిస్తారు.

ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. మూలాధారంలో సూర్యకిరణ సంపర్కం ఉండడంచేత ఇది అంధతామిస్రలోకము. ఇక్కడ కుండలినీశక్తి నిద్రావస్థలో ఉంటుంది. స్వాధిష్ఠానంలోని చంద్రకిరణాలను అగ్ని మింగివేస్తుంది. కాబట్టి ఇదికూడా అంధకార లోకమే. కౌళమతంలో ప్రతిరోజూ ఈ రెండు చక్రాలనే పూజిస్తారు.

ఆధారచక్రమే త్రికోణము. అందులో బిందువున్నదని ప్రసిద్ధి. 'త్రికోణే బైందవం శ్లిష్టమ్ అనే దాని వల్ల శ్రీచక్రంలో బిందువు త్రికోణంలోనే ఉంటుంది అని తెలుస్తుంది. కౌళమతాను సారము త్రికోణమే బిందుస్థానము. బిందువే త్రికోణమందు ఆరాధింపతగ్గది. అందుకే కౌళులు త్రికోణాన్ని పూజిస్తారు. ఈ త్రికోణము రెండురకాలుగా ఉంటుంది. 1. శ్రీచక్రం మధ్యన త్రికోణము, 2. స్త్రీ యొక్క ప్రత్యక్షయోని. కౌళాచారులను రెండు రకాలుగా విభజించవచ్చు.

1. పూర్వకౌళులు 2. ఉత్తరకౌళులు.

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని బంగారము, వెండిరేకుల మీద కాని, భూర్జరీ పత్రము, పట్టువస్త్రముల మీదగాని వ్రాసి దాన్ని పూజిస్తారు. ఉత్తర కౌళులు స్త్రీ యొక్క ప్రత్యక్ష

యోనిని పూజిస్తారు. ఆధారచక్రంలో గల కుండలినీ శక్తిని కౌళిని అంటారు. త్రికోణంలో బిందురూపంలో ఈ శక్తి ఉంటుంది. త్రికోణ పూజలో కౌళిని ఏ ఉపాస్య. కుండలినీ శక్తి సదా నిద్రాణమై ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ ఆ శక్తి పూజింప తగ్గదే అని వీరి భావము. అందుకే ఈ పూజను తామిస్రము అంటారు. ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. వాటి యందు కౌళులకు మాత్రమే అధికారం ఉంది. కుండలినీ ప్రబోధం ఎప్పుడు కలుగుతుందో ఆ క్షణంలోనే కౌళులకు ముక్తి కలుగుతుంది. అందుకనే కౌళులను 'క్షణముక్తులు' అంటారు. కౌళులకు త్రికోణం లోని భైరవీ భైరవులు పూజనీయులు.

**జపాకుసుమ సంకాశౌమధు ఘూర్ణితలోచనౌ ।**
**జగతః పితరౌ వందే భైరవీ భైరవాత్మకౌ॥**

సాధకులు వారితో ఐక్యముపొందటం అనేదే ముఖ్యం. అందుకనే బిందువును పూజించేటప్పుడు స్త్రీ పురుషులు భైరవాకారమైన దిగంబరత్వాన్ని ఆశ్రయించి వారు దిగంబరులై వామాచార ప్రవృత్తి ననుసరించి పూజ చేస్తారు. మ కార పంచకము అంటే తంత్ర శాస్త్రాలలో ఈ విధంగా ఉంది.

**మద్యం, మాంసం, తధా మత్స్యం ముద్రా, మైధున మేవచ**
**శక్తిపూజా విధానాద్యై పంచతత్త్వ ప్రకీర్తితం ।**

ఉత్తరకౌళులు స్త్రీ యోనిలోని మన్మధఛత్రాన్ని బిందువుగా భావించి పూజిస్తారు. అందుకే ఈ పూజ అవైదికము, నీతి బాహ్యము అని చెప్పబడింది.

శక్తి సంగమ తంత్రంలో చెప్పినట్లుగా

**అర్చనం ద్వి విధం చైవ వామ దక్షిణ భేదతః**
**వామేనవా దక్షిణేన పూజనంతు యధారుచిః**
**దక్షిణాచార యోగేన సిద్ధ్యత్యే న సంశయః**
**వామే చారేణాపితధా సిద్ధ్యత్యేన మహేశ్వరి॥**

ఓ పార్వతీ ! వామాచారము అని, దక్షిణాచారము అనీ అర్చన రెండు విధాలుగా ఉన్నది. సాధకుడు ఏ విధంగానైనా అర్చన చేయవచ్చు. దక్షిణాచారం లోనే కాదు. వామాచారంలో కూడా సాధకుడికి సిద్ధి కలుగుతుంది.

లలితాసహస్రంలో కూడా ఇదే చెప్పబడింది.

*కులాంగనా కులాంతస్థా కౌలినీ కులయోగినీ।*

*అకులా సమయాన్తస్థా సమయాచారతత్పరా॥*

అయినప్పటికీ విశ్వమానవ శ్రేయస్సుకోసం అవైదికము, నీతిబాహ్యము అయిన అర్చనా విధానాలను నిషేధించటం జరిగింది.

నాలుగుదళాలు కలిగిన మూలాధారచక్రాన్ని ఆరుదళాలు కలిగిన స్వాధిష్ఠానంతో సంధానము చెయ్యటంవల్ల కౌళులకు షట్కమల సంధాన ఫలం కలుగుతుంది. కాని షడ్విధైక్య సంధానము లేకపోవటం చేత దేవి సాయుజ్యం సిద్ధించదు.

## నిషిద్ధాచారము

*అమీషాం కౌలానాం భగవతి భవేత్పూజనవిధి*

*స్తవ స్వాధిష్ఠానే తదనుచ భవేన్మూల సదనే ।*

*అతో బాహ్యపూజా భవతి భగరూపేణ చ తతో*

*నిషిద్ధాచారో యం నిగమ విరహో ఽ నింద్య చరితే॥* **43**

షట్చక్రాలలో మొదటిచక్రాన్ని మూలాధారం అంటారు. మూల అంటే గుదస్థానము. కౌలమతము వారు మూలాధారస్వాధిస్థాన చక్రాలనే పూజిస్తారు. కాని వస్తుతః వారు ఆధారచక్రాన్ని పూజిస్తారు. వీరు ప్రత్యక్ష శ్రీచక్రాన్ని పూజిస్తారు. అంటే గతంలో చెప్పినట్లుగా బంగారు, వెండిరేకుల మీదగాని, భూర్జరీ పత్రం మీద గాని, శ్రీచక్రాన్ని గీసి పూజిస్తారు. వీరికి బాహ్యపూజ యందు, ఐహిక సుఖాలయందే ఆసక్తి. వీరిలో కొంత మంది స్త్రీయొక్క యోనిని ప్రత్యక్షంగా పూజిస్తారు. ఇది అథోముఖ పూజ. కొంత మంది స్త్రీని తలక్రిందులుగా ఉంచి అప్పుడు యోనిని పూజిస్తారు. ఇది ఊర్ధ్వముఖ పూజ. ఇవి హేయము, నీతిబాహ్యము, జుగుప్సాకరమైన పూజలు. అందుచేతనే ఇవి నిషేధములు. త్రికోణము అంటే స్త్రీ యొక్క జననాంగము కాదు. "బైందవం బ్రహ్మ రంధ్రంచ మస్తకం చ త్రికోణకం" అని చెప్పబడింది. బ్రహ్మరంధ్రమే బిందువు. తలముందే భాగమే త్రికోణము. త్రికోణము అంటే స్త్రీ యోని అని అర్థం చెపుతున్నారు కాబట్టే లక్ష్మీ ధరులు బిందువు త్రికోణములో ఉండదు. చతుష్కోణంలో ఉంటుంది. ఆ చతుష్కోణమే సహస్రారము అన్నారు. భగవతీ! నీవు అనింద్య చరితవు. నిందింపబడరాని చరిత్ర కలదానవు. అందుకే కౌళవామా చారములు నీ పూజకు పనికిరావు. ఇది గౌడపాదాచార్యుల వారి అభిప్రాయము.

## నవవ్యూహాలు

*నవవ్యూహం కౌలప్రభృతిక మతం తేన స విభు*
*ర్ణ వాత్మా దేవో ౭ యం జగదుదయకృ ద్భైరవవపుః !*
*నవాత్మా వామాది ప్రభృతిభిరిదం భైరవవపు*
*ర్మహాదేవీ తాభ్యాం జనకజననీమజ్జగదిదమ్॥* 44

కౌళులు పరమేశ్వరుణ్ణి నవాత్మకుడు లేదా నవవ్యూహాత్మకుడు అంటారు. నవవ్యూహాలను గురించి కామకళ విద్యలో చెప్పటం జరిగింది.

*కాలవ్యూహః కులవ్యూహో నామవ్యూహ స్తథై వచ*
*జ్ఞానవ్యూహ స్తథా చిత్తవ్యూహ స్స్యా త్తదనంతరమ్॥*
*నాదవ్యూహ స్తథా బిందు వ్యూహస్స్యా త్తదనంతరమ్*
*కలావ్యూహ స్తథా జీవవ్యూహస్స్యా దితి తే నవ॥*

**1) కాలవ్యూహము :** నిమిషము మొదలు కల్పాంతము వరకుగల కాలము యొక్క సముదాయము.

**2) కులవ్యూహము :** ఎరుపు, తెలుపు, నీలము మొదలైన రంగులను గురించి తెలిపేది.

**3) నామవ్యూహము :** ప్రపంచంలోని ప్రాణులయొక్క పేర్లను తెలిపేది.

**4) జ్ఞానవ్యూహము :** ఇంద్రియాలద్వారా ప్రపంచాన్ని గురించి తెలుసుకునే జ్ఞానము.

**5) చిత్త వ్యూహము :** అహంకారము, బుద్ధి, చిత్తము, మహత్తత్త్వము, మనస్సు అను అహంకార పంచకము గురించి తెలిపేది.

**6) నాదవ్యూహము :** రాగము, ఇచ్ఛ, కృతి, ప్రయత్నము, మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, పర, పశ్యంతి, మధ్యమవైఖరులు గురించి తెలిపేది.

**7) బిందువ్యూహము :** ఆధారాది షట్చక్రముల సంఘము.

**8) కళావ్యూహము :** యాభై కళలై, వర్ణస్వరూపములైన అక్షరములను గురించి తెలిపేది.

**9) జీవవ్యూహము :** భోక్తలగు జీవుల సమూహము.

*జపాకుసుమ సంకాశౌ మదఘూర్ణిత రోచనౌ*
*జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ॥*

ఈ చరాచర జగత్తునకు తల్లి దండ్రులయిన భైరవీ భైరవులకు నమస్కరించుచున్నాను.

భైరవీ భైరవులకు తొమ్మిది రకాల ఐక్యము ఉన్నది అని కౌళమతరహస్యము. అందుకనే పరమేశ్వరుణ్ణి నవాత్మకుడు అంటారు.

**నవవ్యూహాత్మకోదేవః పరానంద పరాత్మకః**
**నవాత్మా భైరవోదేవో భుక్తి ముక్తి ప్రదాయకః॥**
**పరానంద పరాశక్తిః చిద్రూపాఽఽనందభై రవీ**
**తయోర్యదా సామరస్యం జగదుత్పద్యతే తదా॥**

పరమానందుడు పరాత్మకుడు అగు భైరవుడు నవవ్యూహాత్మకుడు ఆయనే. భక్తిముక్తి ప్రదాత. పరమానందయైన పరాశక్తి. చిద్రూప అయిన ఆనందభైరవి అవుతుంది. ఈ భైరవీ భైరవులకు సామరస్యము ఎప్పుడు కలుగుతుందో అప్పుడు జగదుత్పత్తి జరుగుతుంది. సూతసంహితలో చెప్పినట్లుగా

**"యథామాతా పితృభ్యాం తు వర్థతే మానవా భువి ।**
**తథైతాఖ్యామిదం కృత్స్నం వర్థతే నాత్ర సంశయః॥**

జగదుత్పత్తి హేతువైన లాస్యతాండవ పరాయణత్వం వలన శివాశివులకు పితృభావము కలుగుచున్నది.

**"ఆధారవాతరోధేన శరీరం కంపతేయదా ।**
**ఆధారవాతరోధేన యోగీ నృత్యతి సర్వదా॥**
**ఆధారవాతరోధేన విశ్వం తత్రైవదృశ్యతే।**
**సృష్టిరాధారమాధారే ఆధారే సర్వదేవతాః॥**

ఆధారచక్రము ప్రాణనిరోధకము కాగా యోగి నృత్యము చేయటం ప్రారంభిస్తాడు. ఆధారచక్రం లోనే ఈ విశ్వం అంతా గోచరమవుతుంది. సృష్టికి ఆధారమైనది ఆధార చక్రమే. ఇదే సర్వ వేదాలకు, సర్వ దేవతలకు ఉనికిపట్టు.

సృష్టి, స్థితి, లయములయందు భైరవీ భైరవులకు ప్రయత్నము ఉత్పన్నము కాగా భైరవియే ప్రధాన ప్రకృతి అవుతుంది. ఆమె ప్రధానత్వమే శేషిత్వము. ఆనందభైరవునకు అప్రధాన గుణభావమగు శేషత్వము. సర్వోప సంహారమందు ప్రకృతి తన్మాత్రావస్థితిలో ఉండడం చేత భైరవుడికి శేషిత్వము. భైరవికి శేషత్వము అని ఆర్యవాక్యము.

కౌళమతంలో భైరవుడు నవాత్మకుడు జగదుత్పత్తి కారకుడు. వామాదిశక్తులలో నవవ్యూహాత్మిక అవటం చేత భగవతికి నవాత్మత్వము చెప్పబడింది. భైరవీ భైరవులే ఈ జగత్తునకు మాతా పితరులు.

వామాది శక్తులు అనగా : 1. వామ 2. జ్యేష్ఠ 3. రౌద్రి 4. అంబికా 5. పశ్యంతీ 6. ఇచ్ఛా 7. జ్ఞాన 8. క్రియా 9. శాంతా అనేవి. ఇవి శ్రీచక్రంలో అధోముఖ చతుర్యోన్యాత్మకలు.

1. ఇచ్ఛా 2. జ్ఞాన 3. క్రియా 4. శాంతా 5. పరా అనేవి శ్రీచక్రంలో ఊర్ధ్వముఖంగా ఉండే శక్తి యోన్యాత్మకలు. నవవ్యూహాత్మకలగు ఈ శక్తుల వల్లనే భగవతికి నవాత్మత్వము చెప్పబడుతోంది.

ఈ శ్లోకాన్ని శంకర భగవత్పాదుల వారు తమ సౌందర్యలహరి లోని 34, 35, 41వ శ్లోకాలలో వివరించారు. నలభైఒకటవ శ్లోకం చివరి పదాలు "జనక జననీ మజ్జగదిదమ్" కూడా ఈ శ్లోకంలోనే.

## మణిపూరపూజ

***భవే దే తచ్ఛక్ర ద్వితయ మతిదూరం సమయినాం***
***విసృజ్యైత ద్యుగ్మం తదను మణిపూరాఖ్య సదనే ।***
***త్వయా సృష్టైర్వారి ప్రతి ఫలిత సూర్యేందుకిరణై***
***ర్ద్విధాలోకే పూజాం విదధతి భవత్యాః సమయినః॥*** ***45***

సమయమతంలో ప్రధానమైనది పారమార్థిక దృష్టి కైవల్యప్రాప్తి. కేవలం కర్మకాండల వల్లనే మోక్షం లభించదు. జీవబ్రహ్మైక్యమే వీరి సిద్ధాంతము. వీరికి శుభాగమపంచకమని పిలువబడే సనక, సనందన, సనత్కుమార, వశిష్ఠ, శుక సంహితలు ప్రమాణాలు. వీరికి బాహ్యపూజ లేదు. (వీరిలో కొందరు మాత్రమే బాహ్యపూజ చేస్తారు.) అంటే వీరు శ్రీచక్రాన్ని వేరుగా పూజింపరు. ఈ విషయాన్ని సనత్కుమార సంహితలో వివరించటం జరిగింది.

***"బాహ్య పూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్య జాతిభిః ।***
***సా క్షుద్రఫలదా (క్షుద్రధర్మదా) నృణాం ఐహికార్థైక సాధనాత్॥"***

***బాహ్యా పూజారతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః ।***
***దిగంబరాశ్చేతిహాసాః (వీతవాసాః) వామకా స్తంత్రవాదినః॥***
***అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః ।***
***జీవన్ముక్తా శ్చరం త్యేతే త్రిషు లోకేషు సర్వదా॥ ఇతి***

ఉత్తమ జాతుల వారికి బాహ్యాపూజ లేదు. ఇతర జాతుల వారు మాత్రమే బాహ్యాపూజ చెయ్యాలి. బాహ్యాపూజ ఐహిక ప్రయోజనకారి అంటే దీని వల్ల అర్థ కామాలు సిద్ధిస్తాయి. ఇది అల్ప ప్రయోజనకారి. కౌళులు, క్షపణకులు, కాపాలికులు, దిగంబరులు, జ్వాలాధరులు (ఇతిహాసులు) వామాచారులు, తంత్రవాదులు మొదలైన వారందరూ బాహ్యాపూజ చేస్తారు. బ్రహ్మావాదులైన వైదికాచార పరులు అంతరారాధన మాత్రమే చేస్తారు. అంటే వీరు శ్రీచక్రాన్ని కాని, దేవి విగ్రహన్ని కాని వేరుగా పూజించరు. వామకేశ్వర తంత్రంలో చెప్పినట్లుగా

***భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా ।***
***శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽఽ శుభా ॥***

ఆధారచక్రంలో కుండలినీశక్తి నిద్రావస్థలో ఉంటుంది. సాధకుడు ప్రాణాయామం చేసి కుండలినీ శక్తిని నిద్రలేపాలి. అప్పుడు ఆ శక్తి ఆధార స్వాధిష్ఠానాలను భేదించుకుని మణిపూరం చేరుతుంది.

సమయమతస్థులకు ఆధార స్వాధిష్ఠానాలలో పూజ నిషేధము. వారు మణిపూరం దగ్గరనుంచి మిగిలిన చక్రాలలో మాత్రమే దేవిని పూజించాలి. మణిపూరము జలతత్త్వము గల చక్రము. ఇది సూర్యమండలము. సూర్యకిరణములు నీటిమీద పడుట వలన ఏర్పడిన ఇంద్రధనుస్సున దేవిని పూజించాలి 'సిద్ధఘటిక'లో

***మణిపూరైక వసతిః ప్రావృ షేణ్యా స్సదాశివః ।***
***అంబుదాత్మతయా ధాతి స్థిరసౌదామినీ శివా॥***

అనాహతము పైన గల సూర్యకిరణములు స్వాధిష్ఠానాగ్నితో చేరి మణిపూరంలో ప్రవేశించి జలతత్త్వం పొంది, ఈ జలముతో జగములను తడుపుతున్నాయని చెప్పబడింది. ఇది ఆగమరహస్యము. మణపూరంలో శ్రీచక్రాత్మిక అయిన నావ ప్రతిష్ఠితమైందని శ్రుతులు చెబుతున్నాయి. కాబట్టి సమయాచారులు మణిపూరంలో ప్రవేశించిన భగవతినే పూజించాలి.

గౌడపాదాచార్యుల వారి మతముననుసరించి షడ్విధైక్య సంధానము చేసిన తరువాత కుండలినీ రూపంలో ఉన్న భగవతి ఆధార స్వాధిష్ఠానాలను భేదించుకుని మణిపూరంలో ప్రవేశిస్తుంది. సూర్యమండలంలోని దేవి నాలుగు చేతులతో ప్రకాశిస్తుంది అని ఆచార్యుల వారి అభిప్రాయము.

**"సూర్య మండలమధ్యస్తాం దేవీం త్రిపురాసుందరీమ్**
**పాశాంకుశ ధనుర్బాణ హస్తాం ధ్యాయేత్సు సాధకః**
**త్రైలోక్యం మోహయేదాసు నరనారీ గణైర్యుతమ్"**

సూర్యమండలంలో పాశము, అంకుశము, ధనుస్సు, బాణములు ధరించి కోట్లకొలది సూర్యచంద్రుల కాంతితో ప్రకాశిస్తున్న ఆ దేవిని పూజించినట్లైతే నరనారీ గణములతో కూడిన ముల్లోకములు సాధకునికి వశీభూతము లవుతాయి. అని గౌడ పాదులు పదహారవ శ్లోకంలో అన్నారు. వీరిమతం ప్రకారం మణిపూరంలో దేవి చతుర్భుజ. కాని దేవికి మణిపూరంలో పదిభుజాలుంటాయని కొందరివాదన. షడ్విధైక్య సంధానము చేసిన వారికి మణిపూరంలో దేవి దశభుజగా దర్శనమిస్తుంది. లక్ష్మీధరులు తమ కర్ణావతంసస్తుతిలో ఈ విధంగా అన్నారు.

**భవాని శ్రీహస్తై ర్వహసి ఫణిపాశం సృణిమథో**
**ధనుః పౌండ్రం పౌష్పం శర మథ జపస్ర క్శుకవరమ్.**
**అథ ద్వాభ్యాం ముద్రా మభయ వర దానైక రసికే**
**క్వణద్వీణాం ద్వాభ్యా మురపి చ కరాభ్యాం చ బిభృషే ॥**

ఈ రకంగా దేవి దశభుజ అని కొందరి అభిప్రాయము. ఏదైనప్పటికీ ఈ రెండు మతములు మాకు సమ్మతములే అని అక్షీధరులు అన్నారు.

ఈ శ్లోకాన్ని శంకరాచార్యుల వారు సౌందర్యలహరి లోని నలభైయవ శ్లోకంలో వివ రించారు.

**తటిత్త్వన్తం శక్త్యా తిమిర పరిపన్థి స్ఫురణయా**
**స్ఫురన్నానారత్నా భరణ పరిణద్ధేన్ద్రధనుషమ్,**
**తవ శ్యామం మేఘం కమపి మణిపూరైక శరణం**
**నిషేవే వర్షన్తం హరిమిహిరతప్తం త్రిభువనమ్.**

# నాద బిందు ఐక్యము

***అధిష్ఠానాధార ద్వితయ మిదమేవం దశదళం***
***సహస్రారాజ్జాతం మణిపురమతో, భూద్దశదళమ్ !***
***హృదంభోజన్మూలాన్నృపదళ మభూత్స్వాంతకమలం***
***తదేవైకో బిందుర్భవతి జగదుత్పత్తికృదయమ్॥*** ***46***

శ్రీచక్రంలో నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు మొత్తం తొమ్మిది చక్రాలు ఉంటాయి. మానవశరీరంలో షట్చక్రాలుంటాయి. ఈ షట్చక్రాలకు శ్రీచక్రంతో ఐక్యమునే 'నాదబిందు ఐక్యము' అంటారు. నాదము అంటే శ్రీచక్రము బిందువు అంటే షట్చక్రాల సమూహము. ఆధారచక్రానికి నాలుగు దళాలుంటాయి. దాని కర్ణిక త్రికోణాత్మిక.

స్వాధిష్ఠానానికి ఆరు దళాలుంటాయి. దాని కర్ణిక అష్టకోణాత్మిక. ఆధార స్వాధిష్ఠానాలు రెండింటికీ కలిసి పది దళాలుంటాయి. మణిపూరానికి పది దళాలుంటాయి. దాని కర్ణిక దశ కోణాత్మిక. అనాహతానికి పన్నెండు దళాలుంటాయి. దాని కర్ణిక రెండవ దశకోణాత్మిక. విశుద్ధి చక్రానికి పదహారు దళాలుంటాయి. దాని కర్ణిక చతర్దుశ కోణాత్మిక. ఆజ్ఞాచక్రానికి రెండు దళాలుంటాయి. దాని కర్ణిక ఒకచోట అష్టదళము రెండవ చోట షోడశదళము. శ్రీచక్రములో మూడు వృత్తాలూ వరుసగా సమయమతానుసారము

1. స్వాధిష్ఠానానికి పై భాగాన – రుద్రగ్రంధి రూపంలోనూ
2. అనాహతానికి పై భాగంలో – విష్ణుగ్రంధి రూపంలోనూ
3. ఆజ్ఞాచక్రానికి పై భాగంలో – బ్రహ్మ గ్రంధి రూపంలోనూ ఉంటాయి.

చతుర్ద్వారాలు కల భూపురము వీటిన్నింటికీ పైన ఉన్నది. దాని కర్ణిక సహస్రదళ కమలము. దీని మధ్యన బైందవ స్థానము ఈ బిందువే జగదుత్పత్తికి హేతువు.

ఆధార స్వాధిష్ఠానాలు కారణ చక్రాలనీ, మిగిలినవి కార్యచక్రాలనీ అంటారు. కారణ చక్రాలను అనుసంధానము చేసినట్లైతే కార్యచక్రాల అనుసంధానము చేసిన ఫలం వస్తుంది. అంటే ఆధార స్వాధిష్ఠానాలను అనుసంధానము చేసినట్లైతే మిగిలిన ఐదు చక్రాలను అనుసంధానము చేసిన ఫలం వస్తుంది. ఇది కౌళమత రహస్యము.

ఈ విషయాన్ని సౌందర్యలహరిలో 99వ శ్లోకంలో వివరించటం జరిగింది.

సరస్వత్యా లక్ష్మ్యా విధిహరి సపత్నో విహరతే
రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణ వపుషా,
చిరంజీవన్నేవ క్షపిత పశు పాశ వ్యతికరః
పరానన్దాభిఖ్యం రసయతి రసం త్వద్భజనవాన్ ॥

## దశరూప బిందువు

సహస్రారం బిందుర్భవతిచ తతో బైందవగృహం
తదేతస్మాజ్జాతం జగదిద మశేషం సకరణమ్ !
తతో మూలాధారా ద్వితయమభవత్తద్దశదళం
సహస్రారాజ్జాతం తదతి దశధా బిందురభవత్॥ 47

సహస్రారము అనేది బైందవ గృహము. దీనిలోనే బిందు వుంటుంది. ఈ బిందువు నుండి సృష్టి అంతా వచ్చింది. ఆధార స్వాధిష్ఠానాలలో ఉన్న పదిదళాలూ సహస్రారం నుండే ఉత్పన్నమైనాయి. అందుచేతనే ఒకే బిందువు పది విధాలుగా కనిపిస్తున్నది.

త్రికోణము మొదలైన చక్రాలన్నీ ఆధారము మొదలైన షట్చక్రాత్మకముగా పరిణతములైనాయి. శ్రీచక్రంలో త్రికోణము బైందవ స్థానము. త్రికోణ త్రయంతో అష్టకోణ నిర్మాణం జరగగా త్రికోణము నుండే బిందు స్థానము వస్తున్నది అని చెప్పబడుతోంది. అసలు బిందువు అనేది చతుష్కోణము మధ్యన ఉంటుంది. **త్రికోణే బైందవం శ్లిష్టం** అని చెప్పబడింది కదా మరి చతుష్కోణంలోకి బిందువు ఎలా వచ్చింది ? అనేది ప్రశ్న. భైరవ యామళము వామకేశ్వర తంత్రాలలో **త్రికోణే బైందవమ్ శ్లిష్టం**' అని చెప్పబడింది. వీటిని ఆధారంగా చేసుకుని వ్రాసిన గ్రంథాలన్నింటిలోనూ బిందువు త్రికోణంలో ఉన్నదనే చెప్పబడింది.

పండితులను కూడా మాయలో పడేస్తున్న తంత్రాలు కాకుండా, సాధకులకు మోక్షమార్గం చూపటానికి వేరే ఏదైనా చెప్పమని పార్వతీదేవి ఈశ్వరుణ్ణి అడిగినప్పుడు, ఆయన శ్రీవిద్యాతంత్రాన్ని చెప్పాడు అని సౌందర్యలహరిలోని ముప్పైఒకటవ శ్లోకంలో చెప్పబడింది. శ్రీవిద్యాతంత్రం అంటే **వామకేశ్వర తంత్రమేనని** కొందరి వాదన. కాని లక్ష్మీధరులు మాత్రం ఇది 'సమయవిద్య' అంటారు. అందుకే లక్ష్మీధరులు బిందువు త్రికోణంలో లేదు చతుష్కోణంలో ఉన్నది చతుష్కోణము అంటే సహస్ర కమలాంతర్గతమైన

చంద్రమండలము అన్నారు. కాని భాస్కరరాయల వారు కూడా బిందువు త్రికోణంలోనే ఖాయం చేశారు. అయితే భాస్కర రాయల వారి మతం ప్రకారము సమయ, వామాచారులు, రెండూ ఉపాసించతగ్గవే కాని లక్ష్మీధరుల ప్రకారము కౌళవామాచారాలు ఉపాసనా యోగ్యాలు కావు. సమయాచారమే ఉపాసించ తగినది. వీరి మతానుసారము చంద్ర మండలం మధ్యన గల బైందవ స్థానమే సుధాసింధువు లేక సరఘ అని పిలవబడుతుంది. ఈ రకంగా బిందువు చతుష్కోణంలో ఉన్నది. త్రికోణపూజ యోని పూజలను ఖండించటం జరిగింది. దీన్ని ఆధారంగా చేసుకుని యోనిపూజచేసే కౌళవామాచారులు స్వాధిష్ఠానం తరువాత బ్రహ్మగ్రంథిని చెప్పగా సమయమతంవారు ఆజ్ఞాచక్రం తరువాత బ్రహ్మగ్రంథిని చెబుతారు.

మూలాధారము మొదలైన షట్చక్రాలకు బిందువే కారణము. అదే ఈ సృష్టికి హేతువు. సహస్రకమలాంతర్గతమై చతుర్ద్వారాత్మక కర్ణికా మధ్యమున గల చతుష్కోణాత్మకమైన శక్తితత్వమే బిందువు. శివతత్త్వము నాదము. ఈ బిందువు పదిరకాలుగా కనిపిస్తుంది.

***దశధా భిద్యతే బిందుః ఏక ఏవ పరాత్మకః***

***చతుర్ధాఽఽధారకమలే షోఢాఽధిష్ఠాన పంకజే***

***ఉభయా కారరూపత్వాదితరేషాం తదాత్మతా.***

ఒకే బిందువు ఆధార చక్రంలోని నాలుగు దళాలలోనూ నాలుగు విధాలుగానూ, స్వాధిష్ఠానంలోని ఆరు దళాలలోనూ, ఆరు విధాలుగానూ మొత్తం పది రూపాలతో కనిపిస్తున్నది. ఆధారచక్రంలోని నాలుగు దళాలు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములకు ప్రతీకలు. ఇవి జగన్నిర్మాణ హేతువులు. స్వాధిష్ఠానంలోగల ఆరు బిందువులు కామక్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలకు ప్రతీకలు ఇవి సంహృత బిందువులు. అందుకే "స్వాధిష్ఠానే సంసారః షడ్బిందుకృతః" అని పతంజలి మహర్షి అన్నారు. ఈ రెండు చక్రాలకు కలిపి మొత్తం పది బిందువులుంటాయి. మణపూరము ఆధారస్వాధిష్ఠానాత్మక మవటంచేతనే ఇక్కడ పది దళాలుంటున్నాయి. ఈ పది ఆధార స్వాధిష్ఠానానికి ప్రతీకలుగా రెండు మొత్తం పన్నెండు దళాలు అనాహతంలో ఉంటాయి. అనాహతంలోని పన్నెండు, ఆధారచక్రంలోని నాలుగు మొత్తం పదహారు దళాలు విశుద్ధి

చక్రంలో ఉంటాయి. ఖచ్చితంగా చెప్పాలంటే మణిపూరంలో పది స్వాధిష్ఠానంలో ఆరు మొత్తం పదహారు దళాలు విశుద్ధి చక్రంలో ఉంటాయి. ఆజ్ఞాచక్రంలో ఆధార స్వాధిష్ఠానా లకు ప్రతీకలుగా రెండు దళాలుంటాయి. ఈ రకంగా మణిపూరం నుంచి ఆజ్ఞాచక్రం వరకు ఉన్న నాలుగు చక్రాలు ఆధార స్వాధిష్ఠాన ప్రతీకలుగా చెప్పబడుతున్నాయి. కాబట్టి ఆధార స్వాధిష్ఠానాలలో తరువాత ఉండే నాలుగు పద్మములు అంతర్భూతం అవుతున్నాయి. అక్కడే బిందువునకు పదిరూపాలు సిద్ధిస్తున్నాయి.

## కౌళమత ఖండము

***తదుతద్బిందోర్వృద్దశక మభవత్తత్ర్వ కృతికం***
***దశారం సూర్యారం నృపదళమభూత్స్వాంత కమలమ్!***
***రహస్యం కౌలానాం ద్వితయమభవన్మూలసదనం***
***తథాధిష్ఠానంచ ప్రకృతి మిహ సేవంత ఇహ తే॥ 48***

బిందువు దశవిధములైనది అని చెప్పుట జరిగింది. ఈ పది రూపాలు మణిపూరంలో ఉన్నాయి. అనాహతంలో పన్నెండు విశుద్ధి చక్రంలో పదహారు దళాలున్నాయి. కౌళా చారులకు ప్రధానమైనవి ఆధార, స్వాధిష్ఠానాలే కాబట్టి కౌళులు వాటినే పూజిస్తారు.

కౌళమతానుసారం శ్రీచక్రంలో అధోముఖంగా నాలుగు, ఊర్ధ్వముఖంగా ఐదు కోణాలుంటాయి. శ్రీచక్రాన్ని గీసి లెక్క పెట్టినట్లైతే ఇరవైనాలుగు సంధులు, ఇరవైనాలుగు మర్మాలు ఉంటాయి. కాని లక్ష్మీధరులు సమయమతం ప్రకారము సంగమ స్థానాలు లేకపోయిన నప్పటికీ శివచక్రాలు నాలుగింటినీ కూడా మర్మస్థానాలుగా గ్రహించాలి అన్నారు. అందుచేత సమయ మతానుసారం మర్మస్థానాలు ఇరవై ఎనిమిది ఉంటే కౌళ మతానుసారం ఇరవైనాలుగు మాత్రమే ఉంటాయి. వీరికి కోణాల సంఖ్యానియమం కూడాలేదు.

కుండలినీ శక్తికి మూడు అవస్థలున్నాయి. అవి 1. కౌమార 2. యోషిత్ 3. పతివ్రత. కౌళమతంలో పతివ్రతావస్థ బ్రహ్మగ్రంథి భేదనం జరిగిన తరువాతనే ఉంటుంది అన్నారు. అందుకే కౌళపూజ అవైదికమైంది.

ఉత్తరకౌళులు శక్తిని ఆరాధిస్తారు. వీరికి శక్తితత్త్వము కన్న వేరుగా శివతత్త్వము లేదు కాబట్టి శివతత్త్వము, శక్తి తత్త్వంలో అంతర్భావం పొందినది అంటారు. అందుకే ఒక్క శక్తి తత్త్వాన్నే వీరు ఆరాధిస్తారు. కౌళమతం ప్రకారము చంద్రకళల యొక్క వృద్ధి క్షయాల ననుసరించి ఒక్కొక్క తిథియందు ఒక్కొక్క నిత్య చొప్పున అనుష్ఠానము చెయ్యాలి. అంతేకాని ప్రతిరోజూ అన్ని నిత్యలనూ అర్చించాలనే నియమం లేదు. మంత్రపునశ్చరణ, జపము, హోమము, బాహ్యపూజ ఇవన్నీ సమయమతంలోలేవు. సమయమతంలో అంతః పూజ మాత్రమే చెయ్యాలనే విషయం గతంలో చెప్పబడింది. కౌళులు భైరవీ భైరవులకు నవవిధ ఐక్యము ఉన్నది అంటారు. దానిని గతంలో నిరూపించటం జరిగింది. **వామకేశ్వర తంత్రం**లో చెప్పినట్లుగా

***భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా ।***

***శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽఽ శుభా ॥***

భగవతి ఆధారచక్రంలో తోకను నోటితో కరిచి పట్టుకున్న పాము ఆకారంలో సదా నిద్రావస్థలో ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ కౌళిని కౌళులకు ఉపాస్యయే కాని నిద్రావస్థలో ఉన్న భగవతిని పూజించే కౌళులకు చరణ నిర్ణేజన జలం (పాదోదకము) లభించదు.

పది రకాలుగా ఉన్న బిందువునుండి దశప్రకృతిక మైన మణిపూరము, అనాహతము, విశుద్ధి, ఆజ్ఞా చక్రములు సంభవించినాయి. ఇవి సమయమతస్థులకు ఉపాసనాస్థానాలు కాని కౌళులకు ఆధార స్వాధిష్ఠానాలే ఉపాసనస్థానాలు కాబట్టి కౌళులకు ప్రకృతి లయాదిక ఫలము లభించదు.

## చంద్రకళ

***అతస్తే కౌలాస్తే భగవతి దృఢ ప్రాకృత జనా***
***ఇతిప్రాహుః ప్రాజ్ఞాః కులసమయ మార్గద్వయవిదః !***
***మహాంతః సేవంతే సకలజననీం బైందవగృహే***
***శివాకారాం నిత్యా మమృతఝరికామైందవ కళామ్॥*** ***49***

కౌళ సమయ మార్గాలు పూర్తిగా తెలిసినటువంటి విజ్ఞులు 'కౌళమతస్థులు వివేకశూన్యులని పామరులని' అంటారు. పండితులు అందరూ సహస్రారంలో శివాశివుల

రూపమునున్న పదహారవ నిత్యనే ఆరాధిస్తారు. సుధాసింధువు మధ్యన ఉన్న ఆ కళయే చంద్రకళ ఆమెయే భగవతి అని చెప్పబడింది.

సహస్రారంలో గల చంద్రమండలమే శ్రీచక్రము ఇది షోడశకళాత్మకము. శిరస్సున గల సహస్ర దళకమలంలో శ్రీచక్రస్వరూపమైన చంద్ర బింబమునకు మధ్య భగవతి ఉంటుంది. ఆమె పాదోదకము అమృతమయము. ఇది శరీరంలోని డెబ్బైరెండువేల నాడీ మండలాన్నీ తడుపుతున్నది.

ఇదే విషయాన్ని లక్ష్మీధరులు ఈ విధంగా అన్నారు. శిరస్సునందు చంద్రమండల మున్నదని యోగ శాస్త్రాలన్నీ చెబుతున్నాయి. సమయాచారము నందు దీన్నే శ్రీచక్రం అంటారు. చంద్రమండలం పదహారు కళలతో కూడినదవటం చేత శ్రీవిద్యకూడా పాడ్యమి మొదలు తిథుల వృద్ధిక్షయాలననుసరించి చెప్పటం చేత చంద్ర మండలము ఇదే అవుతున్నది. బాహ్యమైన చంద్రమండలంకూడా శ్రీచక్రమే అని సుభగోదయ వ్యాఖ్యలో చెప్పబడింది. ఇది అతి రహస్యము. శిరస్సునందలి సహస్రదళ కమలము మధ్య ఉన్న శ్రీచక్రాత్మకమైన చంద్రబింబలో ఉన్న భగవతి పాదము కడిగిన సుధామయమైన జలము సాధకుని శరీరంలోని డెబ్బైరెండు వేల నాడీమండలాన్ని తడుపుతున్నది. ఆ తరువాత మళ్ళీ ఆ కుండలినీ శక్తి భుజంగాకారం రూపంలో ఆధార చక్రంలో ప్రవేశించి నిద్రించు చున్నది. ఈ విషయాన్నే వామకేశ్వర తంత్రంలోకూడా **"భుజంగా కార రూపేణమూలా ధారం సమాశ్రితా"** అని చెప్పబడింది. ఈ విషయము సౌందర్యలహరిలోని పదవ శ్లోకంలో నిరూపించబడింది.

సమయులకు షట్చక్రపూజ నియతము కాదు. వారికి సహస్రకమలమందే పూజ, అంటే సహస్రకమలము బైందవస్థానము. దాని మధ్యనున్న చంద్రమండలము చతు ష్కోణము. దాని మధ్యనున్న బిందువు నందు ఇరవైఐదు తత్త్వములకు అతీతమైనటువంటి ఇరవైఆరవ తత్త్వము, శివశక్తులమేళన రూపము అయిన సాదాఖ్య కళతో అనుసంధానము చేయటం జరుగుతుంది. అందుకనే సమయమతంలో బాహ్యపూజ నిరసించబడింది. చతుర్విధైక్య సంధానము, షడ్విధైక్యసంధానమే భగవతికి సపర్య. ఈ సపర్యకు సాదాఖ్య తత్త్వధ్యానైకనిష్ఠకావాలి. సాదాఖ్య అని పిలువబడేది సహస్రారంలో ఉండే చంద్రకళ.

శ్రీచక్రరూపమైన చంద్ర బింబంలో ఒకే కళ ఉన్నది. అది పరమాకళ ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రుడికి పదిహేను కళలున్నాయి. పదహారవ కళ పరమాకళ. చిద్రూప.

ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రుని కన్న భిన్నమైన చంద్రుడు సహస్రారంలో ఉన్నాడు. ఇదే బైందవ స్థానము సుధాసింధువు, సరఘ. కాబట్టి సమయమతస్థుల సహస్రకమలంలోనే దేవిని పూజించాలి. ఇక్కడ ఉన్న బిందువు శివశక్తుల సమ్మేళనరూప మైన సాదాఖ్య అను ఇరవై ఆరవతత్త్వము. అదే పరబ్రహ్మమహిషి.

## సమయమతశాస్త్రము

***ఇదంకాలోత్పత్తి స్థితి లయకరం పద్మనికరం***
***త్రిఖండం శ్రీచక్రం మను రపిచ తేషాంచ మిలనమ్!***
***తదైక్యం షోఢావా భవతిచ చతుర్ధేతి చతథా***
***తయోః సామ్యం పంచప్రకృతికమిదం శాస్త్రముదితమ్॥ 50***

సహస్ర దళం మధ్యన ఉన్న చిదానంద స్వరూపిణి అయిన భగవతియే సృష్టిస్థితి లయాలకు మూలము. ఆ దేవి యొక్క ప్రతిరూప మయిన శ్రీచక్రము, శ్రీవిద్యా మంత్రము (పంచదశీ మహామంత్రము) రెండూ కూడా మూడు ఖండాలుగా విభజించ బడినాయి. 1. వాగ్భవకూటమి. 2. శక్తికూటమి. 3. కామరాజకూటమి. అయితే శ్రీచక్ర మంత్రాలకు ఐక్యము ఉన్నది. శివ శక్తులకు సామ్యమున్నది. ఇది సమయమత శాస్త్రము.

ఈ శ్లోకంలో గౌడపాదాచార్యులవారు సమయమత శాస్త్ర వివరణ ఇస్తున్నారు. పంచదశీ మహామంత్రమున్న శ్రీచక్రము మూడు ఖండాలుగా విభజించబడింది అని ఆ శ్లోకాలలో నిరూపించటం జరిగింది. ఆ ఖండాన్నే బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి అని కూడా అంటారు. గతంలో 1. మాతృకా మంత్రాలకు, 2. చక్రమంత్రాలకు, 3. చక్రనిత్యలకు, 4. నిత్యలకు కళలకు గల ఐక్యము కూడా వివరించబడింది. చతుర్విధైక్యమనగా

***పిండ బ్రహ్మాండయోరైక్యం లింగ సూత్రాత్మనోరపి ।***
***స్వాపావ్యాకృతయోరైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనోః ॥***

1. పిండాండ బ్రహ్మాండాలకు ఐక్యము
2. లింగ సూత్రాలకు ఐక్యము
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము
4. క్షేత్రజ్ఞ పరమాత్మలకు ఐక్యము

షడ్విధైక్యసంధానము :

1. నాదబిందువులకు ఐక్యము
2. బిందుకళలకు ఐక్యము
3. కళానాదములకు ఐక్యము
4. కళాబిందువులకు ఐక్యము
5. కళానాదములకు ఐక్యము.

ఈ రకంగా ఈ ఐదింటిలోనూ ఆరు విధాలుగా ఐక్యము ఉన్నది. పంచసామ్యమనగా శివశక్తుల షట్చక్రాలలోని ప్రతి చక్రంలోనూ ఐదురకాలుగా పోలికలు కలిగి ఉంటారు. అవి.

1. అధిష్ఠానసామ్యము
2. అనుష్ఠానసామ్యము
3. అవస్థాసామ్యము,
4. రూపసామ్యము
5. నామసామ్యము

వీటిని గతంలో వివరించటం జరిగింది. ఇంకా విపులీకరణ కావాలంటే నేను వ్రాసిన **'శ్రీవిద్యాదర్శనము'**లలో చూడండి.

చతుర్విధైక్య సంధానము చేసిన వారికి భగవతి నాలుగుచేతులతోనూ, షడ్విధైక్య సంధానము చేసిన వారికి పదిచేతులతోనూ మణిపూరంలో దర్శనమిస్తుంది. ఇది సమయమత సిద్ధాంతము.

ఈ రకంగా వివిధ రకాల ఐక్యములు, సంధానాలు, పంచసామ్యాలు చెప్పి 'గౌడపాదాచార్యులవారు ఈ శ్లోకంలో సమయమత శాస్త్రాన్ని వివరించారు.

## ఫలప్రాప్తి :

***ఉపాస్తే రేతస్యాః ఫలమపిచ సర్వాధికమభూ***
***త్తదేత త్కౌలానాం ఫలమివహి చైతత్సమయినామ్ !***
***సహస్రారేపద్మే సుభగ సుభగో దేతిసుభగే***
***పరం సౌభాగ్యం యత్తదిహతవ సాయుజ్యపదవీమ్॥ 51***

దేవిని ఉపాసించినవారికి ఐహిక ఆముష్మికఫలములన్నీ కలుగుతాయి. అయితే దేవిని సమయ కౌళాచారాలలో దేనితో నైనా ఉపాసించవచ్చు. ఈ రెండు పద్ధతులలో కూడా ఒకేఫలం వస్తుంది. కాని సమయమతాలవారికి మాత్రమే సాయుజ్యం లభిస్తుంది.

ఆధారస్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. వీటిలో దేవిపురం నుండి సహస్రారం వరకు మిగిలిన ఐదు చక్రాలే ఉపాసింపతగినవి. ఈ చక్రాల్లో దేవిని ఉపాసించినవారికి ఒక్కొక్క స్థానంలో ఒక్కొక్క ఫలం కలుగుతుంది.

1. మణిపూరంలో దేవీని ఉపాసించేవారు దేవీపురమునకు దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉండగలుగుతారు. దీన్ని "సార్షిరూపముక్తి" అంటారు.

2. అనాహతంలో దేవిని పూజించేవారు దేవీ పట్టణంలోనే నివసించ గలుగుతారు. దీన్ని "సాలోక్యముక్తి" అంటారు.

3. విశుద్ధి చక్రంలో దేవిని పూజించేవారు దేవికి అతి దగ్గరగా సేవకులుగా ఉంటారు. దీన్నే "సామీప్యముక్తి" అంటారు.

4. ఆజ్ఞా చక్రంలో దేవిని పూజించేవారు వేరే దేహం ధరించి దేవితో సమానమైన రూపంలో ఉంటారు. దీన్ని "సారూప్యముక్తి" అంటారు.

5. సహస్రారంలో దేవిని పూజించేవారు జన్మ రాహిత్యం పొందుతారు. అంటే వారికి వేరే జన్మ ఉండదు. వారి జీవాత్మ పరమాత్మలోనే లీనమైపోతుంది. ఇది శాశ్వతమైన ముక్తి. దీనినే "సాయుజ్యం" అంటారు.

ఈ విషయాలన్నీ శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోని 99వ శ్లోకంలో వివరించారు.

సుభగ అంటే చిదానంద భగవతి, మహాత్రిపుర సుందరి. జీవన్ముక్తి అనే సౌభాగ్యము ఇస్తుంది. కాబట్టి దేవిని సుభగ అన్నారు. భగవతిని గనుక ఆరాధించినట్లైతే మొదటిగా సృష్ట్యాది సంబంధాలు తొలగిస్తుంది. అంతా మిధ్య అనే జ్ఞానం కలుగచేసి సాధకుడికి నేను అనే భ్రాంతిని పోగొట్టి జీవాత్మను పరమాత్మలో లీనం చేస్తుంది. దీన్నే "సాయుజ్యం" అంటారు. ఇది పరమోత్కృష్టమైన సౌభాగ్యము, ఆ దేవి ఉండేది సహస్రారంలో. ఆధార చక్రంలో నిద్ర పోతున్న శక్తిని మేల్కొల్పితే సహస్రారంలో విద్యుల్లతవలె ప్రకాశిస్తుంది. అనగా దేవి సహస్రారంలోనే ఉదయిస్తుంది.

సహస్రారంలో ఉదయించి సాధకుడికి అనితరసాధ్యమైన సాయుజ్యాన్ని ప్రసాదించే ఆ భగవతిని గూర్చి చేసిన స్తుతి కాబట్టి దీన్ని **"సుభగోదయస్తుతి"** అన్నారు.

## గురుకృప

***అతో ఽ స్యాః సంసిద్ధౌ సుభగ సుభగాఖ్యా గురుకృపా***
***కటాక్ష వ్యాసంగా త్స్రవద మృత నిష్యంద సులభా!***
***తయావిద్ధో యోగీ విచరతి నిశాయామపి దివా***
***దివాభానూ రాత్రౌ విధురివ కృతార్థీ కృతమతిః॥*** **52**

సాధకుడు ఎప్పుడూ గురుముఖముననే దీక్ష స్వీకరించాలి. గ్రంథాలలో చదివి సాధన చేయరాదు. మొదటగా మంత్రాన్ని గురుముఖతః తీసుకుని సాధనచేసి ఆ మంత్రం సిద్ధించిన తరువాత అంటే తనకుతాను అస్థిత్వాన్ని సంపాదించుకున్న తరువాత, తప్పనిసరి అయితే అప్పుడు గ్రంథస్థం అయిన మంత్రాల జోలికి వెళ్లవచ్చు. అంతేకాని ముందు మాత్రం కాదు. చదువుకునే విద్యార్ధి సొంతగా లెక్కలు చేసుకోవాలంటే చాలా ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. అదే ఉపాధ్యాయుడు చెప్పిన తరువాత లెక్కచేస్తే చాలా త్వరగా వస్తుంది. దీనికి కారణం ఉపాధ్యాయుడు లెక్క చేయటానికి గల పద్ధతులు, అందులోని మెళకువలు చెబుతాడు. అలాగే గురువుకూడా మంత్రోపదేశం చేసేటప్పుడు, సాధకుడు ఆ మంత్రాన్ని ఏ విధంగా జపం చెయ్యాలి ? దాని నియమ నిబంధనలు అన్నీ విపులీకరించి ఏవైనా పొరపాట్లు జరిగితే సరిదిద్దుతాడు. లేకపోతే సాధకుడు ఇబ్బందుల పాలవక తప్పదు. అందుకని సాధకుడు ఎప్పుడూ గురుముఖముననే దీక్ష తీసుకోవాలి.

ఆ రకంగా గురుముఖతః మంత్రం స్వీకరించి గురువునందే లక్ష్యం ఉంచి కొంతకాలం జపం చెయ్యాలి. ఆ తరువాత ఆశ్వయుజ శుద్ధ నవమినాడు గురువుకు పాదాబివందనం చెయ్యాలి. అప్పుడు గురువు తన చేతిని శిష్యుని తలపై ఉంచుతాడు. దీన్నే హస్తమస్తకసంయోగము అంటారు. ఈ రకంగా హస్తమస్తక సంయోగము చేసి మళ్ళీ మంత్రోపదేశం చేసి చతుర్విధైక్య లేక షడ్విధైక్య సంధానము, షట్చక్ర పూజా విధానము ఉపదేశిస్తాడు. దీనిని మహావేధ అంటారు. మహావేధ పూర్తి అయిన తరువాత భగవతి మణిపూరంలోకి ప్రవేశిస్తుంది. అక్కడ ఆమె చతుర్విధైక్య సంధానము చేసిన వారికి చతుర్భుజగాను, షడ్విధైక్య సంధానము చేసిన వారికి దశభుజగాను దర్శనమిస్తుంది. అందుకే సమయమతంలో రెండు రకాల సంధానాలు సమ్మతములే అని చెప్పబడింది.

చతుర్విధైక్య సంధానము చేసిన వారికి మణిపూరంలో దేవి దర్శన భాగ్యం ఏ విధంగా కలుగుతుందంటే చంద్రజ్ఞాన విద్యలో చెప్పినట్లుగా

**సూర్యమండల మధ్యస్థాం దేవీం త్రిపుర సుందరీం ।**

**పాశాంకుశ ధనుర్బాణ హస్తాన్ ధారయంతీం ప్రపూజయేత్॥**

ధనుర్బాణములు, పాశము, అంకుశము ధరించి ఉంటుంది. శంకర భగవత్పాదులు కూడా ఇంచుమించు ఇదే అభిప్రాయం వ్యక్తం చేస్తూ సౌందర్యలహరిలో

**క్వణత్కాఞ్చీదామా కరికలభ కుంభ స్తననతా**

**పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్రవదనా**

**ధనుర్బాణాన్ పాశం సృణి మపి దధానా కరతలైః**

అన్నారు. మణిపూరంలో ఉన్న దేవిని మానసికంగా అర్ఘ్యపాద్యాదులిచ్చి షోడశోపచార విధిని పూజించాలి. తరువాత దేవి అనాహత మందిరానికి ప్రవేశిస్తుంది. అక్కడ ఆమెకు ధూప, దీప, నైవేద్య, హస్త ప్రక్షాళన వరకు పూర్తి చెయ్యాలి. అప్పుడు దేవి విశుద్ధి చక్రం చేరి సింహాసనం మీద కూర్చొని చెలులతో ముచ్చటిస్తూ ఉంటుంది. అక్కడ దేవిని శుద్ధ స్ఫటికాలతో పూజించాలి. శుద్ధ స్ఫటికాలు అంటే విశుద్ధి చక్రంలోని పదహారు దళాలు మాత్రమే అని గుర్తించాలి. తరువాత దేవిని ఆజ్ఞాచక్రం చేర్చి నీరాజనాదులచే సంతోష పెట్టాలి.

షడ్విధైక్య సంధానం చేసిన వారికి దేవి మణిపూరంలో దశభుజగా దర్శనమిస్తుంది. అయితే కొంతమంది దేవి దశభుజ అని అంగీకరిస్తూ చేతులలో ఉన్న ఆయుధాల దగ్గర విభేదిస్తున్నారు. మణిపూరంలో దర్శన మిచ్చిన దేవి చతుర్భుజ అయినా, దశభుజ అయినా, సమ్మతమే అంటున్నారు లక్ష్మీధరులు, భాస్కరరాయలు మొదలగువారు. సూర్యమండలంలో ఉన్న ఆ దేవిని గనక పూజించినట్లైతే ముల్లోకాలు వశమవుతాయి అంటాడు కాళిదాసు.

**యే చింత యంత్యరుణ మండల మధ్యవర్తి**

**రూపం తవాంబ నవయావకపంకరమ్యమ్**

**తేషాం సదైవ కుసుమాయుధబాణభిన్న**

**వక్షస్థ్సలా మృగదృశో వశగా భవంతి॥**

**లఘుస్తవంలో చెప్పినట్లుగా :**

**"వామే పుస్తకధారిణీ మభయదాం సాక్షస్రజం దక్షిణే**

**భక్తేభ్యో వరదాన పేశలకరాం కర్పూరకుందోజ్జ్వలామ్।**

**ఉజ్జృంభాంబుజపత్రకాంతి నయన స్నిగ్ధప్రభాలోకనీం**

**యేత్వా మంబ న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః॥"**

చేతుల యందు పుస్తకము, అక్షమాల, అభయ, వరద, ముద్రలు ధరించి మల్లెపూల వలె ప్రకాశించు ఆ దేవిని ధ్యానించి నట్లైతే కవిత్వం సిద్ధిస్తుంది. అంబాస్తవంలో చెప్పినట్లుగా

**"యః స్ఫటికాక్షగుణ పుస్తక కుండికాభ్యాం**

**వ్యాఖ్యా సముద్యతకరాం శరదిందుశుభ్రామ్।**

**పద్మాసనాం చ హృదయే భవతీముపాస్తే**

**మాతః స విశ్వకవితాం కిం చక్రవర్తీ॥"**

చేతులయందు అక్షమాల, పుస్తకము, కమండలము ధరించి పద్మాసనాసీనయై శరత్కాల చంద్రబింబము వలె ప్రకాశించు దేవిని ఎవరైతే ధ్యానిస్తారో, వారికి ఈ లోకాలను సమ్మోహనం చేసే కవిత్వం సిద్ధిస్తుంది. అది ఇది అని ఎందుకు ? ఆ దేవిని కనక పూజించి  నట్లైతే సర్వ విజయాలు సిద్ధిస్తాయి.

**ఏవం యః స్మరతి ప్రబుద్ధ సుమతిః-శ్రీమత్స్వ రూపం పరం ।**

**వృద్ధోఽ ప్యాశు యువా, భవ త్యనుపమః- స్త్రీణా మనంగాయతే ।**

**సోఽ ప్యైశ్వర్య తిరస్కృతాఖిల సురః- శ్రీజృంభితాత్మాలయః ।**

**పృథ్వీపాల కిరీట కోటి వలభీ - పుష్పార్చితాంఘ్రి ర్భవేత్.**

ఆ దేవిని పూజించి ఆమె కృపకు పాత్రులైన వారికి ముల్లోకాలు వశమౌతాయి. సకల సంపదలు సమకూరుతాయి. లోకపాలకులు (రాజులు, అధికారులు) అందరూ అతనికి పాదాభివందనం చేస్తారు.

**త్వాం వ్యాపినీతి సుమనా ఇతి కుండలీతి**

**త్వాం కామినీతి కమలేతి కళావతీతి**

**త్వాం మాలినీతి లలితే త్యపరాజితేతి**

**దేవీ స్తువంతి విజయేతి బయే త్యుమేతి**

అక్కడ దేవి లక్ష్మీధరుడు "కర్ణావతంస స్తుతి" లో చెప్పినట్లుగా

**ఆజ్ఞాత్మక ద్విదళ పద్మగతే తదానీం**

**విద్యున్నిభే రవి శశి ప్రయుతోత్కటాభే**

***గండస్థల ప్రతిఫల త్కరదీపజాల***
***కర్ణావతంసకలికే కమలాయతాక్షి.***

ఆజ్ఞాచక్రము అనబడే ద్విదళ పద్మంలో దేవి మెరుపు తీగలాగా పది లక్షల సూర్య చంద్రుల కాంతితో, తామర పూల వలె విశాలమైన కనులు కలిగి ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ రకంగా ఉన్న దేవి సౌదామిని వలె సహస్ర కమలంలోకి ప్రవేశించి

***సుధాసిన్ధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే***
***మణిద్వీపే నీపోపవనవతి చిన్తామణిగృహే***
***శివాకారే మఞ్చే పరమశివపర్యఙ్కనిలయామ్***

అన్నట్లుగా బ్రహ్మరంధ్రం దగ్గర ఉన్న సుధాసింధువులోని మణి ద్వీపంలో కల్ప వృక్ష చ్ఛాయలో, చింతామణి గృహంలో త్రికోణాకార మంచంమీద పరమశివునితోకూడి సుఖిస్తూ ఉంటుంది. ఈ రకంగా సహస్ర కమలంలో ఉన్న దేవినే సమయాచారులు పూజిస్తారు.

ఆధార చక్రంలో కుండలినీశక్తి నిద్రిస్తూ ఉంటుంది. ఆ శక్తిని మేల్కొల్పినట్లైతే అది ఊర్ధ్వముఖంగా బయలుదేరి రుద్రగ్రంథిని భేదించి సాధకుని మాయను తొలగించి స్వస్వరూప జ్ఞానం కలిగిస్తుంది. తరువాత విష్ణుగ్రంథిని భేదించి అంతా మిథ్య అని తెలియచేస్తుంది. ఆ తరువాత బ్రహ్మగ్రంథిని భేదించి సృష్టిస్థితి లయలు అంతా మిథ్య అని తెలియచేసి చిదానందాన్ని కలిగిస్తుంది. ఆ తరువాత ఆ శక్తి సహస్రారం చేరుతుంది. అదే దేవి ఉండే ప్రదేశము. అక్కడ దేవి విద్యుల్లతవలె ప్రకాశిస్తుంది. సహస్రారంలో దేవిని కొలిచిన వారికి అమృతత్వం లభిస్తుంది. జన్మసార్థకమౌతుంది. సాధకునికి నేను అనే భ్రాంతి తొలగి జీవాత్మ పరమాత్మలో లీనమౌతుంది. ఈ రకంగా సాధకుడు సాయుజ్యంపొంది శాశ్వతమైన ఆనందం అనుభవిస్తాడు.

## సుభగోదయ స్తుతిః

భవాని త్వాం వందే భవమహిషి సచ్చిత్సుఖ వపుః
పరాకారాం దేవీ మమృతలహరీ మైందవ కళామ్ ।
మహాకాలాతీతాం కలితసరణీ కల్పితతనుం
సుధాసింధోరంతర్వసతిమనిశం వాసరమయీమ్ ॥ 1

మనస్త్వత్త్వం జిత్వా నయన మథనాసాగ్ర ఘటితం
పునర్వ్యా వృత్తాక్షః స్వయమపి యదా పశ్యతి పరామ్ ।
తదానీ మేవాస్య స్ఫురతి బహిరంతర్భగవతీ
పరానందాకారా పరశివపరా కాచిదపరా ॥ 2

మనోమార్గం జిత్వా మరుత ఇహనాడీ గణజుషో
నిరుధ్యార్కం సేందుం దహనమపి సంజ్వాల్య శిఖయా ।
సుషుమ్నాం సంయోజ్య శ్లథయతిచ షడ్గ్రంధి శశినం
తవాజ్ఞాచక్రస్థం విలయతి మహాయోగి సమయీ ॥ 3

యదాతౌ చంద్రార్కౌ నిజసదన సంరోధ నవశా
దశక్తౌ పీయూష స్రవణహరణే సా చ భుజగీ ।
ప్రబుద్ధా క్షుత్క్రుద్ధా దశతి శశినం బైందవగతం ।
సుధాధారాసారైః స్నపయతి తనుం బైందవకళే ॥ 4

పృథివ్యాప స్తేజః పవన గగనే తత్ప్రకృతయః
స్థితా స్తన్మాత్రాస్తా విషయదశకం మానసమితి ।
తతో మాయావిద్యా తదనుచ మహేశః శివ ఇతి
పరం తత్త్వాతీతం మిలిత వపురిందోః పరకళా ॥ 5

కుమారీ యన్మంద్రం ధ్వనతిచ తతో యోషి దపరా
కులం త్యక్త్వా రౌతి స్ఫుటతిచ మహాకాలభుజగీ ।
తతః పాతివ్రత్యం భజతి దహరాకాశ కమలే
సుఖాసీనా యోషా భవసి భవసీత్కార రసికా ॥ 6

త్రికోణం తే కౌలాః  కుల గృహమితి ప్రాహు రపరే
చతుష్కోణం ప్రాహుః సమయిన ఇమే బైందవమితి ।
సుధాసింధౌ తస్మిన్ సురమణిగృహే సూర్య శశినో ।
రగమ్యే రశ్మీనాం సమయ సహితే త్వం విహరసే ॥ 7

త్రిఖండం తే చక్రం శుచిరవి శశాంకాత్మకతయా
మయూఖైః షట్త్రింశద్దశయుతతయా ఖండకలితైః !
పృథివ్యాదౌ తత్త్వే పృథగుదితవద్భిః పరివృతం
భవేన్మూలాధారా త్ప్రభృతి తవషట్చక్ర సదనమ్ !! 8

శతంచాష్టావహ్నేః శతమపికళాః షోడశ రవేః
శతంషట్చత్రింశత్సితమయ మయూఖా  శ్చరణజాః !
య ఏతే షష్టిశ్చ త్రిశతమభవం స్త్వచ్చరణజాః
మమాకౌశైస్తస్మా న్నహి తవ శివే కాలకలనా !! 9

త్రికోణం చాధారం త్రిపుర  వినుతే ష్టార మనఘే
భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురమ్
దశారం తే సంవిత్కమల మథ మన్వస్రక మువే
విశుద్ధం స్యాదాజ్ఞాశివ ఇతి తతో బైందవగృహమ్ ॥ 10

త్రికోణేతే వృత్తత్రితయ మిభకోణే వసుదళం
కళాస్రం మిస్రారే భవతి భువనాస్రే చ  భువనమ్!
చతుశ్చక్రం శైవం నివసతి భగే శాక్తికమువే
ప్రధానైక్యం షోఢా భవతి చ తయోః శక్తి శివయోః ॥ 11

కలాయాం బింద్వైక్యం తదను చ తయోర్నాదవిభవే
తయోర్నాదేనైక్యం తదను చ కలాయామపి తయోః
తయోర్బిందావైక్యం త్రితయవిభవైక్యం పరశివే
తదేవం షోఢైక్యం భవతి హి సపర్యా సమయినామ్॥ 12

కళా నాదో బిందు ః క్రమశ ఇహ వర్ణాశ్చ చరణం
షడబ్జంచాధార ప్రభృతిక మమీషాం మిలనమ్!
తదేవం షోఢైక్యం భవతి ఖలు యేషాం సమయినాం
చతుర్ధైక్యం తేషాం భవతి హి సపర్యా సమయినామ్॥ 13

తటిల్లేఖా మధ్యే స్ఫురతి మణిపూరే భగవతీ
చతుర్ధైక్యం తేషాం భవతి చ చతుర్బాహు రుదితా!
ధనుర్బాణా నిక్షూద్భవకుసుమజానంకుశవరం
తథా పాశం బిభ్రత్యుదిత రవి బింబాకృతి రుచిః !! 14

భవత్త్రైక్యంషోఢా భవతి భగవత్యాః సమయినాం
మరుత్వత్కోదండ ద్యుతినియుత భాసా సమరుచిః !
భవత్పాణివ్రాతో దశవిధ ఇతీదం మణిపురే
భవాని ప్రత్యక్షం తవ వపురుపాస్తే నహి పరమ్ ॥ 15

భవాని శ్రీహస్తైః వహసి ఫణిపాశం సృణి మథో
ధనుః పౌండ్రం పౌష్పం శరమథజవస్రక్పుకవరౌ !
అథద్వాభ్యాం ముద్రామభయవరదానైక రసికాం
క్వణద్వీణాం ద్వాభ్యాం త్వమురసి కరాభ్యాం చ భిభృషే ॥ 16

త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ
ద్దశారంభూగేహాదపిచ భువనాశ్రం సమభవత్ !
తతోఽ భూన్నాగారం నృపతిదళమస్మా త్త్రివలయం
చతుర్ద్వాః ప్రాకారత్రితయమిదమేవాంబ శరణమ్ ॥ 17

చతుష్షష్టి స్తంత్రాణ్యపి కులమతం నిందితమభూ
ద్యదేతన్మిశ్రాఖ్యం మతమపిభ వే న్నిందితమిహ
శుభాఖ్యాః పంచైతాః శ్రుతినరణిసిద్ధాః ప్రకృతయో
మహావిద్యాస్తాసాం భవతి పరమార్థో భగవతీ ॥ 18

స్మరో మారో మారః స్మర ఇతి వరో మార మదనః
స్మరానంగశ్చేతి స్మరమదన మారాః స్మర ఇతి!
త్రిఖండః ఖండాంతే  కలిత భువనేశ్యక్షరయుత
శ్చతుః పంచార్ణాస్తే త్రయ ఇతి చ పంచాక్షరమనుః !! 19

త్రిఖండే త్వన్మంత్రే శశి సవితృవహ్న్యాత్మకతయా
స్వరాశ్చంద్రే లీనాః సవితరి కళాః కాదయ ఇహ
యకారాద్యా వహ్నౌ పథకషయుగం బైందవగృహే
విలీనం సాదాఖ్యే శివ యువతి నిత్యైందవ కళే॥ 20

కకారాకారాభ్యాం స్వరగణ మవష్టభ్య నిఖిలం
కలాప్రత్యాహారాత్సకల మభవ ద్వ్యంజన గణః
త్రిఖండే స్యాత్ప్రత్యాహరణ మిద మన్వక్షయుగం
క్షకారాశ్చక్రాఽ సరోక్షర తనుతయా చాక్షరమితి॥ 21

విదేహేంద్రాపత్యం శ్రుత ఇహ ఋషిర్యస్య చ మనో
రయంచార్థః సమ్యక్ఛ్రుతి శిరసి తైత్తిర్యక ఋచి
ఋషిం హిత్వాచాస్యా హృదయ కమలే నైతమృషిమి
త్యృచాభ్యుక్తః పూజావిధిరిహ భవత్యాః సమయినామ్॥ 22

'త్రిఖండ స్త్వన్మంత్ర స్తవచ సరఘాయాం నివిశతే
శ్రియోదేవ్యాః శేషో యుత ఇహసమస్తాః శశికళాః!
త్రిఖండే త్రైఖండ్యం నివసతి సమంత్రే చ సుభగే
షడబ్జారణ్యానీ, త్రితయయుత ఖండే నివసతి॥ 23

త్రయం చైతత్స్వాంతే పరమశివ పర్యంక నిలయే
పరే సాదాఖ్యేఽస్మిన్ని వసతి చతుర్ధైక్య కలనాత్ !
స్వరాస్తే లీనాస్తే భగవతి కళాశ్రే చ సకలాః
కకారాద్యావృత్తే తదను చతురశ్రే చ యముఖాః 24

అలో బిందు ర్వర్గాష్టక మిభదళం శాంభవవపుః
చతుశ్చక్రం శక్రస్థిత మనుభయం శక్తి శివయోః
నిశాద్యా దర్శాద్యాః శ్రుతినిగదితాః పంచ దశధా
భవేయుర్నిత్యాస్తా స్తవజనని మంత్రాక్షరగణాః ॥ 25

ఇమాస్తాః షోడశ్యాస్తవచ సరఘాయాం శశికళా
స్వరూపాయాం లీనా నివసతి తవశ్రీ శశికళా
అయం ప్రత్యాహరః శ్రుత ఇహ కళా వ్యంజనగణః
కకారేణాకారః స్వరగణ మశేషం కథయతి ॥ 26

క్షకారః పంచాశత్కల ఇతి హలో బైందవగృహం
క్షకారా దూర్ధ్వం స్యాజ్జనని తవ నామాక్షరమితి
భవేత్పూజాకాలే మణిఖచిత భూషాభిరభితః
ప్రభాభిర్వ్యాలీఢం భవతి మణిపూరం సరసిజమ్ ॥ 27

వదంత్యేకే వృద్ధా మణిరితి జలం తేన నిబిడం
పరేతు త్వద్రూపం మణిధనురితీదం సమయినః!
అనాహత్యా నాదః ప్రభవతి సుషుమ్నా ధ్వజనిత
స్తదా వాయో స్తత్ర ప్రభవ ఇద మాహుః సమయినః ॥ 28

తదేతత్తే సంవిత్కమలమితి సంజ్ఞాంతరముమే
భవేత్సంవిత్పూజా భవతి కమలేఽస్మిన్ సమయినామ్!
విశుద్ధాఖ్యే చక్రే వియదుదితమాహుః సమయినః
సదాపూర్వోదేవః శివ ఇతి హిమానీ సమతనుః 29

త్వదీయై రుద్యోతైర్భవతిచ విశుద్ధాఖ్య సదనం
భవేత్పూజాదేవ్యా హిమకరకళాభిః సమయినామ్ !
సహస్రారే చక్రే నివసతి కళా పంచదశకం
తదేతన్ని త్యాఖ్యం భ్రమతి సితపక్షే సమయినామ్ ॥ 30

అతః శుక్లేపక్షే ప్రతిదిన మిహ త్వాం భగవతీం
నిశాయాం సేవంతే నిశి చరమభాగే సమయినః
శుచిః స్వాధిష్ఠానే రవిరుపరి సంవిత్సరసిజే
శశీ చాజ్ఞా చక్రే హరహరి విధి గ్రంథయ ఇమే॥ 31

కళాయాః షోడశ్యాః ప్రతిఫలితబింబేన సహితం
తదీయైః పీయూషైః పునరధికమాప్లావిత తనుః!
సితేపక్షే సర్వా స్తిథయ ఇహకృష్ణేఽపిచసమా
యదా చామావాస్యా భవతి నహి పూజ సమయినామ్॥ 32

ఇడాయాం పింగళ్యాం చరత ఇహ తౌ సూర్యశశినౌ
తమ స్యాధారే తౌ, యదితు మిళితౌసా తిథి రమా
తదాఽజ్ఞా చక్రస్థం శశిరకర బింబే రవి నిభం
ధృఢవ్యాలీఢం సద్విగళిత సుధాసార విసరమ్॥ 33

మహావ్యోమ స్థేందోరమృత లహరీ ప్లావిత తనుః
ప్రశుష్యద్వై నాడీ ప్రకరమనిశం ప్లావయతి తత్ !
యదాజ్ఞాయాం విద్యున్ని యుతనియుతా భాక్షరమయీ
స్థితా విద్యుల్లేఖా భగవతి విధిగ్రంథి మభినత్॥ 34

తతోగత్వా జ్యోత్స్నామయ సమయలోకం సమయినాం
పరాఖ్యా సాదాఖ్యా జయతి శివతత్త్వేన మిళితా
సహస్రారే పద్మే శిశిర మహసాం బింబ మపరం
తదేవ శ్రీచక్రం సరఘమితి తద్బైందవమితి॥ 35

వదంత్యేకే సంతః పరశివపదే తత్త్వమిళితే
తతస్త్వం షడ్వంశా భవతి శివయో ర్మేళనవపుః
త్రిఖండేఽస్మిన్ స్వాంతే పరమపద పర్యంకసదనే
పరే సాదాఖ్యేఽస్మిన్ని వసతి చతుర్ధైక్య కలనాత్॥ 36

క్షితౌ వహ్నిర్వహ్నౌ వసురథజలే దిఙ్మరుతి ది
క్కలాశ్రే మన్వశ్రం దృశివసురథోరాజకమలే !
ప్రతిద్వైత గ్రంథి స్తదుపరి చతుర్ద్వార సహితం
మహీచక్రం చైకం భవతి భగ కోణైక్య కలనాత్॥ 37

షడబ్జారణ్యే తాం సమయిన ఇమే పంచకసమాం
యదా సంవిద్రూపాం విదధతి చ షోడైక్య కలితామ్
మనో జిత్వా చాజ్ఞాసరసిజ ఇహ ప్రాదురభవ
త్తటిల్లేఖానిత్యా భగవతి తవాధార సదనాత్॥ 38

భవత్సామ్యం కేచిత్త్రితయమితి కౌంభప్రభృతయ
పరంతత్త్వాఖ్యం చే త్యపర మిదమాహుః సమయినః !
క్రియావస్థారూపం ప్రకృతిరభిధా పంచకసమం
తదేషాం సామ్యం స్యాదవనిషుచయో వేత్తి స మునిః॥ 39

వశిన్యాద్యానిత్యా అకచటతపాద్యాః ప్రకృతయః
స్వవర్గస్థాః స్వస్వాయుధకలితహస్తాః స్వవిషయాః !
యథావర్గం వర్ణప్రచురతనవో యాభిరభవం
స్తవప్రస్తారా స్త్రేత్రయ ఇతి జగుస్తే సమయినః॥ 40

ఇమా నిత్యా వర్ణా స్తవచరణ సంమేళనవశా
న్మహామేరుస్థాః స్యుర్మను మిలనకైలాసవపుషః !
వశిన్యాద్యాఏతా అపితవ సబింద్వాత్మకతయా
మహీప్రస్తారోఽయం క్రమ ఇతి రహస్యం సమయినామ్॥ 41

భవేన్మూలాధారం తదుపరితనం చక్రమపి త
ద్వయం తౌమిస్రాఖ్యం శిఖికిరణ సంమేళనవశాత్ !
తదేతత్ కౌలానాం ప్రతిదిన మనుష్ఠేయముదితం
భవత్యా వామాఖ్యం మతమపి పరిత్యాజ్య ముభయమ్॥ 42

అమీషాం కౌలానాం భగవతి భవేత్పూజనవిధి
స్తవ స్వాధిష్ఠానే తదనుచ భవేన్మూల సదనే ।
అతో బాహ్యాపూజా భవతి భగరూపేణ చ తతో
నిషిద్ధాచారో యం నిగమ విరహో ఽ నింద్య చరితే॥ 43

నవవ్యూహం కౌలప్రభృతిక మతం తేన స విభు
ర్న వాత్మా దేవో ఽ యం జగదుదయకృ ద్భైరవవపుః !
నవాత్మా వామాది ప్రభృతిభిరిదం భైరవవపు
ర్మహాదేవీ తాభ్యాం జనకజననీమజ్జగదిదమ్॥ 44

భవే దే తచ్చక్ర ద్వితయ మతిదూరం సమయినాం
విసృజ్యైత ద్యుగ్మం తదను మణిపూరాఖ్య సదనే ।
త్వయా సృష్టైర్వారి ప్రతి ఫలిత సూర్యేందుకిరణై
ర్ద్విధాలోకే పూజాం విదధతి భవత్యాః సమయినః॥ 45

అధిష్ఠానాధార ద్వితయ మిదమేవం దశదళం
సహస్రారాజ్జాతం మణిపురమతో, భూద్దశదళమ్ !
హృదంభోజన్మూలాన్నృపదళ మభూత్స్వాంతకమలం
తదేవైకో బిందుర్భవతి జగదుత్పత్తికృదయమ్॥ 46

సహస్రారం బిందుర్భవతిచ తతో బైందవగృహం
తదేతస్మాజ్జాతం జగదిద మశేషం సకరణమ్ !
తతో మూలాధారా ద్ద్వితయమభవత్తద్దశదళం
సహస్రారాజ్జాతం తదతి దశధా బిందురభవత్॥ 47

తదుతద్బిందోర్యద్దశక మభవత్తత్ప్ర కృతికం
దశారం సూర్యారం నృపదళమభూత్స్వాంత కమలమ్!
రహస్యం కౌలానాం ద్వితయమభవన్మూలసదనం
తథాధిష్ఠానంచ ప్రకృతి మిహ సేవంత ఇహ తే॥ 48

అతస్తే కౌలాస్తే భగవతి దృఢ ప్రాకృత జనా
ఇతిప్రాహుః ప్రాజ్ఞాః కులసమయ మార్గద్వయవిదః !
మహాంతః సేవంతే సకలజననీం బైందవగృహే
శివాకారాం నిత్యా మమృతఝరికామైందవ కళామ్॥ 49

ఇదంకాలోత్పత్తి స్థితి లయకరం పద్మనికరం
త్రిఖండం శ్రీచక్రం మను రపిచ తేషాంచ మిలనమ్!
తదైక్యం షోఢావా భవతిచ చతుర్ధేతి చతథా
తయోః సామ్యం పంచప్రకృతికమిదం శాస్త్రముదితమ్॥ 50

ఉపాస్తే రేతస్యాః ఫలమపిచ సర్వాధికమభూ
త్తదేత త్కౌలానాం ఫలమివహి చైతత్సమయినామ్ !
సహస్రారేపద్మే సుభగ సుభగో దేతిసుభగే
పరం సౌభాగ్యం యత్తదిహతవ సాయుజ్యపదవీమ్॥ 51

అతో ఽ స్యాః సంసిద్ధౌ సుభగ సుభగాఖ్యా గురుకృపా
కటాక్ష వ్యాసంగా త్స్రవద మృత నిష్యంద సులభా!
తయావిద్ధో యోగీ విచరతి నిశాయామపి దివా
దివాభానూ రాత్రౌ విధురివ కృతార్థీ కృతమతిః॥ 52

శ్రీ శ్రీ శ్రీ గౌడపాదాచార్య విరచిత సుభగోదయస్తుతికి హరితసగోత్రీకుడు, శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ, శ్రీకృష్ణమూర్తి గార్ల ప్రథమపుత్రుడు అయిన

**క్రోవి పార్థసారథి**

**సర్వజనామోదము పొందునట్లుగా సులభ శైలిలో వ్రాసిన**

**"శ్రీవిద్యాదర్పణము"** **అను తెలుగు వ్యాఖ్యానము సమాప్తము.**

***ఓం తత్సత్***